మాస్టర్ C.V.V. నమస్కారం

# ప్రజ్ఞా ప్రభాకరము

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి
ఆత్మకథాత్మక అంతరాత్మ కథనము



సరళమైన తేటతెనుగున వినిపించినవారు :

## వేటూరి ఆనందమూర్తి

యోగ పారిజాతము ప్రచురణ :

## ప్రభాకర ధ్యాన మండలి

చినకాకాని,
మంగళగిరి మండలం, గుంటూరు జిల్లా - 522 503.

# ప్రజ్ఞా ప్రభాకరము

**గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి**
**ఆత్మకథాత్మక అంతరాత్మ కథనము**

వినిపించిన వారు : **శ్రీ వేటూరి ఆనందమూర్తి**

విన్నవారు : **శ్రీమతి వారణాసి సుజాత, డా॥ వేటూరి వివేక్,**
**సుకన్యా గణేశన్, వై.యన్.యస్. చౌదరి, శ్యామల**
**వంశీకృష్ణ, గ్రిద్దలూరి కుటుంబ సభ్యులు.**

**ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి 2020**
**ప్రతులు : 1000**

© Copyright reserved

**వెల : రూ. 100**

Designed & Printed at :
**Sai Harsha Print Zone**
Dilsukhnagar, Hyderabad.
Cell : 9248523604

**ప్రాప్తి స్థానము :**
**ప్రభాకర ధ్యాన మండలి**
**చినకాకాని,**
**మంగళగిరి మండలం,**
**గుంటూరు జిల్లా - 522 503.**
**ఫోన్ : 8500361016, 7382033300.**

# విషయ సూచిక

మాస్టర్ సి.వి.వి. నమస్కారం

# కృతజ్ఞతలు

మన దేశంలోని మాస్టర్ సి.వి.వి. సత్యయోగ సాధకులకు ప్రజ్ఞా ప్రభాకరము నిత్య పారాయణ గ్రంథముగా ఉన్నది. అయితే, ఈ తరం యువకులైన యోగ సాధకులు కొందరు సప్రయోజనంగా వాడిన ఈ గ్రంథం లోని సరళ గ్రాంథికాన్ని పూర్తిగా జీర్ణించుకోలేకపోతున్నారన్న కారణంగా, మనసు ఒప్పుకున్నా – వారి కొఱకే, వారి కోరిక మేరకే – దీనిని మరింత సరళ తరం చేసి అందించే యత్నం చేస్తున్నాము. ఇది అందరికీ రుచిస్తుందనీ భావిస్తున్నాము. ఎక్కడైనా, ఎవరికైనా, ఇందులో శైలీభేదం ఎబ్బెట్టుగా గోచరిస్తే క్షంతవ్యులము. ఇది ప్రభాకరుల ప్రజ్ఞాప్రభాకరమునకు వేటూరి ఆనందమూర్తి పునర్వచించిన తేలిక తెలుగు సేత.

గురుదేవులు, నాయనగారు, తమ జీవిత చరిత్రను రాసుకొంటూ వెళ్లారే గాని, ప్రకరణ శీర్షికలను, పాద సూచికలను చేర్చలేదు. వారి హృదయ మెరిగిన శిష్యులు శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్య గారు ప్రజ్ఞా ప్రభాకరం ప్రథమ ముద్రణం ప్రెస్సు ప్రతిని సమకూర్చే సందర్భంలో ప్రకరణల విభాగము, వాని శీర్షికలు సమకూర్చారు. పాద సూచికలూ, పద్యాలూ, చిత్రాలూ వగైరాలన్నీ తరువాతి కాలంలో మేము ఆకరాలను గుర్తిస్తూ క్రమంగా చేర్చినవి. తెలియని చోట్ల ప్రశ్నార్థక చిహ్నాలతో విడిచితిమి. ఈ పుస్తకములో పేర్కొన్న ఇంకా కొందరు ప్రముఖుల ఫోటోలు లభించలేదు. ఈ పుస్తకం చదివిన వారు ఆ ఫోటోలు లభ్యమైనచో ప్రచురణకర్తలకు పంపకోరుచున్నాము.

మాస్టర్ సీ.వీ.వీ. వారి యోగ మార్గాన్ని తు.చ.తప్పక పాలించి వ్యాప్తికి తెచ్చిన వారిలో గురుదేవులు శ్రీ వీపీఎస్ వారు అగ్రగణ్యులు. అట్లే శ్రీవారి మార్గాన్నే అనుసరించి వారు తరించి, ఇతరులను తరింప జేసిన, చేస్తున్న ప్రముఖ శిష్యులెందరో మహనీయులు ఉన్నారు. వారిలో ప్రముఖులైన మాతృశ్రీ చాగంటి కల్పవల్లిగారు, “సీసా”గా ప్రసిద్ధులైన గురుదేవులు శ్రీ ఏవీఎస్‌గారు (ఏవీ శ్రీనివాసాచార్యులు) ఒకరు, “తాతగారు”గా ప్రఖ్యాతులైన గురుదేవులు శ్రీ రామకోటయ్య తాతగారు ఒకరు. ఈ ముువ్వురు మహాయోగ తపస్సంపన్నులైన గురుపూజ్యులను మేమిక్కడ భక్తితో స్మరిస్తున్నాము.

ఇక ఎంత ఇచ్చినా ఋణం తీర్చుకోలేనంతగా ఆర్థికంగానూ, హార్దికంగానూ సహకరించి చేయూత నొసగిన శ్రీ చింతగుంట శివానందరావు కుటుంబ సభ్యులకు, ఇతర యోగమిత్రులకు, యోగమిత్రులు శ్రీ వై ఎస్ ఎస్ చౌదరి కుటుంబ సభ్యులకు, శ్రీమతి సుకన్యా గణేశన్ కుటుంబ సభ్యులకు, సర్వశ్రీ కొత్త, చాగంటి, పోచిరాజు మున్నగు వేటూరి విశ్వకుటుంబ సభ్యులకు మా ప్రత్యేకమైన అభినందనలు, కృతజ్ఞతాశీఃపూర్వకములైన శుభాశయాలు ప్రకటిస్తున్నాము.

ఈ కృషిలో వయసు మీద పడిన నాకు అనేక విధాల తోడుపడి సహాయ పడిన వారు పలువురు చిరంజీవులు. వారిలో మరీ ముఖ్యులు చి.సౌ. సుకన్యా గణేశన్, శ్రీ కే. గణేశన్, చి. సుజాత వారణాసి, చి.సౌ. శ్యామలమ్మ, చి. వినతా రామమూర్తి, గ్రిద్దలూరి వారి కుటుంబసభ్యులు మున్నగువారు. వారందరికీ మా శుభాశయాలు. ప్రెస్సు పని ఆరంభించి బహుకాలమైనా ఏ మాత్రము విసుగుకొనకుండా గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది మాతో సహకరించిన "సాయి హర్ష ముద్రణ సంస్థ" వారి అధినేత శ్రీ కే. హరిప్రసాద్ గారికి కృతజ్ఞతలు.

**– వేటూరి ఆనందమూర్తి**

# దివ్య దర్శనము

గురుచరణారవిందములకుం బ్రణమిల్లి తదీయ సత్కృపా
భర పరిసంస్కృతంబులగు భావములన్ వెలయించి తత్త్వ వి
స్ఫురణము లోకమందు బరిపూర్ణము కాగలదన్న వేడ్క పొం
పిరిగొన జెప్పెదన్ నిజము పెంచి సముంచితమైన సత్కృతిన్.

పండ్రెండేండ్లిటు వంటి సంశయములే బాధింపగా నెన్ని యో
మంద్రాటంబులు గాంచితిన్ దొరకె నమ్మందగ్గ సన్మార్గ మో
తండ్రుల్, సర్వము నీశ్వరేచ్ఛ నడుపున్ దత్కృత్యముల్ గూఢముల్
కంద్రుంగానరు మానవుల్ తమ కహంకారంబు పైకొంటచేన్.

నా చిత్తంబు పరీక్ష చేసుకొనుచున్నాడన్ యథార్థంబుగా
బోచంతైనను దుష్ప్రవర్తనము దుర్భోధం బెఱుంగన్ బవి
త్రాచారంబున బ్రహ్మతత్త్వ పరమార్థానందముం గూర్చి యా
లోచింతుం బలవింతు జింతులుదు నేలో నన్ను వంచించుటల్?

ఈశ్వరు డొక్కరుండు కలఁడేయని యొప్పిన యప్పు డాతడున్
నశ్వరుడౌనె యజ్ఞుఁడగు నావలె గాక యనంత శక్తియున్
శాశ్వతుఁడేని తత్కృతియు శాశ్వతమై విలసిల్ల కేటికీ
విశ్వము నశ్వరం బయి యవిజ్ఞతతో వెతలందగా వలెన్?

చక్షుర్గోచర మైన యీ జగతికిం జాటై యనేకాద్భుత
ప్రేక్షాలక్షిత మెంత యేన్ గలదు తద్విజ్ఞాన సర్వస్వమున్
లక్షింపందగు శక్తి మర్త్యులకు గల్గన్ లేద, యద్దాన బ్ర
త్యక్షం బైనది నీ కొకింత యటు మాటై యింక నేమున్నదో.

ఎఱుగ న్నేరర కాని యీశ్వరుడు తానేమేమి కావించు న
త్తెఱగెల్లన్ మునుమున్న సూచనలచే దెల్పించు విజ్ఞాత్మకుల్
గుఱుతింపం దగున ట్లెఱుంగుదును గైకోవన్న! నాయన్న! యీ
చిఱుదిండ్లన్ నెలనాళ్ళ దాక! నటుపై జేకూరు నీ కామ్యముల్

**– వేటూరి ప్రభాకరశాస్త్రి**

# గురుస్తుతి

**ని**ండు మనంబు నవ్య నవనీత సమానము అంతకంటెనున్
పండిన తేనె సోనలకు పాదులుగా నొనరించి వెన్నెలల్
నిండుగ ప్రేమ యార్ద్రతలు నిండిన తీయని కన్నుదోయితో
గుండెలదూరి పుణ్యముల గూర్చెడి చల్లని చూపు జొన్పుచున్
దండిగలోని పాపము లదల్చుచు చల్లని చూపు జొన్పుచున్
మెండగుమంచి నెయ్యెడన మేల్కొన జేసెడియట్టి చూపుతో
మండెడి కామక్రోధముల మండక యుండగ జేయువానయై
ఉండక యూడు ప్రాణముల నుండెడియట్టుల చేయు శక్తియై
పండకమగ్గు యోగముల పండెడియట్టుల చేయు యాగమై
ఇండనికోరు కోరికనెల్లను నిచ్చెడి యట్టి కేంద్రమై
పొండని రోగబాధలను పోవగద్రోలెడునట్టి వైద్యుడై
రండని యోగసిద్ధులను రమ్మని పిల్చెడి యట్టి యోగియై
దండము పెట్టు వారల యెదంగల భక్తికి మెచ్చి యెప్పుడన్
నిండిన ప్రేమ ఆదరము నేర్పిన వారి తనంతవారిగా
నుండెడియట్లు చేయగల యుత్సకతం గలయట్టి యొజ్జయై
యెండని యాస యూసులను ఎండగ జేయగజాలుఎండయై
పండిన బ్రహ్మతేజమొక ప్రాకృత రూపము తోడవెల్గుచున్
ఉండెను తిర్పతిన్ వెనుక ఉన్నది యిప్పుడు చూడనంతటన్
ఉండును ఎల్లకాలమును ఉజ్వలమై ధృవతారయోయనన్
నిండగు లోని చూపుగల నేత లెరుంగుదురీ **ప్రభాకరున్!**

గండుపులుల్ జరామృతుల కాలను గేలను గెంటి వేయగా
దిండగు "మానుస్ట్రీ" మనెడి ధీయుత శక్తి ప్రచోదితంబుగా
మండని మొద్దులైన మము మండగజేసెడి సంవిదగ్నియై
కుండలవోలె పిట్లిచన కుండగ గాచెడి యోగధారయై
"ఉండగవచ్చు" దండధరునూపుల కాగగజాలు నట్టి దొ
క్కండగు దివ్య యోగమొకటున్నది, దానిని ఆశ్రయింపుడీ
రండివె 'కాంగ్రిగేషనులు' రండిటచేయుడు యోగ సాధనల్
దండితనంబు నిల్కడయు దర్పము నేర్పును సత్యదీప్తి భూ
మండలమందునన్ నిలిపి మానవు దేవునిగాగజేయు నే
ర్పుండును మీకు – మీ వలన ఉజ్జ్వలకాంతులు పర్వునంతటన్!
బెండులవోలె తేలికగ బీటలువారుచు జారు మానవుల్
గండుశిలల్ వలెన్ నిలిచి కాలుని తాకుల కాగగల్గిన
ట్లుండెడు దివ్యతేజమున నుత్సవముల్ వొనరింతురెప్పుడున్
గండుశిలల్ ఉలిన్ మలిచి కమ్మని దేవతరూపు నిచ్చిన
ట్లుండును మానవుండు భువి నుజ్జ్వలుడై మనయోగసాధనల్
పండగ సర్వభూ ప్రజకు పావన యోగము తెచ్చి యిచ్చెడిన్
ఒండొకచూపు లేక తమరొక్కటి దృష్టిన సాధనంబుచే
యుండొక కొంకు లేక సదయుండగు మాస్టరు **సీవివీకృపన్**

**– కొత్త రామకోటయ్య**

మాస్టర్ **సీవీవీ** నమస్కారమ్

# మనవి

పితృపాదులు శ్రీ ప్రభాకర శాస్త్రిగారి "ప్రజ్ఞా ప్రభాకరము" సాధకులకు దివ్యోద్బోధము నందించి పథ నిర్దేశము గావించు అమూల్య రచనము. తదనుగుణముగనే యోగ మిత్రులందరకు అది అందుబాటులో ఉండుట తగునన్న విశుద్ధమగు సంకల్పముతో నట్లే ఆ గ్రంథము తొలుత "అమూల్యము"గనే శ్రీ శాస్త్రి గారి ప్రథమ వర్ధంతి (1951) సందర్భమున మా సమ్మతితో ప్రకటింపబడినది. సమ్మతి మాదైనను నాటి ఆ సంకల్పము, తన్నిర్వాహము గురుదేవుల ప్రియ శిష్యులు యోగమిత్రులు అయిన కీ॥శే॥ కంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠిగారిది. వారు దానికైన వ్యయమును సంపూర్ణముగా భరించిరి. అమూల్య మగుటచే మేము దానిని వెలకమ్మలేదు. ఇట్లు శ్రీ సత్యనారాయణ శ్రేష్ఠిగారి ఔదార్యమున యోగ మిత్రమండలి (మదరాసు) పేరున శ్రీ ప్రభాకర పరిశోధక మండలివారి 4వ ప్రచురణముగా 1951లో ఈ గ్రంథము ప్రకటింపబడినది. అదే ఈనాడు యథావకాశము కొంత క్రొత్త విషయమును కూర్చుకొని పునర్ముద్రింపబడుచున్నది. ఈ సందర్భమున శ్రీ సత్యనారాయణ శ్రేష్ఠిగారి ఔదార్యమును మేము కృతజ్ఞతతో స్మరించుచున్నాము. యోగ మిత్రులు (ఇటీవలనే కీర్తిశేషులు అయిన) శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారు "శ్రద్ధాంజలి" రూపమున ఈ ఉద్గ్రంథమునకన్ని విధముల తగిన భూమికను గూర్చిరి. వారిని కూడా మేమిట కృతజ్ఞతతో స్మరించుచున్నాము. మాకడనున్న వ్రాతప్రతిని అచ్చునకు దెచ్చి శాస్త్రిగారి ప్రథమ వర్ధంతి సందర్భమున కీ గ్రంథమును వెలువరింప జేయుటలో ఆనాడు మదరాసులో మాతో అన్ని విధముల సహకరించినవారు, శాస్త్రిగారికి మిక్కిలి కూర్చు శిష్యులు కీ॥శే॥

తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు. వారి సహకారమును కూడ మేమిట కృతజ్ఞతతో స్మరించుచున్నాము.

నాడు అచ్చువేసిన 500 ప్రతులు యోగ మిత్రుల కుచితముగా పంచి పెట్టుటతో అచిరకాలముననే చెల్లిపోయినవి. తదుపరి 1971లో తిరుపతిలో శ్రీ ప్రభాకరుల ప్రియ శిష్యులయిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారి ప్రేరణతో అక్కడి యోగ మిత్రుల ఉపయోగార్థము 'ప్రజ్ఞా ప్రభాకరము' రెండవ ముద్రణము జరిగినది. వారి కడనున్న ఆ వేయి ప్రతులును నేటికి చెల్లిపోయినట్లు తెలియుచున్నది.

పితృపాదులు శ్రీ ప్రభాకరుల రచనలన్నీ ఒక క్రమమున సంపూర్ణ గ్రంథావళిగా ప్రకటింపబడవలసియున్నవి. ఇప్పటి అంచనాల ప్రకారము అవి అన్నీ కలిసి మొత్తము అచ్చులో ఆరువేల పుటలకు పైపడును. ఇరువది సంపుటములకు అధికమగును. కనుక ఈ ముద్రణ వ్యవహారమును క్రమబద్ధ మొనరించుటకై మిత్రులతో యోచన చేసి, ఒక ప్రణాళికను సిద్ధము చేసి, 1981–82 సం॥లలో వేటూరి ప్రభాకర శాస్త్రి మెమోరియల్ ట్రస్టును ఏర్పరచినాము. శ్రీ ప్రభాకరుల సొంత గ్రంథాలయమునే కాక వారి ముద్రితాముద్రిత రచన లన్నింటి మీది హక్కులను ట్రస్టు ఆదర్శములకే అంకితమొనరించి చట్టబద్ధము గావించినాము. ఈ ట్రస్టులో మణిమంజరి పత్రికా ప్రకటనమును; గ్రంథ ప్రకటన, కార్యక్రమముల సమీక్షించుటకు "మణిమంజరి ప్రచురణలు" అను విభాగమును; పరిశోధన కార్యక్రమముల నిర్వహించుటకు "శ్రీ ప్రభాకర పరిశోధక మండలి" అను విభాగమును; గ్రంథాలయ నిర్వాహమునకు "శ్రీ ప్రభాకరశాస్త్రి గ్రంథాలయము" అను విభాగమును అంతర్భాగములై పనిచేయుచున్నవి.

ఈయేడు, అనగా 1986లో, ఆవృతి ప్రకారము 75–76 సంవత్సరముల తర్వాత తిరిగి కానవచ్చిన హేలీస్ కామెట్‌ను

పురస్కరించుకొని "మణిమంజరి" 11,12 సంచికలను ప్రజ్ఞాప్రభ – యోగ ప్రభ అను పేర మాస్టర్ యోగ విశేష సంపుటమును జోడు సంచికలుగా వెలువరించుచున్నాము. ఇదే సందర్భమున నేడు అలభ్యముగా నున్న ప్రజ్ఞా ప్రభాకరమును యోగ మిత్రులకందించుచున్నాము. త్వరలోనే విస్తృతి నందుకొని సంపూర్ణ గ్రంథావళిలో భాగముగా మఱియొక సంపుటము వెలువడగలదు.

గురుదేవుల సంకల్పము ఎప్పటికెట్లు ఉచితమో ఆ తీరుగానే అనుగ్రహించి మమ్ము పనిగొనుచున్నదని తలచుచున్నాము. ఎప్పటివలెనే ఆంధ్ర పాఠక లోకము మా కృషిని మన్నించునని ఆశించుచున్నాము.

విధేయుడు

**వేటూరి ఆనందమూర్తి**

శ్రావణ పూర్ణిమ

19-8-1986

హైదరాబాదు.

# పరిచయము

శ్రీ ప్రభాకర శాస్త్రి గారి "ప్రజ్ఞా ప్రభాకరము", "ప్రభాకర ప్రవచనములు" ప్రచురించుట నాన్నగారి, శాస్త్రిగారి ఆశీర్వచనమువల్లనని భావిస్తున్నాను. ఇంతటి మహద్భాగ్యము నాకు కలిగించి, నా ద్వారా ప్రచురణ అనుగ్రహించిన శ్రీవారలకు శిరసా నమస్కరిస్తున్నాను.

ఈ ప్రచురణకు ప్రేమతో అనుమతించిన శ్రీ వేటూరి ఆనందమూర్తి గారికి, ప్రచురణకు ఎంతో సహకరించిన శ్రీ వేటూరి వివేక్ వర్ధన్ గారికి ధన్యవాదములు. వివేక్ వర్ధన్‌గారు టైటిల్ పేజీలు డిజైన్ చేసినారు.

ఈ ప్రచురణకు ఆర్థికముగా సహకరించిన శ్రీమతి సాధన (వివేక్ వర్ధన్‌గారి సతీమణి) గారు, శ్రీమతి కళావతి (చాగంటి శంకరరావు-కల్పవల్లి గార్ల కుమార్తె) గార్లను ప్రత్యేకంగా స్మరిస్తున్నాను.

ఈ పుస్తకం ముద్రించుటకు కావలసిన ప్రూఫులను దిద్ది వారి సహకారాన్ని అందించిన శ్రీయుతులు కొంగతి సుబ్బారావు, కుమార్ టీచర్ గార్లకు తాతగారి ఆశీస్సులు.

ఇట్లు

బుధజన విధేయుడు

**- సూర్యం**

విరోధి - శ్రావణ పూర్ణిమ

5-8-2009

# విజ్ఞప్తి

మహర్షి సత్తములు, మహాతపస్సంపన్నులు, ప్రజ్ఞాపూర్ణులు నయిన శ్రీ గురుదేవులు ప్రభాకరశాస్త్రివర్యుల యోగజీవితము ప్రజ్ఞా సుందరము, ప్రభావ సంపన్నము. శ్రీ ప్రభాకరశాస్త్రి గారు కారణజన్ములు! వసుధైవ కుటుంబకముగా వారి జీవితము సాగినది. ప్రేమరసపూర్ణము వారి హృదయము. మహామహిమోపేతము వారి ప్రజ్ఞ ! పసినాఁట నుండి యంతర్వర్తినియయి యమృతత్వ సిద్ధి సాధనమార్గమున వారిని నడిపించిన దివ్య ప్రజ్ఞా చరిత్రమే నేఁడు మేము వెల్వఱచుచున్న "ప్రజ్ఞా ప్రభాకరము".

నన్నున్ వర్ణనసేయగా వలవదన్నా! కన్నయందాక మీఁ
ద న్నీ వర్ణన మెందు కిందులకుఁ గొందాకం బ్రతీక్షింపు మం
చు న్నన్గూర్చిన యుష్మదాజ్ఞకు నెదుర్చూపై గృహద్వారమం
దున్నాఁడన్ గనరాఁగదే కనుట కర్వున్నన్నుఁ జేయంగదే!

కుంభకోణమున నపూర్వము, నసాధారణమునయిన మహత్తర యోగమును నెలకొలిపి యమృతత్వసిద్ధి ప్రసాదమును దమశిష్యులకు నొసఁగు బ్రతినపూనిన మహాయోగివర్యులగు తమ గురుదేవులను గూర్చి శ్రీ శాస్త్రి గారు రచించిన పద్యమిది! శ్రీ శాస్త్రిగా రాయోగమును జేరిన కొలఁది కాలమున కెపుడో శ్రీ మాస్టరుగారి మహిమాదికమును వర్ణించుచు నేదో పత్రికలోఁ బ్రశంసా పద్యములను గొన్నింటిని రచించి ప్రకటించిరఁట! అది తెలిసి శ్రీ మాస్టరు గారు తమ్ముఁబూర్ణముగా నెఱుఁగుదాకనట్టి రచనము లేవియుఁ గావింపదగదని శ్రీ శాస్త్రి గారిని మందలించిరఁట! ఈ విషయము నెఱుకపఱచునదే పయిపద్యము. అటు పిమ్మట నెన్నఁడును వారు శ్రీ వారిని గూర్చి యెట్టి రచనము గావింపలేదు.

1948వ సంవత్సరమున తిరుపతిలో శ్రీ శాస్త్రి గారి షష్ట్యబ్ద పూర్త్యుత్సవము జరిగినది. షష్టి పూర్తినాఁడు ప్రాతరుపాసన సమయమున వారు.

'వచ్చెను నేఁటి కర్వదగువర్షము పుట్టువుఁదొట్టి, గర్భముం
జొచ్చుటదొట్టి నాకరయు జూచిన నేఁటికె షష్టిపూర్తి, యీ
వచ్చినయేడు నిండిన ధ్రువంబుగఁ గాఁగల షష్టిపూర్తితో
నిచ్చట నాకుఁ గావలయునిష్టికిఁ బూర్తియు సృష్టిపూర్తియున్'.

అని వేఁడి గురుదేవులను బ్రార్థించిరి. అపుడు 'నిన్నటి వఱకు ప్రభాకరుఁడవుగా నుండిన నీవు నేఁటి నుండి ప్రజ్ఞా ప్రభాకరుఁడవు. నన్ను గూర్చి వ్రాయఁగల యోగ్యత నీకుఁ గలిగినది' అని శ్రీ వారుద్బోధించినట్లు తెలియనయ్యెను.

నాఁడే వారు "ప్రజ్ఞా ప్రభాకరము" రచనమునకుఁ దొడఁగిరి. తమకుఁ గలిగిన యోగానుభూతులను వివరించుచు వేయి పుటల గ్రంథముగాఁ దొలి సంపుటమును, నీ యోగము వలన నుపకారము పడసిన మిత్రుల యొక్కయు, శిష్యుల యొక్కయు ననుభవములను, వారే వ్రాసిన వానిని, వేయి పుటల గ్రంథముగా రెండవ సంపుటమునుగా "ప్రజ్ఞా ప్రభాకరము"ను వెలయించుట వారి సంకల్పము. అందుకై తొడఁగి రచనమునకుపక్రమించి కొంత వరకు సాగించిరి. మిత్రులకడ నుండియు, నాప్తుల కడ నుండియు, శిష్యుల కడ నుండియు వారి వారి యనుభవములను దెలుపు వృత్తాంతములను గూడఁ దెప్పించిరి.

తలమునుకలగు కార్యకలాపములలో నెట్లో తీరిక చేసికొని శ్రీవారీ గ్రంథ రచనమును దినమున కొక కొంతగా సాగించుచునే యుండిరి. కాని యన్నమాచార్యుల కీర్తనముల ప్రచురణము, తదుత్సవాదికముల నిర్వహణము, కుమారసంభవోత్తర హరివంశ వ్యాఖ్యానముల రచనము,

తిరుపతిలో మ్యూజియమునకై యమూల్య వస్తువుల సేకరణము – ఇత్యాది కార్యకలాపములలో దలమునుక లగుచుంటచే నీ గ్రంథ రచనము నేఁడు ప్రకటించుచున్నంత వఱకు మాత్రమే కొనసాగినది. ఇంతలో మ్యూజియమునకయిన వస్తుసేకరణ ప్రయత్నమున నుండిన వారి యారోగ్యము చెడుటయు, నీ గ్రంథ రచనము ముగియకయే వారు భౌతికమును వీడుటయు మా దురదృష్టము! కడకు దుఃఖపుఁ బుక్కిలింతగా మాకు దక్కినది యీ గ్రంథము!

శ్రీవారి యోగజీవితమునకు సంబంధించిన యీ రచనము వారి ప్రథమ వర్ధంతి నాఁటికి వెల్వఱచుట మా సంకల్పము.

శ్రీ శాస్త్రిగారితో స్వయము నాకుఁ బదునైదేండ్లకు మించిన పరిచయము కలదు. 1939లో వారు మదరాసు విడచి తిరుపతి వెళ్ళిన తరువాత మదరాసునకు వారు వచ్చినపుడెల్ల మాయింటనే బస చేయుచుండువారు. వారి యోగ చికిత్స వలన నారోగ్యము పడసిన నాఁటనుండియుఁ బరమ భక్తితో నేను వారి ననువర్తించుచుండెడివాఁడను. వైద్యులకుఁ గుదుర్పరాని రోగములతో బాధపడుచున్న వారెందఱో శ్రీవారి యోగ చికిత్స వలన నారోగ్యము పడసి యానందముతో నుండుట నేనెఱుఁగుదును.

వారి యాధ్యాత్మిక శక్తి యెంత పటిష్ఠమో తెలుపుటకొక సత్యసంభవము నుదాహరింతును.

అన్నమాచార్యుల ప్రథమ వర్ధంత్యుత్సవము తిరుపతిలో మహా వైభవముగా సాగుచుండినది. మదరాసు ఉన్నత న్యాయ స్థానమున ప్రధాన న్యాయమూర్తులు శ్రీ పాకాల వెంకట రాజమన్నారుగా రధ్యక్షత వహించిరి. రెండవ దినమున సాయంకాలము శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి పాట కచ్చేరి జరుగుచుండినది. వేల కొలఁది జనము విఱుగఁబడి

వచ్చియుండిరి. సభాస్థలము క్రిక్కిఱిసి యుండినది. వాతావరణ మల్లకల్లోలముగ నుండెను. కాఱుమబ్బులు క్రమ్ముకొన్నవి. తుఫాను వాయువులు వీవసాగినవి. ఉత్సవ ప్రాంగణమంతయు దుమ్మెత్తిపోయు చుండెను. వేల కొలఁది జనము, స్త్రీలు, శిశువులు, వృద్ధులు పలువు రుండిరి. ప్రాణ భీతి! సభలోఁ బెద్ద గగ్గోలయ్యెను, రసాభాసమగునని శ్రీ శాస్త్రి గారు వెంటనే లేచి మైకు దగ్గఱకు వెళ్ళి "వర్షమురాదు! మనమందఱము నేకమనస్కతతోఁ బ్రార్థించుచున్నప్పుడు తద్విరుద్ధముగా వర్షమెట్లు రాఁగలదు. మబ్బులు విచ్చిపోఁగలవు. గాలి హోరు తగ్గును. కూర్చుండుఁడు ! వాన రాదు! రాదు! రాదు! " అని ముమ్మాఱు నొక్కి చెప్పిరి. ఆశ్చర్యము! శ్రీ వారి దివ్య సంకల్పబలమేమో కాని వెంటనే మబ్బులు తొలగిపోయినవి. గాలి హోరు తగ్గినది. వర్షము రాలేదు.[1] కచ్చేరి జయప్రదముగా సాగినది. వారి యాధ్యాత్మిక శక్తి ప్రభావమట్టిది! ప్రకృతి విజయ మన నిట్టిదియే కదా! అహో! యిట్టివి శ్రీవారి విషయమున మాయెఱుకలో నెన్నియో !!

అమృతత్వ సిద్ధికై సాధనము సలుపు నీ యోగము యొక్క మహత్త్వము చెప్పనలవి కాదు. యోగ మహిమమును గూర్చియు, తత్ స్థాపకులగు గురుదేవుల దివ్య ప్రభావమును గూర్చియు శ్రీ శాస్త్రిగారు రచించిన యీ గ్రంథము ముద్రితమయిన యెడల నెందఱకో యీ యోగ విషయము తెలియగోరువారికి నుపకారముగా నుండునని దీనిని బ్రకటింప నుత్సహించితిని. యోగ విషయము తెలియగోరువారికిది మిక్కిలి తోడ్పడఁగలదని నా విశ్వాసము.

---

1. ఈ వార్త నాటి పత్రికలలో ప్రముఖంగా అచ్చుపడింది. మేమందరము కూడ ప్రత్యక్ష సాక్షులము. నాటి దేవస్థానము కమిటీ ప్రెసిడెంటు గారైన వేంకటస్వామినాయుడు గారు స్పందించి, తమ దేవస్థాన ఆస్థాన పండితులైన శ్రీ శాస్త్రిగారి ఋషివాక్సిద్ధిని కొనియాడుతూ ఒక లేఖ వ్రాసిరి.

శ్రీవారి యోగానుభవములను గూర్చియు, దమకు శ్రీవారితోఁ గల "పరిచయ సందర్భములను గూర్చియు ననేక విశేషాంశములు తెలుపుచు శ్రద్ధాంజలి" వ్రాసిన శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారికి మేమెంతయు గృతజ్ఞులము. ఈ గ్రంథ ముద్రణ సందర్భమున శ్రీ శాస్త్రి గారి శిష్యులు శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్య గారు మాకు మిక్కిలి సహాయపడిరి. వారికి మా కృతజ్ఞత!

అలఁతి కాలములో ససిగా సర్వాంగ సుందరముగా అచ్చొత్తించి యీ గ్రంథమును శ్రీవారి ప్రథమ వర్ధంతి నాఁటికి మాకందఁజేసిన 'వెల్డను ప్రెస్సు' వారి నభినందించుచున్నారము.

**కంభంపాటి సత్యనారాయణ**

మదరాసు

ఖర - శ్రావణ బహుళ విదియ (1950–51 తొలి ముద్రణం)

# శ్రద్ధాంజలి

"Greater love hath no man than this,

that a man lay down his life for his friends"

*- St. John XV, 12.*

"మిత్రులకై తన ప్రాణమర్పించుటకన్న నుత్కృష్ట ప్రేమను మానవుఁడెఱుఁగడు" అన్న జీససు మహోదార ప్రవచనమునకు పరమ లక్ష్యభూతమైనది శ్రీ ప్రభాకర శాస్త్రి గారి పుణ్య జీవితము. వారు అందఱను మిత్రులుగనే భావించెడివారు, ఆధివ్యాధులచే దారితెన్నులు తెలియక, నిస్పృహులైనవారాయనకు పరమ మిత్రులు, అట్టి వారి దుఃఖములోను, బాధలోను దూరి, వారే తాముగ భావించి, వారి యాపన్నివారణకై యహోరాత్రములు పరితపించి, ఆ యనుతాప లబ్ధమగు ఆత్మశక్తిచే బాధా నివారణ చేసెడివారు శ్రీ శాస్త్రిగారు. అట్లు వారిని గట్టెక్కించిన పిమ్మట గూడ వారి యోగ క్షేమముల నరయుచు ఆపదలో నాదుకొనెడివారు. "సమర్ధ మాపత్సఖ" మనుస్తుతి వాక్యములకు వీరెంతయుఁ దగియుందురు.

"ఆపద గడవంబెట్టగ
నోపి శుభంబయిన దాని నొడగూర్పఁగ మా
కీ పుట్టువునకుఁబాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁజూపి చనియె మహాత్మా!"

యని శ్రీ కృష్ణుని గూర్చిన యుధిష్ఠిర సంబోధనము కలదు. శ్రీ శాస్త్రి గారిచే పరిరక్షితులైన పెక్కురిట్లే వారిని స్మరింతురనుట కేవలము స్వభావోక్తి! వారి కరుణా ప్రసారముచే నుజ్జీవితులైన వారిలో నేనొకఁడను. ఆ కృతజ్ఞతను పురస్కరించికొని ఈ శ్రద్ధాంజలి నర్పింప సాహసించితిని.

వ్యాధులను తపస్సుచే నివారించుటెట్లు? మరియు, ఒకరి వ్యాధినింకొక రుపశమింపఁజేయుటెట్లు? అని పలువురు ప్రశ్నింతురు. ఇది న్యాయమే. అట్టి యనుభవము పడయు వరకు నాకునట్లే యుండెడిది. స్వయముగ నాకు దెలిసిన కొన్ని విశేషముల నుదాహరించి, సహృదయుల సందేహములను దీర్ప యత్నింతును. ఈ రూపమున నాకు శ్రీ శాస్త్రి గారి సత్వ మధుర స్వభావ సంస్మరణావకాశమును, ఈ గ్రంథ రచనలో శ్రీ వారుద్దేశించిన ప్రయోజనము కొంత వఱకును చేకూరును.

శ్రీ శాస్త్రిగారీ "ప్రజ్ఞా ప్రభాకర" రచనకు దొడగినప్పటికే భృక్తరహిత తారక రాజయోగ మార్గమున ముప్పదేండ్లు సాధనమొనర్చి యుండిరి. ఈ సుదీర్ఘ కాలమున నెన్నియో మహనీయానుభవములను వారు గడించిరి. తమ యనుభవములను, తమతోపాటు యోగ దీక్ష బడసినవారి యనుభూతులను, తమ వలన నుపకృతి బడసిన వారి కథలను, వారు వేర్వేరు సంపుటములుగ ప్రకటింప నెంచిరి. వారు సంకల్పించిన బృహద్గ్రంథమే రూపొందినచో నది తెలుగు వచన రచనలోని మెఱుఁగులను చూపునదియేగాక, యోగాధ్యాత్మ సాధకులలోను, మనశ్శరీర తత్త్వవేత్తల లోను, రోగ చికిత్సకులలోను సంచలనము గల్గింపఁజాలినదిగ నుండెడిది.

కాని వారా గ్రంథరచన కుపక్రమించి యిపుడు ప్రకటింపఁబడిన భాగమును పూర్తి చేయునప్పటికి శ్రీ తిరుపతి దేవస్థానము వారొక మ్యూజియమును నిర్మించు భారమును వారిపై నిడిరి. దానికై వారు ఆహార నిద్రా సౌకర్యములు మాని, పులులు చెరలాడు కడప యడవుల కడ మొదలిడి కమ్యూనిస్టు గెరిల్లాల కాటపట్టులగు కృష్ణా జిల్లా ముక్త్యాల, నైజాము రాష్ట్రపు నల్లగొండ గుట్టల వఱకును గాలించి కన్నుల పండువును

గూర్చు సుందర జిన బుద్ధ హిందూ విగ్రహములను బెక్కింటిని తిరుపతి చేర్చిరి.

ఈ విగ్రహముల వలన మనకు పూర్వ మాంధ్ర దేశములో సమతా ధర్మ ప్రతిపాదకములు, అహింసా ప్రబోధకములు నైన జైన బౌద్ధములు ప్రబలెననియు, తదనుయాయుల కళారాధనా ఫలితముగ పెక్కు మనోహర విహార విగ్రహాదులు వెలసెననియు, కాలక్రమమున ప్రజలకు వర్ణాశ్రమాచారములపైనను, వైదిక యజ్ఞ యాగాదులపైనను చూపు మ్రొగ్గెననియు, అపుడు వారు పూర్వ శిల్ప నిర్మాణములను చేజేతుల రూపుమాపిరనియు, తమ నూతనావేశమునకు లొంగని వారిని చిత్రవధ సల్పిరనియు తెలియనగును. నాఁటి దౌర్జన్య హింసాకాండకును, తరువాతి శకములలోని మహమ్మదీయుల విధ్వంసక చర్యలకును నేఁటిరజాకారు కమ్యూనిస్టు దుండగములకును భేదము కన్పట్టదు. మానవతలోని పశు త్వ మవిచ్ఛిన్నముగ నాఁటి నుండి నేఁటి వరకు సాగుచునే యున్నది! తనకు మంచిదని తోఁచిన దాని నితరులచే నంగీకరింపఁజేయుటకు మానవుఁడొనర్చు సాధనలో హింసాకాండను వర్జింపనేరఁడా?

ఈ శిలాలోహ విగ్రహములేగాక శ్రీ శాస్త్రిగారు కాళహస్తి సంస్థాన పురావస్తు భాండారమంతయు శోధించి తత్సంస్థానాధీశ్వరుల యుదారానుమతితో ఎన్నో అముద్రిత గ్రంథములు, చిత్రములు, పూర్వపు వీరులు ధరించిన కవచ ఖడ్గాదులు సేకరించిరి. ఆంధ్ర ప్రభ సంపాదకులగు శ్రీ నార్ల వారి సహాయమున బందరు నుండి శ్రీ కోట సుబ్బారావు గారలు బహుకాలము శ్రమించి సేకరించి ప్రాణతుల్యముగ భద్రపరచుకొన్న అమూల్య చిత్ర ప్రతిమాదుల మ్యూజియమును తిరుపతికి తరలించిరి.

ఈ పనియంతయు నొకప్రక్క – మఱియొక వంక తిరుపతి దేవస్థాన ప్రాచ్య కళాపీఠ యాజమాన్యమున శ్రీ అన్నమాచార్య వర్ధంతి జరుపుట, కీర్తనల ప్రచురణ, పావులూరి గణితము, ఉత్తర హరివంశము, లక్షణోద్ధారము, నన్నయకు పూర్వపు ఆంధ్ర భాష ఇత్యాదుల పరిష్కరించుట, వ్యాఖ్యానించుట, సమకూర్చుట, పరిశోధించుట జరపుచు, నన్నిచోడుని కుమార సంభవమునకు వ్యాఖ్యానము రచించుట గూడ ప్రారంభించి యీ కార్యములనన్నిటిని నేక కాలమున సవ్యసాచివలె శ్రీ శాస్త్రి గారు నిర్వహించిరి.

మ్యూజియము వస్తు సేకరణలో పెక్కు చిక్కులుండెడివి. దారిడొంకలేని యొక కుగ్రామములో నొక చారిత్రాత్మక సుందర శిలా విగ్రహము కలదనియు, దానికై యెవరో బొంబాయి నుండి ధనవంతులు వచ్చిరనియు, ఆలస్యమైనచో తెలుగు నాడు దాటిపోవుననియు తెలిసెడిది! సరి! అంతటితో శరీర శ్రమను లెక్కసేయక ఏదో రీతి నటకు చేరెడివారు శ్రీ శాస్త్రిగారు. ఆ విగ్రహ మేపుంతలోనో పడియుండెడిది. పసుల కాపరులు కత్తి నూరుకొనుటకో, బాటసారులు కాలిబాడి వదుల్చుకొనుటకో అది ఉపయోగపడుచుండెడిది. త్రవ్వి తీయుటకు తోడు దొరకరు. వెలికి తీసి దాని ప్రాముఖ్యమును దెలిపిన పిమ్మట ఊరివారు ఆ విగ్రహము నుంచుకొని మేము ఆరాధించుకొందుమని యడ్డగింతురు. వారిని సమాధానపఱచి ఆయా వస్తువులను తిరుపతి చేర్చుట యన లక్క యింటి నుండి ఏక చక్ర పురమునకు చేరునంతటి కథ! ఈ పనినంతయు శ్రీ శాస్త్రి గారు తమ ప్రియాంతేవాసులను, అందును ఉదయగిరి శ్రీనివాసాచార్యులను నూతగట్టుగా గొని ఏడెన్మిది నెలలలో బహు స్వల్ప వ్యయముతో నిర్వహించిరి.

వేరొకరైనచో మంది సిబ్బందులతో గూడియైన, ఎంత ధనవెూ వెచ్చించియైన, నిరువదేండ్లలోపుననైన ఈ పనిని సాధింపగల్గుదురాయని యెఱుక గలవార లచ్చెరువుఁ జెందిరి.

ఈ సందర్భమున నొక విషయము స్ఫురణకు వచ్చుచున్నది. గుంటూరులో నొక నూత్న పరిచయునికడ శ్రీ శాస్త్రి గారు కొన్ని గంటల కాలము వ్యయించి ఒక చిన్న పాలరాతి ముక్కను తెచ్చిరి. దానిపై నేదో చెక్కడపు భాగము గలదు. ఆ రాత్రికే వారు తిరుపతి ప్రయాణము. సామానుల సర్దుగడలో దానిని మఱతురేమోయని పలుమారులు సరిచూచికొనిరి. గాజు కుప్పెలను భద్రము చేసినంత జాగ్రత్తతో దానిని సర్దించిరి. మాకీ యాందోళన బోధపడలేదు. "ఇది యమూల్య శిల్పము. డూబ్రేలు అయినచో దీనికి పదివేల రొక్కమిచ్చును" అని రైలు కడఁ జెప్పిరి. ఈ చిన్న వస్తువు మాటయే యిటులుండ వారు సేకరించిన మ్యూజియమునకు విలువ గట్టుట యసాధ్యమని తోచును.

ఇప్పుడీ శిల్ప కళాఖండములన్నియు తిరుపతి దేవస్థానపు మ్యూజియములో మూగవోయియున్నవి. వాని కాల నిర్ణయముజేసి, వాని సాంఘిక రాజకీయ ప్రాధాన్యతను, కళా ప్రాశస్త్యమును గుర్తించి, వానిని పలుకు బొమ్మలనుగా జేయు గురుతర బాధ్యత దేవస్థానము వారి యెడఁగలదు.

ఇటు మ్యూజియముకై తిరుగులాటతోను, అటు అపూర్వ గ్రంథ సంస్కరణ ముద్రణముల యొత్తిడితోను నలిగులియై శ్రీ శాస్త్రి గారి యారోగ్యము కొంత చెడినది. ఇంతలో గుంటూరు జిల్లా ఎద్దనపూడియను గ్రామములో నొక బావిలో నేవో మహత్తర శిల్పములు గుప్త

పఱుపంcబడెననియు, వానిని సేకరింపవచ్చుననియు ఆసవెట్టి దుర్విధి శ్రీ శాస్త్రి గారి నటకుc గొంపోయెను. జడివాన, మోcకాటి బంటి నల్లరేగడి బాడి, జోడెద్దుల బండి సైతము నడువ వీలులేదు. కాలు దీసి కాలువేయ సాధ్యము గాదు. ఇట్టి మిత్తి యడకత్తెరలోc జిక్కికొని అఱువదేండ్ల వృద్ధు, సుకుమార శరీరి, భారపు మానిసి యగు శ్రీ శాస్త్రిగారు తీవ్ర జ్వరముతో నింటికిcజేరుకొనిరి. అప్పటికే వారి యారోగ్యము పూర్తిగా చెడినది. దానిని లెక్కచేయక నిరంతరము మంచము మీcద నుండియే చివరి వఱకు వారి మామూలు కార్యముల నిర్వహించుకొనుచుండిరి. వారు తమ యోగ మహాత్మ్యమున పలువురను మృత్యుదంష్ట్రల నుండి వెలికిలాగిరి. అట్టి వారమనేకులము వారి చుట్టు నుండియు తుదకు నా మహనీయుని దక్కించుకొన నేరమైతిమి. ఈ హఠాద్వార్త విన్న మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు చకితులై "తుదకు నిన్నె జయించె మృత్యువు మహాత్మ" యని అప్రయత్నముగ వగచిరి. శ్రీ సత్యనారాయణగారు తమకు తెలియకయే, శ్రీ శాస్త్రి గారి ప్రేమ పాత్రులందరు ఆ నిముషమున భావించినదే పల్కిరి. అస్సాము భూకంపములో హిమాలయ శృంగములు కొన్ని యదృశ్యమైన వన్న వార్తలతోపాటు, శ్రీ శాస్త్రి గారి నిర్యాణ వార్తను మేము వార్తాపత్రికలలో జూచి వాపోయితిమి.

తుదకు వారెంతో మక్కువతో బృహద్గ్రంథముగా రచింపcజూచిన ప్రజ్ఞా ప్రభాకర మీ తీరున నసంపూర్ణముగా, దుఃఖపు పుక్కిలింతగా ప్రకటింపవలసి వచ్చినది. దీని ముద్రణకగు వ్యయమును శ్రీ శాస్త్రి గారి కిర్వది యేండ్ల నుండి ప్రియశిష్యులైన చెన్నపురి వాసి శ్రీ కంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠి గారు భరించి గురుదేవుల యెడc గల భక్తి ప్రపత్తులను

వెల్లడించుకొనిరి. వీరి వృత్తి వెన్న వ్యాపారము. హృదయ ప్రవృత్తియు నవనీత సమానమే! శ్రీ శాస్త్రిగారు చెన్నపురి విచ్చేసినపుడెల్ల అచటి ఆప్తులందరును వీరి యింటనే సమావేశమై వీరి యాదరణకు పాత్రమగు చుండెడివారు. నేటికిని వారి యాదరణకు మేము ఋణపడియున్నాము.

2

శ్రీ శాస్త్రిగారితో నాకు ప్రథమ పరిచయ భాగ్యము 1939 మే నెలలో కల్గెను. అప్పటికి సుమారు పది నెలల నుండి నేను తీవ్ర అనారోగ్యముతో పీడింపబడుచుంటిని. నా యనారోగ్యము తొలుత 106 డిగ్రీల మలేరియాతో నారంభమైనది. కొన్ని ఇంజెక్షనులతో ఆ యమయాతన నుండి బైట పడితిని. అంతటితో నాగిన నెట్లుండెడిదో! ఆ వైద్య పద్ధతిలో క్వైనా వాడుదురనియు, అవి శరీరమునకు మంచిది కాదనియు, హోమియోపతి వైద్యములో క్వైనా వాడరనియు, ఆ పద్ధతి శ్రేష్ఠమనియు ఎట్లో తలకెక్కెను. దానితో మరి రెండు నెలలు గడచెను. లాభము లేదు. పిదప ఆయుర్వేదముపై చిత్తము ప్రసరించెను. ఎన్నో చేదు మందులు మ్రింగితిని. అందు కలకత్తా వారి పంచతిక్త మనియొకటి గలదు. పేరుకు పంచతిక్తమే కాని నిజముగా నది ప్రపంచ తిక్తము. పగవానికైన వలదీ చేదులు! ఆ మీదట కేవలము నాటుమందులు వాడితిని. ఆ వైద్యుఁడు చురుకైన వాఁడే! నాటుమందులపై నాకుఁ గల యనాదరణను పోగొట్టుటకు కొన్ని తీయని మందులనిచ్చి ఆహార విషయములో కొంత స్వేచ్ఛనిచ్చెడివాఁడు. కాని లాభము లేకపోయెను. తిరిగి అల్లోపతీకి చేరితిని. అప్పటికి నా శరీర స్థితి చాలా మార్పు చెందెను. ఇరువది పౌనుల తూకము తగ్గినది. సాయంకాలమునకు 99.5 డిగ్రీల జ్వరము

వచ్చెడిది. మానసికముగా ఎట్టి నిబ్బరమును లేదు. నరముల జిగి తగ్గి స్వల్పావేశమునకే శరీరము తాళలేకుండెడిది. నిద్ర లేదు. ఏమి తిన్నను నొంటబట్టదు. ఈ స్థితిలో అల్లోపతి వైద్యము కొలఁదిగా సాయపడెనుకాని వ్యాధి బోధపడదు. ఎచటనైన భయపడితినేమోయని వైద్యుఁడనును.

ఈ స్థితిలో చెన్నపట్నములో లా అప్రెంటిసు పరీక్షకు వెళ్ళవలసి వచ్చెను. నేను రైలు దిగి ట్రాము బస్సులలో ఎక్కగలనా యను సందేహముతో నుంటిని. తుదకెట్లో చెన్నపట్నము చేరి స్టేషను వద్దకు రావించుకొన్న మిత్రుని సాయముతో హోటలు చేరి పరీక్షలు ముగించుకొంటిని. తరువాత పేరుగన్న ఒక డాక్టరు గారిని చూచితిని. ఆయనకొక నర్సింగు హోము కలదు. రోజు కైదురూప్యములనిచ్చి పది రోజులందున్ననేగాని రోగ నిదానము తెలియదనిరి. నేనందు చేరెడిదినము స్థిరపఱచుకొని హోటలుకు వచ్చితిని.

గుంటూరు నుండి బయలుదేరునపుడే శ్రీ శాస్త్రిగారి యోగమహాత్మ్యమును గూర్చి ట్రీట్మెంటును గూర్చి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ[1] గారి వలన తెలిసికొంటిని. ఎందుకైన మంచిదని శ్రీ శాస్త్రి గారికి వారికడ నొక పరిచయ లేఖను తీసికొంటిని. ఆ లేఖ తీసికొని త్రోవలో నాలుగు కమలా ఫలములను కొని ప్రొద్దుటనే తిరువలిక్కేణి వెంకట రంగం పిళ్ళే వీథిలోని నాల్గవ నెంబరు ఇంటికేగితిని. తలుపు తట్టి లోన కేగుదునుగదా ఆశ్చర్యముపై నాశ్చర్యము!

1. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు కాంగ్రెసు కార్యకర్త. రచయిత మాస్టర్ యోగసభ్యులు. మహాత్మగాంధి గారికీ యోగమును గూర్చి పరిచయము చేసినవారు. నాయన గారికి యోగమిత్రులు.

శ్రీ శాస్త్రిగారి రచనలను చదివినపుడు వారి యాకార, వేష, భాషాచారములను గూర్చి నాకు తెలియకయే మనసులో నొక రూపమేర్పడెను. వారు సన్నముగాక లావుగాక బంగారు వన్నె గల స్ఫురద్రూపియగు ఆచార పరాయణుఁడని నా భావన! లావుగా, చామనచాయ మెఱుపు మేనితో నున్న వారిని పోల్చుకోలేకపోతిని. "ఏం! నాయనా! ఎవరు నీవు!" అని వారు స్నిగ్ధ గంభీరమగు స్వరముతో నన్ను పలుకరించిరి.

నా యూహలో ఆ కంఠధ్వని యట్లుండుననుకొనలేదు. నేను తేరుకొని వారికి నమస్కరించి "మాది గుంటూరు..." అని చెప్పునంతలో శ్రీ లక్ష్మీనారాయణ గారు లో నుండి వచ్చి నన్ను పరిచయము గావించిరి. వారినచట కలియుదునని నేనెఱుఁగను. ఏదో పని యుండి చెన్న నగరము వచ్చి ఆ క్రిందటి రాత్రియే వారిటకుఁ జేరిరట!

శ్రీ శాస్త్రి గారు నేను వారింటికి చేరుసరికి దంత ధావన చేయుచుండిరి. అప్పటి కేడు గంటలు దాటి యుండును. ఆ సరికి వారు స్నాన జపాదులను ముగించియుందురని తలచిన నాకిది క్రొత్తగా నుండెను. వారితో పరిచయము పెరిగిన పిమ్మట తెలిసికొంటిని. సాయంకాలమందు యోగ చికిత్సకై వారికడకేతెంచు నార్తులతో వారికి పెందలకడ తెమలదు. అందఱు వెళ్ళిన పిమ్మట గూడ చాలా ప్రొద్దుపోవు వఱకు వారి వారి రోగ కారణాదుల నాత్మోద్బోధమున తెలిసికొనుటతో నిదుర యుండదు. ఒకప్పుడొక నిదురపోయి లేచి తెల్లవారు లాచింతతోనే కాలము గడపుదురు. ఇందుచే ప్రొద్దెక్కిలేచుట జరిగెడిది. వేకువనే ఆచార పరాయణులవలె వేషము సవరించుటకెక్కడ! అన్ని ఆచారములను వారు జీవకారుణ్య యజ్ఞాగ్నిలో వ్రేల్చిరి.

**ప్రజ్ఞా ప్రభాకరము**

దంత ధావన చేసి చేయుటతోనేఁదెచ్చిన కమలా ఫలములను రుచి జూచి, "బాగున్నవి! కాని లోన డొల్లజాస్తి. రసము తక్కువ" యనిరి. ప్రతి వస్తువును పరిశీలించి నాణ్యము తేల్చుట వారికొక పరిపాటి.

ఆ పిమ్మట నాకు యోగ చికిత్స నిచ్చుటకు వారు సమ్మతించిరి. కాని ముందు నా భోజన వసతి యెట్లని యడిగిరి. హోటలులో నుందు ననఁగానే వారి కసంతృప్తి కల్గెను. హోటలులో ఆహారము ససిగా నుండదని వారి బెంగ. మామూలు సాంబారు మెతుకులుగాక మంచి నేయి, కూరలు, పాలు, పండ్లు తీసికొనవలెననిరి. "ఈ యాహారముతో నీ జబ్బు కుదురుననుకొనవద్దు. కుదుర్చునది సర్వకర్తయగు నీశ్వరుడే! నీ శరీర పుష్టికి ఈ తిండి కావలయును" అని చెప్పిరి. నర్సింగు హోము సంగతి చెప్పగా అందు చేరవలదనిరి. వారి మాటజాడను బట్టి నా యనారోగ్యము చక్కబడునని వారి తలంపుగా నేను గ్రహించి సంతసించితిని.

నా కంఠ స్వరము బలహీనముగా నున్నదని వారనిరి. ఆ మాట నాకు క్రొత్తగా తోచెను. కాని పూర్ణారోగ్యము బడిసిన పిమ్మట పోల్చి చూచికొనఁగా వారి మాట సత్యమని తెలిసికొంటిని. ఇది యెందులకు వ్రాసితిననగా శ్రీ శాస్త్రిగారు యోగ చికిత్సకు వచ్చు వారిని మొదటి చూపులోనే నిశితముగ పరీక్షింతురని చెప్పుటకే! వచ్చెడి వారి ఆకారము, ముఖ వైఖరి, మాటతీరు, కంఠ స్వరము, అంగ విన్యాసము, వారు తెచ్చెడి కానుకలు మొదలగు వానిని బట్టి వారి వారి స్వభావములను, అనారోగ్యము తీరును శ్రీ శాస్త్రి గారు గ్రహింతురు. వారి యూహ తప్పగుట నేనెన్నఁడు చూడలేదు. ట్రీట్మెంటులలోనేగాక ఈ కుశలతను వారు నిత్య జీవితములో నొక వినోదముగా నవలంబించెడివారు. దస్తూరిని బట్టి స్వభావమును తెలిసికొనుట, జాబులపై పోస్టు మార్కులను చూడకుండ చిరునామా వ్రాసిన

తీరునిబట్టి ఆ కవరు ఎచటి నుండి వచ్చినదో చెప్పుట, ఒకప్పుడా జాబు చదుకవయే అందలి విషయమును చెప్పుట మొదలగు చిన్ని చిన్ని వినోద విమర్శలతో వారి చుట్టు నొక చల్లని ఆశ్చర్యకరమైన వాతావరణము కల్పించెడివారు.

ఆ తొలిపూట ట్రీట్మెంటులో నా శరీరమంతట ఒక శక్తి ప్రవహించినట్లుండెను. చెమట యోడికలు గట్టెను. హోటలుకు పోయి చక్కగా భోజనము చేయుమనిరి, సాయంత్రము వరకు కాల మెట్లు గడిపెదవని యడిగిరి. క్రొత్త చోటనేమి చేయుటకు తోచక విసుగు చెందుదునని వారి యాందోళన! ట్రీట్మెంటుకు వచ్చిన వారి శారీరక, మానసిక సౌకర్యములను గూర్చి అంత శ్రద్ధగా విచారించెడివారు శ్రీ శాస్త్రిగారు! చికిత్సా కాలములో చీకాకులు లేకుండ ఆనందముగ నుండవలెనని వారి తలపు. “ఏదో పుస్తకములతో కాలక్షేపము చేయుదు”నని నేనంటిని. శ్రీ లక్ష్మీ నారాయణ గారు “ఈయన మంచి చదువరి. అందుచే ఉబుసుపోక కేమి చిక్కులేదు” అని చెప్పిరి. దానికి శ్రీ శాస్త్రి గారు “పుస్తకాలన్నీ కట్టిపెట్టు. భోంచేసి కమ్మగా నిద్రపో” యనిరి. శ్రీ శాస్త్రి గారు బహు గ్రంథ పరిశోధకులు. కాని పుస్తక పాండిత్యముపై వారి కభిమానము లేదు. మన మనశ్శరీరములే సర్వ రహస్యములను వెల్వాటించు పుస్తకములు. వానిని పఠించు తీరు అలవర్చుకొనుట మేలు అని వారి అభిప్రాయము. సాహిత్యమును గూర్చిన వారి యూహలను తరువాత స్పృశించెదను.

సాయంత్రము తిరిగి నేను వచ్చినపుడు నా యాకలిని గూర్చి, భోజన పదార్థములను గూర్చి, నిద్రను గూర్చి, వచ్చునపుడు తీసుకున్న పాలు, పండ్లను గూర్చి, శరీర స్థితిని గూర్చియు వివరములడిగి తెలిసికొనిరి.

నేను వారు చెప్పినట్లే నడచుకొనుటయు, నిద్రాహారములమరుటయు గుర్తించి బండి త్రోవను నడచుచున్నదని వారు తృప్తి చెందిరి.

వారికడకు వచ్చు ప్రతి వారిని ఈ రీతిగనే యే పూటకాపూట ప్రశ్నించి ధ్యానములో నేమి జరిగినదియు, ఇంటి వద్ద నెట్లున్నదియు తెలిసికొని ఉత్సాహపఱచుచు ఎవరికైన బాధ తగ్గనిచో కారణ మన్వేషించుచు, దోషములను దిద్దుచు, ఆ దిద్దుగడతో నారోగ్యము చక్కబడుట గమనించుచు, అనవరత పరహిత కాంక్షతో కాలము గడపెడి వారు శ్రీ శాస్త్రిగారు.

ఆ పట్టున నేనచట నలుబది దినములుంటిని. ఆ కాలమున ట్రీట్మెంటుకు సంబంధించిన వింత లనేకము జరిగెను. వానినన్నింటి నిట వ్రాయవలనుగాదు. నాకు సంబంధించిన వొకటి రెండు చెప్పి విడిచెదను.

శ్రీ శాస్త్రిగారి వద్దకు చేరునప్పటికి నాకు ఏమి తిన్నను నొంటఁ బట్టెడిది గాదు. నిద్ర సరిలేదు. కాని వలసినంత యాహారమును నిర్భయముగ తీసికొమ్మనిరనియు, పగలు సైతము నిద్ర పొమ్మనిరనియు వ్రాసితిని. నేనా మాటల నక్షరశః పాటించితినిగాని అందుచే నెట్టి యసౌకర్యము కలుగలేదు. కొన్నాళ్ళయిన పిమ్మట ఒక ఉదయము, “ఈ పూట ఏమి తీసికొంటి” వని శ్రీ శాస్త్రి గారడిగిరి. రెండిడ్డెనలు తీసికొంటినని చెప్పితిని. వెంటనే, “అన్యాయ మన్యాయము! ఏడింటికి రెండిడ్డెనలు, పండకొండుకు భోజనమా?” అని శ్రీ శాస్త్రిగారనిరి. ఎక్కువ తింటిని గాబోలునని నేను నివ్వెరపోయితిని. “నీ ఒడ్డు పొడుగులకు రెండిడ్డెన లేమూల నాలుగు న్యాయము” అనిరి. మరునాఁడు తిరిగి యడిగిరి. “నాలుగు తీసికొంటి”నంటిని, “ఆపైన” అని యడిగిరి. “మామూలు పద్ధతి

నొక యరకప్పు కాఫీ తీసికొంటి"నంటిని. "ఇది కేవలమక్రమము. జోడిడ్డెనలకొక యరకప్పు, రెండు జోళ్ళకు నిండు కప్పు" అనిరి. మరునాఁడట్లు చేసితిని. "ఇడ్డెనలు మాత్రమేనా? ఈ శాస్త్రము నీకు తెలియదు. విను! మొదట రెండిడ్డెనలు, వానిపై కొంచెము కాఫీ, ఆ మీద నుప్పుమావ్, దాని కాచ్ఛాదన దోసె, ఆ కప్పు మీఁద ఒక కప్పు కాఫీ పోయవలె" నని కడుపు చెక్కలగునట్లు నవ్వించిరి. ఆ యూపుతో పూట కెన్మిది ఇడ్డెనలు, భోజనమున నరవీశెడు కూరలు, రెండు కప్పుల పెరుగు, మధ్యాహ్నము నిద్ర లేచి అరడజను పేవాజప్పళము పండ్లు, కిస్మిస్, అంజూరా, ఆపిల్ ఫలములు, సాయంత్రము నాలుగు బోండాలు, కాఫీ, రాత్రి భోజనములో మామిడిపండ్లు – ఇంత వఱకు వచ్చితిని. ఈ రాకాసి తిండి నేఁడు నేనే నమ్మఁజాలనట్లున్నది. లేకున్న నిరువది రోజులలో నిరువది పౌనుల తూకము పెరిగియుండననుకొందును !

ఒకరోజున అన్నామలై విశ్వ విద్యాలయములో గణిత శాస్త్రాధ్యాపకులుగా నున్న ప్రొఫెసర్ నరసింగరావుగారు[1] వచ్చిరి. వారుగూడ యోగ మిత్ర మండలిలోని వారే. శ్రీ శాస్త్రి గారి ఇంటనే బస. ప్రసంగవశమున నా కథయంతయు శ్రీ శాస్త్రి గారు చెప్పిరి. వారాశ్చర్యముతో వినిరి. ఈ మాటలు జరుగుచున్నంత కాలము నాలో గుబ గుబ మని యేదో సంచలనము జరిగెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు దీర్ఘములాయెను. వెన్నెముక నిట్ట నిలువున బుసగొట్టు త్రాచు వలె నిలిచెను.

---

1. డా॥ ఆచార్య ఏ. నరసింగరావు గారు అన్నామలై యూనివర్సిటీలో తొలి గణితశాస్త్రాచార్యులు. యోగమిత్రులు శ్రీ శాస్త్రిగారికి సన్నిహితులు. వారితోనే అన్నామలై యూనివర్సిటీలో (1929–1946) గణితశాస్త్ర శాఖ ఆరంభమై నేటికిని మూడు పూవులు ఆరు కాయలుగా వృద్ధి చెందుచున్నది.

రెండు భుజములు వెనుక కొత్తుకొని రొమ్ము విప్పారెను. శ్వాసను కొలుచు పద్ధతి నాకు తెలియదుగాని, కొలిచినచో నది రెండు బారలైన నుండునేమో! మా ముప్వురకు నాశ్చర్యము కలిగెను. "ఎట్టి శరీర వ్యాయామము లేకయే ఇంతటి శ్వాస యెట్లు కలిగినది? చూచితిరా ! ఇదంతయు మాష్టరు గారి దివ్యానుగ్రహము" అని శ్రీ శాస్త్రి గారు తమ వలన బాగయిన వారందరితోను తాము నిమిత్తమాత్రుడనియు, మాష్టరు గారి యనుగ్రహమే సర్వ నిర్వాహకమనియు చెప్పెడివారు.

నేనచటనున్న దినములలో ననేకులు ట్రీట్మెంటుకు వచ్చెడివారు. వారిలో రిక్షా లాగువారు, కస వూడ్చుకొనువారు, ఆఫీసు గుమాస్తాలు, ఆఫీసర్లు, ఉపాధ్యాయులు, యూనివర్సిటీ ప్రొఫెసర్లు, డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు, సనాతనులు, శాయి బాబా మత ప్రవర్తకులు, కమ్యూనిస్టులు, విద్యార్థులు, కాంగ్రెసు నాయకులు మొదలగు పలుతెఱుగులవారుండెడి వారు. తేలుకాటు, ఒడలు కాల్పు, గాలి సోకు, టైఫాయిడు, పరిణామశూల (Gastric Ulcer) పైత్య కోశమున రాళ్ళు (Gall stones), నంజు, జలోదరము మొదలగు అన్ని బాధలను శ్రీ శాస్త్రి గారు యోగ ట్రీట్మెంటుతోనే చక్కజేసెడివారు.[1]

వీరిలో మిక్కిలి దయనీయుడగు నొక బాలుని గూర్చి వ్రాసెదను. ఆ బాలుని తండ్రి రిక్షా లాగువాఁడు. నాలుగు రోజుల క్రిందట ఆ బాలుఁడు కాలు జారిపడెను. అప్పటి నుండియు వానికి స్మృతి కలదుగాని నోట మాట లేదు. కనుపాపలొక ప్రక్కకు తిరిగి వెర్రిగా చూచును. మూతి వంకరపోయి యున్నది. మెడ ఒక ప్రక్కకు వాలెను. కాలుసేతులు

1. వీటితో కొన్నింటిని ఆచార్య విస్సా అప్పారావు పంతులుగారు, డా॥ విస్సా రామచంద్రరావు గారు కూడా గ్రంథస్థము గావించిరి. (చూ.మణిమంజరి సంపుటము)

ముడుచుకొని పోయి స్వాధీనమున లేవు. వానిని చేతులపై మోసికొని వచ్చిరి. ఆ బాలుఁడు ముద్దగట్టిన బాధవలె నుండెను. వానిని చూచుట తోడనే దెబ్బతిన్న లేగ దూడను జూచి యడలు గోమాత వలె క్షోభించిపోయిరి శ్రీ శాస్త్రిగారు. ఇటు బాలునియవస్థ, అటు శాస్త్రిగారి యవస్థ చూడలేకపోయితిమి. ఆ బాలునికి లోని కాహారమేమియు ఇవ్వలేదని తెలిసికొని వాని తల్లిదండ్రులపైనను, వారి దరిద్రముపైనను కటకట పడి ఇంటిలో నుండి ఒక కప్పు కాఫీ తెప్పించి స్వయముగా చిన్ని చెంచాతో వాని నోటఁ బోసిరి. ఆ పిమ్మట వాని యారోగ్యమునకై ధ్యానము చేసిరి. ఆ సరికి ఆ బాలుఁడు ప్రక్కయానుడుతో ఒక విధముగ కూర్చుండగలిగెను. అంతట శ్రీ శాస్త్రి గారు వాని శరీరమంతయు నిమిరి సర్దిరి. వాడు సరిగా కూర్చుండగలిగెను, చుట్టునున్న వారి మొగములు వికసించెను. ఇక వానిని నిలుచుండుజేసి నడిపింపవలెను. వానిని లెమ్మని చెప్పిరి. కాని వాఁడు తడువుకొనునే గాని లేవలేఁడు. డ్రిల్లు చేయువారి నాజ్ఞాపించు సార్జంటువలె నధికార గర్జనతో లెమ్మని తిరుగ ఆజ్ఞాపించిరి. అంతట వాఁడు లేచెను. అప్పుడు శ్రీ శాస్త్రిగారి తీరు చూచి తీరవలెను! ఒక ప్రక్క యానందము! మరొక ప్రక్క యాందోళనము! వాడు నడచిననే గాని వారికి తృప్తి లేదు. వాకిలి వఱకు రెండు మార్లు వాడు నెమ్మదిగా నడచెను. తరువాత వాని నింటికి గొంపొమ్మనిరి. వెనుకటి వలెనే తండ్రి వాని నెత్తుకొనఁబోయెను. శ్రీ శాస్త్రి గారు వలదని వానిని నడచియే ఇంటికి పొమ్మనిరి. మేమందరమాశ్చర్యముతో చూచుచుండగా వాడు నడచి యింటికి చేరెను.

ఈ రీతిగా వ్రాయ మొదలిడినచో ఆ నలువది నాళ్లలోని ముచ్చటలే ఒక గ్రంథమగును. తరువాత నాల్గు సంవత్సరములకు నేను తిరుపతిలో

శ్రీ శాస్త్రి గారి పునర్దర్శనము చేసినపుడచటి సంరంభమింతటి కంటె మిక్కిలి హెచ్చుగా నుండెను. తిరుపతిలో ట్రీట్మెంట్ల పద్ధతి కొనసాగిన తీరు చూడఁగా మానవ కోటికి అమృతత్వ సిద్ధి యబ్బనున్నది గాబోలు ననిపించెడిది. తిరుపతిలో నున్నపుడు జబ్బులను 'పో' యన్న పోవునట్లు తోచెడిది. కాని మదరాసులో చూడని దుర్ఘటనలు కూడా తిరుపతిలో జరుగకపోలేదు. డాక్టరులాస వదలుకొన్న చివరి ఘట్టములలో కొందఱచ్చటికి చేరిన వారు కలరు. అట్టి వారిని మాత్రము మృత్యువున కేల వదలవలెనని శ్రీ శాస్త్రి గారు సాహసించి ట్రీటు చేసెడివారు. వారిలో కొందఱు సురక్షితులై నేఁటికిని సుఖజీవనము నెఱపుచున్నవారు కలరు. కాని కొన్నింట ట్రీట్మెంటు వలన నుపయోగము కన్పించుచునే ఆయువు తీరెడిది. నూటికి నూరుగురను సాధ్యాసాధ్య దశలయందన్నింటను రక్షించుటే జరగినచో నిక సాధన పూర్తి యయినట్లే కదా! అట్టి శుభ ముహూర్తమిప్పటికి రాలేదు. ఎప్పటికి వచ్చునో!

ఆధ్యాత్మిక శక్తి వలన శారీరక రుగ్మతలు మాన్పనగునని పలువురు విశ్వసింపరు. నమ్మకుండుటయే న్యాయము. బలవత్తర ప్రమాణము లున్ననే గాని విశ్వసింప వీలుగాని క్రొత్త విషయమిది! తొలుత టెలిఫోన్ పద్ధతిని ప్రదర్శించినపుడు అచట నున్న ఒక గొప్ప రాజకీయవేత్త దానినొక గారడీయని నిరసించెనట! తాను మాట్లాడుచూ, ఆ కంఠ ధ్వని మఱొకరి నుండి వచ్చుచున్నట్లు చేయు కళ (Ventriloquism) అనెనట. పాశ్చాత్య భౌతిక శాస్త్ర పరిశోధకులు క్రొంగ్రొత్త విషయములను కనిపెట్టినపుడు పలుమారులు వారినప్పటి పండిత ప్రపంచము నిరసించుటయో, హింసించుటయో జరిగెడిది. గెలీలియో నుండి జగదీశబోసు వఱకు శాస్త్ర పరిశోధనా చరిత్రలో నిట్టి సన్నివేశములు పెక్కు గలవు. కాని అభూత

జ్ఞాతములగు విషయములను సునిశితముగను, పలుమారులును సంశోధింపకయే యొప్పుకొనుట వలన గూడ ఒప్పుమి గలదు. ప్రత్యేకించి ఆధ్యాత్మిక ప్రపంచమునకును, భౌతిక ప్రపంచమునకును నిచ్చెనలు వేయు పని చాల ప్రమాదభూయిష్ఠమైనది. మార్గమా క్రొత్తది. దారి చూపువారా లేరు. ఈ దారి ఎటకు గొంపోవునో తెలియదు. మన యాయుష్కాలములో గమ్య స్థానమును చేరగలమో లేదో తెలియదు. అందుచే నీ రంగములోని యన్వేషకునకు

"అసతోమా సద్గమయ తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మామృతం గమయ" – అను ప్రార్థన మొక్కటే తోడు.

క్రీస్తు ప్రభువు గూడ ఆత్మశక్తిచే అనేకులను నిరామయుల నొనర్చెనని విందుము. క్రైస్తవులలో నిట్టి నమ్మకమును, అనుభవములును నేఁటికిని గలవు. సెంటు బొర్నాడొటే గీతము (The song of St. Bernadotte) అను నవలలోని వాస్తవిక కథయంతయు నిట్టిదే. ఫ్రాన్సులోని LOURDES అను పట్టణములోని మఠము వద్ద నిత్యము అనేక దేశముల నుండి రోగులు వచ్చి ప్రార్థనలో పాల్గొని నిరోగులగుదురట! అచట ప్రవేశము బడయునపుడే రోగిని ఒక డాక్టర్ల సంఘము పరిశీలించి రోగ వివరములను వ్రాసి యుంతురట! పిమ్మట వారు వెడలిపోవునప్పటి శరీర స్థితిని పరిశీలించి అది ఎంత వరకు నిజమగుమార్పో కాదో నిర్ణయించి రికార్డు చేయుదురట. జీవ వైద్య శాస్త్రములలో నగ్ర శ్రేణికి జెంది నోబెల్ బహుమతి బడసిన అలెక్సిస్ కెరోల్ అను మహనీయుడు MAN THE UNKNOWN అను గ్రంథములో నిట్టి చికిత్సను గూర్చి ఇట్లు వ్రాసినాఁడు.

".. The most important cases of miraculous healing have been recorded by the Medical Bureau of Lourdes. Our present

conception of the influence of prayer upon pathological lesions is based upon the observation of patients who have been cured almost instantaneously of various affections, such as peritoneal tuberculosis, cold abscesses, osteitis, suppurating wounds, lupus, cancer, etc. - The only condition indispensable to the occurence of the phenomena is prayer. But there is no need for the patient himself to pray, or even to have any religious faith. It is sufficient that some one around him be in a state of prayer. Such facts are of profound significance. They show the vality of certain relations, of still unknown nature between psychological and organic processes. They prove the objective improtance of the spiritual activities, which hygienists, physicians, educators and sociologists have almost always neglected to study. They open to man a new world...".

నేఁటి విజ్ఞాన పరిశోధన వలన పెక్కు ప్రకృతి రహస్యములు వెల్లడియయినవి. పదమూఁడు, పదనాలుగు శతాబ్దములలో శాస్త్ర పరిశోధన తీరుని పరికించిన వారెవరును నేఁటి విజ్ఞాన సముపార్జన సాధ్యమని యూహించి యుండరు. నేటి విజ్ఞాన పరిశోధన జీవ జడ పదార్థములను వేర్పఱచు కక్ష్యాంతరములోనికి జేరుచున్నట్లు తోచును. మరియొక యడుగు వైచినచో నది విరాట్టునే చేరునేమో! శాస్త్ర పరిశోధకులు వారి కవసరమయినపుడు పరిశోధనా మార్గములను, పరికరములను మార్చుకొనుచునేయున్నారు. ఈ నూతనాన్వేషణకు వలయు మార్పులను జేసికొనుట వారి ప్రజ్ఞకు మించినదిగాదు. కాన వేగిరపడి వేనిని త్రోసివేయవలదని మనవి!

3

శ్రీ శాస్త్రిగారి ప్రజ్ఞ బహుముఖముల ప్రసరించినది, వారి వ్యక్తిత్వమును క్రొత్త వారికి పరిచయపఱచగోరెడు రచనకెంతయో నేర్పుగావలెను. మరియు గ్రంథమా పెరుగును, అందుచే నేనిట కొన్ని కొన్ని పట్టులను స్పృశించి వదలెదను.

కల్పనా సాహిత్యమును గూర్చి వారి యభిప్రాయము విశిష్టమైనది. అట్టి గ్రంథములందు మనము చూచునది అసత్యమే! అసత్యపఠనలో కాలము వ్యయింపనేల? కవి ద్రష్టయైన గాని జీవిత సమస్యల లోతు తెలియనేరఁడు. ద్రష్ట కాని వాని రచనలు కొలఁది లోఁతున నూరెడి జలమువలె దుష్టములు–నిజమైన కవిత్వమునకు శబ్దార్థాలంకారముల యాడంబరముల పనిలేదు. ద్రష్టయైన వాని రచనలందు వస్తు గౌరవమును బట్టి అన్ని యలంకారములు నందు స్వతస్సిద్ధముగ నేర్పడును. ఇందులకు గాంధీజీ రచనలే సాక్షి. మానవ విజ్ఞాన కళ్యాణములను గూర్చు శాస్త్ర విషయ గ్రంథములు పఠనీయములు.

మరియు నిత్య జీవితములోని యనేక యథార్థ సంఘటనలు కవితా వస్తువుగ స్వీకరించి, కరుణ రస ప్రధానముగా నీతి ప్రబోధకములుగా అలఁతి యలఁతి మాటల కూర్పుతో సుందరముగ రచింపనగునని వీరు తలుచెడివారు. ఆ రీతిని వారు కడుపుతీపు, విశ్వాసము, కపోత కథ, మూన్నాళ్ల ముచ్చట మొదలగు చిన్న ఖండ కావ్యములను రచించిరి.

పూర్వ సాహిత్యమున భవభూతి మహాకవి యుత్తర రామ చరిత్ర వీరిని పులకింపఁజేసెడిది. ఆ నాటకమునకు వీరు చెప్పెడు వ్యాఖ్య ప్రతిభా సమన్వితముగా నుండెడిది. శాకుంతలమన్న వీరి కభిరుచి తక్కువ. తుమ్మెద నెపముగా దంభములాడుచు ప్రవేశించు దుష్యంతుని జూచి

వారు జుగుప్స పడెదరు! ఆ పాత్రకును నేఁటి రౌడీ రసికునకు భేదము లేదని వారియూహ. సాహిత్యమును గూర్చి వారికిగల విశిష్టాభిప్రాయము లనన్నింటి నిట వ్రాయననువుగాదు. ఆ పనికి నేను చాలినవాఁడను కాను. వారి ఆత్మజిజ్ఞాస సాహితీ రంగమునసెట్లు ప్రతిబింబించెనో చూపుటకు మాత్రమిది వ్రాసితిని. తుదకు సాహిత్య విమర్శయందును, చరిత్ర పరిశోధనమందును కల్గు ఈర్ష్యాద్వేషాదులను రోసి వారు వానిని వదలి తమ జీవితమును మానవ సేవకే అంకితము జేసిరి. ఆ సందర్భమున వారు చెప్పిన పద్యములు.

కవితా శిల్పము సల్పఁగాఁ దొలుత వేడ్కల్ రేగెనాకున్, గృతుల్
చివురెత్తెన్, వెస మోము మొత్తె, నిఁక నాచేఁ జెల్ల వీ కల్లబొ
ల్లి వినోదంబు, లవే జరామరణముల్ చీడల్ హతం బార్చి పు
ట్టువు చెట్టున్ సఫలీకరించుకొని యంటుల్ గట్టెదన్ మాలినై.
త్రికరణ శుద్ధిగా భవదధీనుఁడనై యితర ప్రవృత్తి వీ
డికొని పరార్థలాభ మొకటే గమనించుచు నుందు, నింక మా
యికము ధనాదికమ్ము గణియింపను, సత్యదయోపకార సా
ర్థక మగునాత్మ చింతనపథంబును దప్పి చరింప నీశ్వరా!

శ్రీ శాస్త్రి గారు కల్పనా సాహిత్యమును నిరసింతురనియు, సాహిత్యమున సైతము కరుణను, నీతిని ప్రధానముగా నెంతురనియు, సాహిత్య కృషియే వీడి రోగులకు ట్రీట్మెంట్ చేయుటతో కాలము గడపెదరనియు వ్రాసిన దానిని బట్టి వారి సాన్నిధ్యమున నుండుట యన శుష్క వేదాంతములతో నీరస జీవనమును గడుపుటయని తలపోయరాదు. ఆయన నిజముగా సత్యాన్వేషి! కళారాధకులు! ఉత్సాహజీవి! వారి

ప్రతిపని యందును ఈ గుణములు కన్పించుచుండెడివి. రకరకముల రంగుపెన్సిళ్ళు, కలములు, చేతికఱ్ఱలు, వింత వింత వస్తువులు సేకరించుట యందు వారికి ప్రీతి యెక్కువ. ఈ పెన్సిళ్ళను సేకరించుటే వారి వంతుగాని వాడుకొనుట యందఱివంతు! ఇట్లే ఫౌంటెన్‌పెన్నులు. దేనితో వ్రాసిన దస్తూరి సొంపుగా నుండునోయని చూచెడివారు. చుట్టునున్న వారు తమ తమ పెన్నులతో పోటీ పడెడువారు. చిటికెన వ్రేలంతటి కొబ్బరికాయల నెచటి నుండియో తెప్పించి వానికి వెండి పొన్నులు, మూతలు చేయించి స్వయంగా మెఱుఁగుపెట్టి స్నేహితులకు బహూకరింతురు. ఇట్టిది నాకొకటి ఇచ్చిరి. నేను నశ్యము వాడనుగదా యని సందేహించితిని. నశ్యమునకైనచో వారా పని చేయరు. ఆ కాయలో దూదిపెట్టి అందు మంచి యత్తరుగాని యూడికొలోన్‌గాని వేసి వాసన చూచుకొనవచ్చునని వారు సలహా నిచ్చిరి. ఇట్లే అనేక రకముల చేకఱ్ఱలను వారు స్వయంగా మెఱుగుపెట్టి స్నేహితులకిచ్చెడివారు. తాటి చేవతో చేయబడి గుర్తింపరానివి, పామువలె ఏడెనిమిది వంకరలు తిరిగినవి, పెద్ద పెద్ద వెండిపొన్నులతో మెఱయునవి యగు రకరకముల కఱ్ఱలు వారికడ నుండెడివి.[1] ప్రార్థనా మందిరములో కూర్చుండుటకు రకరకముల పొడల జింకల చర్మములు, పెద్ద పులి చర్మములు తెప్పించెడివారు. వారికడకు తెలుగు నాటి నాలుగు మూలల నుండి అన్ని వర్ణముల వారును, అన్ని తరగతుల వారును వచ్చెడివారు. వీరందఱిని తమవచో చమత్కృతితో నలరించెడివారు. మరియు వారు వారు వాడిన క్రొత్త మాటలను గూర్చియు, వాని ఆనుపూర్విని గూర్చియు అప్పటికప్పుడే ఫైలాలజీని నిర్మించెడివారు. దోసె అనగా రెండు చేతుల

1. ఈ చేతికఱ్ఱలు ఒక స్టాండులో నేటికిని వారి కూతురు శ్రీమతి వారణాసి సుజాతమ్మ గారింట చూడనగును.

వెడల్పుగలదనియు దో=రెండు +సెయ్=చేతులు, అరసె యనగా అరచేతి వెడల్పు గలదనియు (అర+సెయ్) అనియు నా భక్ష్యములకు క్రొత్త రుచి కలుగునట్లు చెప్పెడివారు. ఇఁక పండ్లు కోయదగిన పరువములు, వాడఁదగిన రీతులు, కూరల రుచులు బహు పరిశీలనతో చెప్పెడివారు. గుంటూరు, కృష్ణాలలోని గోగుపచ్చడిని గూర్చి “కడుపు తీపు” అను చిన్న పద్య కావ్యములో వారు ఇట్లు వ్రాసిరి.

“పయరకూర వేచి పచ్చి మిరెప పండ్ల
నుక్కళించి పోసి యూరనిచ్చి
కొంతగొంత పొగిపికొను గోఁగుఁబచ్చడి
చవికి నింక నోరు చివికితీరు”.

ఈ యోగ సాధకులకు పుష్టికరమైన యాహారము అవసరము. ట్రీట్మెంటు చేయు వారికి ఈ సౌకర్యము మిక్కిలి యవసరము. కాని మదరాసులోనున్న ఆ రోజులలో శ్రీ శాస్త్రి గారికి ఏఁబది రూకల వేతనము, పెద్ద కుటుంబము, ఆ పైన వచ్చిపోయెడివారు. సగముపైగా యింటి అద్దెకే ఖర్చు. ఇక బియ్యము, పప్పు, కూరలు, పాలు, నేయి, కట్టెలు, బట్టలు, ఆహా! నిజముగా నివి యన్నియు శాస్త్రిగారి కుండెడివా? ట్రీట్మెంటుకు వచ్చినవారి వద్ద చిల్లి గవ్వ పుచ్చుకొనరు. ఎవరైన నాలుగు పండ్లు తెచ్చిరో వారి కనుమానము! ప్రతి ఫలము పుచ్చుకొని ట్రీట్మెంటు చేయుమనుచున్నారని, తెల్లవారు సరికి, సాయంకాలమగుసరికి ట్రీట్మెంటు వేళకు దహ దహమని యాకలి! యోగ సాధనకన్న నాకు చూడగా వారి సంసార సాధనయే కష్టమనిపించినది. ఆ పేదఱికము గూడ వారిని భగవదభిముఖులనే గావించెడిది. ఇన్ని చిక్కులలోను వారు చలింపక

"భారములన్నియు నీపైన వేచి నిర్భయుడనై యున్నానులే" అనియో, "తరముగాని ఎండ వేళ కల్పతరు నీడ దొరకినట్లాయె ఈ వేళ" అనియో గొంతెత్తి పిల్లవానివలె పాడుచుండఁగా మనము వేరొక ప్రపంచములో నున్నట్లు తోచెడిది. ఆ పూటకు బియ్యము లేక, భగవంతుఁడేమిచేయునో చూతమని జరిపిన కథలు కూడ కలవు. ఆపూటకెవరో ఇంతకన్న భాగ్యశాలి నెల్లూరి నుండి శేరున్నర బియ్యము మూట గట్టుకుని పది గంటల ప్రొద్దెక్కునప్పటికి తెచ్చి యిచ్చెను. ఇతఁడా దినము రావలసినవాఁడుగాదు. వీరియవసరము తెలిసినవాఁడును గాదు. మరియొకనాఁడు భోజనమునకు పూర్వమేయని జ్ఞాపకము – ఏదో మాటాడుచు ఇపుడు అనాసపండు తినిన బాగుండును అనిరి శాస్త్రిగారు. ఇంతలో తలుపు తెరచుకొని రాజమండ్రి నుండి ఒక మిత్రుడు అనాసపండ్ల బుట్టను తెచ్చెను. లేమిడిచే నలిగులి యగుచున్నను దాని నుండియే ఒక వింత తృప్తిని కల్పించుకొనెడివారు శ్రీ శాస్త్రిగారు. ఒక రాత్రి భోజనానంతరము విశ్రాంతిగా నిద్రపోబోవుచు నిట్లనిరి. "ఏమయ్యా! నాకు గల పరితృప్తి జార్జి సార్వభౌమునకైన నుండదు. ఈ పూట ఇచటకు బాధపడుచు వచ్చిన వారెందరో నవ్వుచు బోయిరి. నా వలన ఈశ్వరుడిట్టి పుణ్యకార్యములను చేయించుచున్నాడు గదా యను తృప్తితో నేను హాయిగా నిద్రింపఁగలను. మరియు మన కేపూటకు వలయు వాని నా పూటకు చుక్కలు చుక్కలుగా అమృతము స్యందించినట్లు భగవంతుఁడను గ్రహించుచున్నాఁడు. అప్పటికప్పుడది యాస్వాద్యమై హాయిని గొల్పుచున్నది. నిలువఁజేయవలె ననెడు పరితాపముగాని, నిలువ చేసి దానిని సంరక్షించుకొనుటకు పడు నవస్థలుగాని నాకు లేవు గదా" ఈ మాట విన్న వారికి ఎట్టి ఇక్కట్టులను, నాటంకములను, కష్టములను సైతము

యోగి తనకు మేలు కలిగించు సాధనములుగ మార్చుకొనగలఁడను మహనీయ సత్యము స్ఫురించితీరును!

4

శ్రీ శాస్త్రి గారు నెఱపు ట్రీట్మెంటు పద్ధతిని గూర్చి పాఠకులీ సరికి తెలియగోరుచుందురు. ఉభయసంధ్యల యందును నొకచో నుపవిష్టులై శాస్త్రి గారు వారి గురుదేవులను స్మరించి, నమస్కరించి, కనులు మూసికొని కొంత తడవు అంతర్వీక్షణములో నుందురు. వారిలో నేమి జరుగునో మనకు తెలియరాదు. రుగ్మతా పీడితులు గూడ ఆ సమయములందు వారి సన్నిధిని చేరి కూర్చుండి, వారి వారి యనారోగ్యములు నయమగునట్లు అనుగ్రహింపుమని కరుణా సముద్రుఁడైన భగవానుని వేడికొని, కనులు మూసికొని శరీరములో నేమి జరుగునో సాక్షి మాత్రముగ గమనింతురు. కొందఱికి వింత వింత సుందరతర దృశ్యములు కనుపడును. కొందరికి శరీరమున నొవ్వు గల భాగములందేదియో కదలించినట్లును, సవరించి నట్లును తెలియనగును. కొందఱు చీకుచింతలు మఱచి హాయిగా నిద్ర జెందుదురు. ధ్యానానంతరము శరీరముత్సాహముగను, బాధా విహీనముగను ఉండును. కొన్ని పూటలిట్లు జరిగినచో క్రమ స్థిరారోగ్య మేర్పడును. ఎప్పటికప్పుడు ధ్యాన సమయమున జరిగిన విశేషములన్నియు రికార్డు చేయఁబడుచుండును.

ఒకప్పుడు ఒకరి యనారోగ్య కారణము మానసికము అయి యుండ వచ్చును. అట్టి యెడ నా కారణము నన్వేషించి యెరుకకుఁదెచ్చుకొని దిద్దుకొన్ననేగాని ఆ యనారోగ్యము చక్కబడదు. శారీరకమైనను, మానసికమైనను అనారోగ్య స్వరూపమంతయు చికిత్సకునికి అవగాహన

కానిదే చక్కబడదు. ఇందును గూర్చిన అద్భుతమైన విశేషము లెన్నియో చికిత్సకై వచ్చిన వారు రికార్డు చేసినవే చాలా గ్రంథము కలదు.

దగ్గర కూర్చున్న వారికేగాక శ్రీ శాస్త్రిగారు సుదూరమున నున్న వారికి గూడ చికిత్స జరుపుటయు, ఆశ్చర్యకరముగ వారారోగ్యము పొందుటయు గలదు. ఒకప్పుడు ప్రమాద సమయమని తోచినపుడు, ఇతరోపాయములన్నియు కట్టుబడినపుడు, శ్రీ శాస్త్రి గారికి టెలిగ్రాము పంపుటయు, ఆ తంతి చేరీ చేరకమున్నే ఇచట సౌఖ్యము గలుగుటయు గలదు.

శ్రీ శాస్త్రి గారు వ్యక్తులకును, రుగ్మతలకును ట్రీట్మెంటు చేయుటయే గాక దేశము మొత్తమును పీడించు సమస్యల సుఖ పరిష్కారమునకై గాఢమైన తపస్సు చేయుటయు గలదు. 1946 ప్రాంతమందలి రాయలసీమ కరువును గూర్చియు, 1947 భారత స్వాతంత్ర్యమును గూర్చియు వారు చేసిన అమోఘ తపస్సును, అందు వారు పొందిన దివ్యానుభూతులును మఱువరానివి. ఈ సందర్భమున గాంధీజీ ఉపవాసములలో శ్రీ శాస్త్రి గారు వారి క్షేమమునకై యెంతగానో కృషి చేసెడివారని వెల్లడించక యూరకుండఁజాలను. శ్రీ శాస్త్రి గారు తమ సహజ వినయశీలము వలన నిట్టివి బహిరంగ పఱచెడివారు కారు. దేహములు రెండుగాని ప్రాణమొక్కటే యన్నంత గాఢాభిమానముతో గాంధీజీని వీరు ప్రేమించెడివారు. ఆయన అహింసా తత్త్వమును, హరిజన సంస్కరణ, దేవాలయ ప్రవేశ ఉద్యమములను బలపఱచెడువారు. ఆ యద్భుత విశేషము లెల్ల ప్రకటించవలసినవే! గ్రంథ విస్తరభీతిచే వాని నన్నిటిని వదలితిని, వారి పరిచయులెల్లరు వాని నెఱుగుదురు.

శ్రీ శాస్త్రి గారి వలెనే పలువురు భృక్త రహిత తారక రాజ యోగమున

దీక్షబడసిరి. వారెవరుగాని ఇంతటి పట్టుదలతో, విజయవంతముగా నిత్యము ట్రీట్మెంటు చేయుట నేనెఱుఁగను. వారిలో కొందరికి ట్రీట్మెంటు పద్ధతిని గూర్చి వేఱు అభిప్రాయములు గూడఁ గలవు. ఒకటి – ట్రీట్మెంటు చేయు వారాపదల పాలగుదురు. రెండు – ఈ యోగము ట్రీట్మెంటులకై ఏర్పడలేదు – అని వీరి మతము. ఈ విషయమై శ్రీ శాస్త్రి గారి వలన మేము తెలిసికొన్నదేమనగా:

**ఒకటి:–** ట్రీట్మెంటు పద్ధతికి మూల సూత్రము పరులయార్తిని గూర్చి ఆపుకోలేని యనుతాపము. ఆ బాధ తనకే కల్గినదా యన్నంత వగపు. ఆ యనుతాపమే బాధితుల యార్తిని దీర్చును. ట్రీట్మెంటు సలుపువాఁడు "ఇదిగో! చూడు! నేనొక మంత్రము వేయుచున్నా" నను దృష్టితో నున్నచో నది సాగదు. ట్రీట్మెంటు పడయువాఁడు "ఏదీ! నాపై నీ మంత్రము ప్రయోగింపు చూత" మను తీరున నుండరాదు. అట్టిచో నేమియు జరుగదు.

ప్రథమమున శ్రీ శాస్త్రిగారితరుల బాధను గూర్చి తపించుటేగాని, అందువలన ప్రయోజనముండుననిగాని, రోగ నివారణ జరిగినదని గాని గమనించలేదు. కాని కొన్ని మారులు తీవ్రానారోగ్యముచే బాధపడు వారిని జూచి శ్రీ శాస్త్రి గారు దుఃఖితులగుటయు, అతి శీఘ్రముగ వ్యాధి నివారింపబడుటయు గమనించి నిర్హేతుకజాయమానమగు అనుకంపమే సర్వ రోగ నివారకమని తెలిసికొనిరి.

మఱియు స్వపర భేదములను పాటించినచో ట్రీట్మెంటు పని చేయదు. మానవులనందఱను నేక కుటుంబముగ జూచు సమత్వ బుద్ధి యేర్పడిన కొలఁది ఈ ట్రీట్మెంటు విధాన మద్భుత ఫలితములనిచ్చును. ఈ యోగము ననుసరించు వారు పలువురున్నను నీ ప్రత్యేకార్హత శ్రీ

శాస్త్రిగారికే యబ్బుటకు కారణము వారి అపార కరుణాస్వభావమే. కాని ట్రీట్మెంటు చేయు వారికి ఆయా రోగుల బాధలు శారీరకముగా ఛాయామాత్రము కల్గుటయు నిజమే. 1926 ప్రాంతములో శ్రీ శాస్త్రి గారు బాహాటముగా, నిత్య కృత్యముగా ట్రీట్మెంటు నవలంబించినపుడు పలువురు మిత్రులీ కారణమును జూపి వారింపఁజూచిరట! ఆనాఁటి ధ్యానములో శ్రీ శాస్త్రి గారు తమ గురుదేవులతో నీరీతి విన్నవించిరట – "నిజముగా పరుల బాధ తొలఁగి ఆ కారణమున నాకు బాధ కల్గినను సమ్మతింతును. ఆ తొలఁగించునది నేను కాదు. నా వెనుక నీవే దాగియున్నావు. సర్వ దయామయుఁడవైన నీవు నా వలన పరుల బాధలను తొలగించి నన్ను బాధలో ముంతువని నేను వెరతునా? నీ వెనుక నేను దాగనేరనా?" ఈ విషయమునే దెలుపుచు శ్రీ శాస్త్రి గారు రచించిన పద్యములు :

స్వామీ ఆంతర నిలయా స్వయం వ్యక్తమై వెలయ
నాయజ్ఞానావరణము నాశముఁ జేయు మహాత్మా
నే నను నా యధమాధమ నిర్వాహము తొలగించి
నీలో నను గలపుకొని నెగడగదే పరమాత్మా
నాలో గల వని యెఱుగక నానాబాధల పడితిని
త్రో వెఱిగితి నిప్పటికి దుఃఖము తొలగెను దేవా
దేవర నా కీదేహము దేవళమై వెలసినది
చక్కగ నెలకొని విశ్వ స్వామిత్వము నెఱపగదే !
అద్దమువలె దేహం బిది యమలినముగ జేసికొని
నిద్దపునీ తేజము జగదుద్దీప్తము చేయగదే !
అనుక్షణము త్వన్మయతాహ్లాదము హెచ్చెడు విధమున

క్షణక్షణము మన్మయమై జ్వలియింపగదే దేవా !
అహంకార మమకారము లడగార్చి క్రమక్రమముగ
కరగజేసికొని నీలో కన్న తండ్రి! గడతేర్చుము
నా చాటున డాగియె దోబూచులాడుచున్నావా?
చూచితి నిక నే నేమఱ నీచాటున డాగెదను
వెనుకడుగిడ నిక నాథా! వెఱపు జెంద నిక నాథా!
కడతేఱెద నిక నాథా! కల్యాణం బిక నాథా.

ఆ నాఁటి నుండి శ్రీ శాస్త్రి గారు దేహమును వీడు తుది క్షణము వఱకు నేక దీక్షతో ననేక భయంకర జాడ్యములను మాన్చిరి. నిజముగా ట్రీట్మెంటు వలన నెట్టి యపకారమైన జరగియే యున్నచో వారు భౌతిక కాయము నెన్నడో వీడియుండవలసినది. క్షయ, జలోదరము, ఉబ్బసము, మెనింజైటిస్, గుండె జబ్బు, పాముకాటు మున్నగు ఉపద్రవముల నెన్నింటినో వారు చక్కబరచిరి. ఈ యోగ చికిత్సా విధానమున వారికి పాతిక సంవత్సరములకు మించిన యనుభవము గలదు. అందు వారే పరమ ప్రామాణికులు !

విశేషించి వారిట్లు చెప్పెడువారు. “పరుల యనారోగ్యములను సవరించునెడ మన యనారోగ్యములు కూడ తొలగును” అని. ఇది మాలో పెక్కురకు అనుభవపూర్వకముగా విదితమైన విషయము.

“దయాగుణము బలవంతంగా తెచ్చి పెట్టుకొనునది గాదు. అది ఆకసము నుండి పుడమిపై పడు చల్లని జల్లువంటిది. దయఁజూపు వానిని, దయఁబడయువానిని అది ద్విగుణముగా వర్ధిల్లఁజేయును” అని మహాకవి షేక్స్పియరు చెప్పినది అక్షరశః నిజము.

"The quality of mercy is not strain'd
It droppeth as the gentle rain from heaven
Upon the place beneath; it is twice blest;
It blesseth him that gives and him that takes:"

**– Shakespeare**

మరియు జీససు చెప్పినట్లు,

"Blessed are the merciful : for they shall obtain mercy".

**- Mathew. V (7).**

రెండు :- ఈ యోగము ట్రీట్మెంటుకై యేర్పడలేదను వారికి శ్రీ శాస్త్రి గారు ట్రీట్మెంటులే లేనిచో నిది యెవరికి కావలయును? అని సమాధానము చెప్పెడివారు. అభ్యాస కాలమున శరీరమున జరుగు కొన్ని స్పందనముల కొఱకెవ్వరు దీని నాశ్రయింపరు అని పలికెడువారు.

ఇంతకు శ్రీ శాస్త్రిగారి సాధన వారి ప్రకృతి ననుసరించి విశిష్ట మార్గమవలంబించెనని తోఁచును. ఆత్మచింతన పథము కూడ సత్యదయోపకార సార్థకముగ నుండవలెనని వీరి నిశ్చయము. వీరి ఆత్మార్పణా విధానము జీమూతవాహనుని కథను, బౌద్ధ జాతక కథలను స్మృతికిఁ దెచ్చును.

వీరి కడ ట్రీట్మెంటు పడయఁగోరి చేరిన వారు ఆరోగ్యమును బడసిన పిమ్మట తమ కారోగ్యమును ప్రసాదించిన దివ్యతత్త్వమును అన్వేషించెడివారు. మఱియు తమ బాధ నెపముగ వారు సర్వాంతర్యామి నెఱుకకు దెచ్చికొన ప్రయత్నించెడివారు. ఒరుల క్లేశము నపనయించుటకు చికిత్సకుఁడు వారితో నైక్యతను భావించనిదే ఫలము కలుగదని వ్రాసితిని.

ఇట్టి యెడ ట్రీట్మెంటు అనేకముగా గన్పట్టుచు నేకమగు పదార్థమును గురుతించుటలో నొక యభ్యాసముగ పనిచేయుచున్నది. మనలను మనము చూచికొనుట కేర్పడిన భృక్త రహిత తారక రాజయోగసాధనకు ట్రీట్మెంటు పద్ధతి సహాయకారియే యగుచున్నది. అవసరము కూడా నగుచున్నది.

మఱియు–ఇతరుఁడు బాధపడుచుండఁగా చూచి యోగి యూరకుండుటెట్లు?

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోర్జున
సుఖం వా యది వా దుఃఖమ్ స యోగీ పరమో మతః" – భగవద్గీత vi–32

"ఓ యర్జునా! ఎవఁడు సుఖములోను, దుఃఖములోను సర్వులను తనవలెనే చూచునో వాఁడు పరమ యోగి" అను భగవద్గీతా ప్రబోధమును గూడ జ్ఞప్తికిఁదెచ్చుకొందముగాక!

# మలిపలుకు

మీది విషయమంతా 30 ఏళ్ళ క్రిందట వ్రాసినది. అప్పుడు నా వయసు ముప్పైయెనిమిది. ఆధ్యాత్మిక మార్గాన నన్ను తీర్చిదిద్దిన పూజ్య గురువర్యుల సంతాపకరమైన హఠాన్మరణ సన్నివేశము నేను దగ్గర ఉండగా జరిగినదే. కనుక ఆప్పట్లో చకితుడనై నేను వ్రాసిన వ్రాతలో ఎక్కడైనా ఒకటి రెండు పంక్తులు కొద్దిగా అతిశయోక్తులేమో అనుకోదగిన రీతిని దొరలితే దొరలి ఉండవచ్చునేమో గాని మొత్తం మీద ఈ ముప్పది యేండ్ల తర్వాత నా అరవై యెనిమిదవయేట దీనిని తిరిగి చదివి చూచుకొన్నప్పుడు అంతా చాలా మట్టుకు యథార్థమే అని ఇప్పుడూ

తోస్తున్నదని వినయపూర్వకంగా నివేదించుకొంటున్నాను. నా ఆధ్యాత్మిక గురువులైన శ్రీవారి యోగ చికిత్సా విధానపు మహిమకు, అది నేటికీ కొనసాగుతున్నదన్న యథార్థమునకు, వారి శిష్యగణములో తిరుపతిలోన శ్రీనివాసాచార్యులు గారిని, గుంటూరులో రామకోటయ్యగారిని ప్రమాణముగా ఉదహరింపవచ్చును.

శ్రీ శాస్త్రిగారనుసరించిన ఈ నూతన యోగ విధానమును గూర్చి మరి కొంత యేదైనా వ్రాద్దామనే ఉబలాటాన్ని నేను ప్రయత్నపూర్వకంగా అణుచుకొంటున్నాను. ఎందుకంటే ఈ యోగం అతీత కాయ కల్ప సిద్ధిని, ఐహిక అమృతత్వాన్ని, పరిపూర్ణ ప్రజ్ఞను ప్రసాదించడమే లక్ష్యంగా కలదని యెరుగుదుము గాని అంతకన్నా అధికంగా మాకెవ్వరికీ తెలిసిన విషయం కాదు. అంతేకాక ఈ నవ్యయోగ మార్గ ప్రవర్తకులు కూడా సంపూర్ణావగాహన లేనిదే దీనిని గూర్చి ఏమీ వ్రాయవలదని ఆదేశించారుట కూడా! ఆ మార్గాన సాగుతున్న సాధనకన్నా మించిన అభివ్యక్తి ఆ విషయమై మరొకటి ఉండబోదు.

చివరగా ఇక్కడ శాస్త్రి గారి సహధర్మచారిణి, జీవిత భాగస్వామిని, అయిన మాతృశ్రీ మహాలక్ష్మి అమ్మగారికి కృతజ్ఞతా భక్తి పూర్వక మైన శ్రద్ధాంజలి నర్పించి నా ఋణమును తీర్చుకోవలసియున్నాను.

రేయింబవళ్ళు శ్రమించి ఆ యింటినొక ఆశ్రమంగా చేరవచ్చిన విభిన్న ప్రకృతులు గల శిష్య గణాన్ని మాతృ ప్రేమతో ఆదరించి అన్నమిడి ఆదుకొని నలుబదియేండ్లకు పైగా శాస్త్రిగారికి సహధర్మచారిణియైన మాతృమూర్తి ఆ తల్లి ఒడుదుకులైన ఎన్నో అనుభవాలను నిబ్బరంగా తట్టుకొని పతిదేవుని ఆధ్యాత్మిక సాధనకు అనేక విధాల ప్రశాంతంగా

సహకరించిన దామె.

శాస్త్రిగారి పంచన చేరి ఆ మాతృమూర్తి ప్రేమాదరాలకు నోచుకొన్న వార మెందరమో ఆ తల్లికి తీర్చుకోలేనంతగా ఋణపడియున్నాము. ఆమె తాను కన్నబిడ్డలకే కాక వారి యింట కిక్కిరిసిన అస్మదాదుల కెందరికో తల్లి.

తన పతిదేవుని ఆధ్యాత్మిక యోగానుభూతులలో ఆమె పాలు పంచుకొన్నది. అట్టి దివ్యానుభూతులలో ఆమె సహకారము అతిలోకమైనదని చెప్పదగును. ఆ పుణ్య జీవులిద్దరూ ఈ యోగ విధానమున ప్రకృతి పురుషులవలెనే పరస్పరము సహకరించుకొనిరి.

**– కొత్త వెంకటేశ్వరరావు**

# భృక్తరహిత తారక రాజయోగము

శ్రీ శాస్త్రి గారు ట్రీట్మెంటులో బాగు చేసిన వారితో ఆ బాగు చేయునది తాము కామనియు సర్వాంతర్యామి, సర్వ దయామయుఁడు నగు ఈశ్వరుఁడే యనియు చెప్పెడివారని వ్రాసితిని. వారి గురుదేవులే సాక్షాత్పర బ్రహ్మము! కాని వారి పేరైన ఎన్నడును ఉచ్చరించెడివారు కారు. కారణము – ఈ యోగమును గూర్చి ప్రచారము చేయవలదని సాధకులను వారి గురుదేవులు శాసించి యుండుటయే! చరమదశ వరకును శ్రీ శాస్త్రిగారీ నియమమును పాటించెడివారు. అంతియేగాక ఆ యొరవడినే తమ్ము గూర్చి గూడ ప్రచారము నిరోధించెడివారు శ్రీ శాస్త్రి గారు. అందుచేతనే లోకమున వారి కృషి తెలియఁదగినంతగా తెలియఁబడలేదు. వారి వలన ఉపకారము పొందిన వారిలో కొందఱును, వారి యాంతర్యము నెఱిఁగిన మిత్రులు కొందఱును పత్రికాముఖమున వెల్వరించిన దుఃఖపు వెల్లువ వలననే పలువురు మొదటిసారిగా వీరు యోగ సాధకులని తెలిసికొనిరి. ఎవఁడు లోకమును వీడిన పిమ్మట లోకము వానిని కృతజ్ఞతతో స్మరించునో అట్టి వాని పుట్టువుగదా ధన్యము !

శ్రీ శాస్త్రిగారవలంబింబించినది భృక్త రహిత తారక రాజయోగము. దీనిని 1910లో కుంభకోణమున నొక మహా పురుషుఁడు స్థాపించెను. వారి నామాక్షరములే ఈ యోగమునకు మూల మంత్రము. వారిని స్మరించి నమస్కరించిన వారికి బ్రహ్మజ్ఞానమిత్తునని వారి ప్రతిన. బ్రహ్మైక్యమును పడయవలసినది ఏదో సమాధి దశలోనో లేక దేహము విడచిన పిమ్మటనో గాదనియు, ఈ ప్రజ్ఞతోనే ఈ లోకముననే ఈ దేహముతోనే యనియు వారి మతము. వీరు చెప్పిన వానిని బోలిన కొన్ని విషయములు పూర్వ గ్రంథములందుండ వచ్చును. కాని వీరు ఏ గ్రంథముపైనను ఆధారపడి

యీ యోగమును ఆరంభింపలేదు. అది కేవలము నూతన సృష్టి ! వీరు సర్వస్వతంత్రులు ! మిగుల మహిమాన్వితులు! వీరి నీ మండలి వారు సాక్షాత్పరబ్రహ్మగా తలఁతురు.

పూజ, భజన, హారతి మొదలగు బాహ్య చిహ్నము లేవియు వీరు వలదందురు. వీరిని తలఁచి నమస్కరించినచో శరీరములో యోగ క్రియ ఆరంభమగును. సాధకుని వంతు సాక్షి మాత్రముగ తనలో జరుగు మార్పులను గమనించుటయే. ముద్రలుగాని, ఆసనములుగాని, ప్రాణాయామముగాని, హఠ యోగాభ్యాసముగాని అక్కఱ లేదు. వానిని నిషేధింతురుగూడ ! అభ్యాస కాలమున ప్రజ్ఞ సాధకుని స్వాధీనములోనే యుండును.

ఆహార విషయమున కఠిన నియమము లేవియు లేవు. శరీరమునకు చల్లదనమును, పుష్టిని కల్గించు సాత్త్వికాహారము తీసికొనవలెను. సాధనకై ఇల్లు వాకిలి వదలరాదు. సన్యాసము పనికిరాదు. ఎవరి వృత్తి వారు సాగించుచునే సాధన చేయవలెను. సాధకులు తమ్మితరులు గుఱుతించుటకై ఎట్టి యార్భాటమును ప్రకటింపరాదు. ఈ సాధన వలన అనేక మహత్తులు లభించును. వీని నెన్నఁడును దుర్వినియోగము చేయరాదు. మఱియు అవి ప్రధానములునుగావు. ఈ యోగగౌరవమునకు తగినట్లు సాధకులు తమ ప్రవర్తనను నీతి మార్గమున నడిపించుకొనవలెను.

ఇంకను ఈ యోగమును గూర్చి వ్రాయఁదగిన దెంతయో కలదు గాని ప్రస్తుతమున కింతయే చాలునని విరమించుచున్నాను.

**– కొత్త వెంకటేశ్వరరావు**

మదరాసు

ఖర – శ్రావణ బహుళ విదియ

# ప్రజ్ఞా ప్రభాకరమును గూర్చి

**"శరీరమనే బ్రహ్మాండాన్ని పరిశోధించగా తేలిన పరమార్థమే ఈశ్వరుడు. ప్రపంచంలోని ఆనందాల చరమానందమే ఈశ్వరుడు. విశాల విశ్వాన్ని సంగ్రహించుకొని కుంచించుకొని పోగా మిగిలే పాయింటే - చరమాణువే - ఈశ్వరుడు".**

అని పితృపాదులు శ్రీ ప్రభాకరులు తిరుపతిలో 1949, మే నెల 29వ తేదీన జరిగిన పుర ప్రముఖుల సమావేశంలో ఉపదేశగర్భితమూ ఆత్మకథాత్మకమూ అయిన "ప్రజ్ఞా ప్రభాకరము" అనే గ్రంథానికి ప్రారంభోత్సవం జరుపుతూ ఉద్ఘాటించారు.

ఆ సందర్భంలో తాము పొందిన యోగానుభూతిని గూర్చి వారు చేసిన ప్రసంగాని కిది సంగ్రహ రూపము (చూ. ఆంధ్రప్రభ - దినపత్రిక. 1949 జూన్ 3 శుక్రవారం)

"నా 25వ ఏట భయంకర వ్యాధి గ్రస్తుడనైనాను. ఏ మందులకు మాకులకు ఆ వ్యాధి కుదరలేదు. తుదకు అప్పటి ప్రెసిడెన్సీ కాలేజి ఫిలాసఫీ ప్రొఫెసరు శ్రీ పోతరాజు నరసింహంగారి ద్వారా కుంభకోణంలో వున్న శ్రీ సి.వి. వెంకాసామిరావు గారనే మహామహుని 'ట్రీట్‌మెంట్' ద్వారా ఆరోగ్యాన్ని పొందాను. అప్పటి నుంచి ఆ మార్గమే ఉత్తమమైనదని విశ్వాసం కలిగింది. శరీరమనే పుస్తకాన్ని చదివే తీరును వారి నుంచే నేను ఉపదేశం పొందాను. అంతర్ముఖులమై ఈ శరీరమనే పుస్తకాన్ని అధ్యయనం చేస్తే మన ప్రజ్ఞ ఒక చోటుకు మోదుకొంటుంది. అదే కుండలిని. జడ కోలాటపు దారాలన్నీ ఒకే కేంద్రం నుంచి పాయలు పాయలుగా క్రిందికి వెళ్ళుతున్నట్లుండే దేహంలోని శాఖోపశాఖలకు కేంద్రం కుండలిని అనే ఈశ్వరుడు. ఈశ్వరుడు

మూత్ర పురీష కోశాల మధ్య మూలాధారంలో సృష్టికర్త రూపంగా వున్నాడంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఉదయం వేళలో దూరంగా వున్న చెట్టు నీడ మధ్యాహ్నం 12 గంటలకు చెట్టులో లీనమైనట్లు ప్రపంచం భగవత్తాదాత్మ్యం పొందాలి. ఇలాటి దివ్య ప్రజ్ఞ ప్రపంచానికి అందే కాలానికి జాతి మత వర్ణ విచక్షణ రూపుమాసిపోతుంది"

ప్రజ్ఞా ప్రభాకరము మాస్టర్ యోగోపదేశాన్ని మాస్టర్ యోగానుభూతిని సాధకుని హృదయక్షేత్రంలో అక్షర రూపాన నిక్షేపించడాని కవతరించిన సాహిత్య సర్వస్వము.

**"నన్నున్ వర్ణన సేయఁగా వలవదన్నా! కన్నయందాఁక, మీఁ**
**ద న్నీ వర్ణన మెందు కిందులకుఁ గొందాఁకన్ బ్రతీక్షింపు మం**
**చున్న న్గూర్చిన యష్మదాజ్ఞకు నెదుర్చూపై గృహద్వారమం**
**దున్నాఁడం గనరాఁగదే కనుట కర్హున్ నన్ను ఁ జేయంగదే" (వే. ప్ర)**

అన్న తీరున ప్రభాకరులు ఆ "ఎదుర్చూపు"తోనే తమ ముప్పది యేండ్లకు పైపడిన యోగ సాధన కాలంలో మాస్టర్ యోగాన్ని గూర్చి వ్రాయడం గాని, యోగోపదేశాన్ని ఇతరులకు చేయడం గాని తాము చేసియుండలేదు. 1948లో తమ షష్టి పూర్తినాడు శ్రీ ప్రభాకరులకు ప్రాతరుపాసన సమయమున గురుదేవుల యాజ్ఞ తెలియనయ్యెను. "నన్ను గూర్చి వ్రాయగల యోగ్యత నీకు గలిగినది" అని శ్రీవారుద్బోధించిన విషయ మనుభూతికి వచ్చినది.

**"వచ్చెను నేఁటి కర్వదగు వర్షము పుట్టువుఁదొట్టి, గర్భముం**
**జొచ్చుట దొట్టి నాకరయఁ జూచిన నేఁటికె షష్టి పూర్తి, యీ**
**వచ్చిన యేడు నిండిన ధ్రువంబుగఁగాఁగల షష్ఠిపూర్తితో**
**నిచ్చుట నాకుఁ గావలయు నిష్టికిఁ బూర్తియు సృష్టిపూర్తియున్"**

అని విశుద్ధముగా తలపోసి ప్రజ్ఞాప్రభాకర రచనకు వారు తొడగినారు.

**"సీవీవీ కరుణా కటాక్షములు రక్షించున్ సదా తన్మయం**
**బై వర్తిల్లెడు భక్తి యున్న యెడ నిత్యానంద మారోగ్యమా**
**హావుట్టించెడు ప్రజ్ఞ యీ త్రయము లభ్యంబౌను తార్కాణ నే**
**నే! వేయేటికి? మీఱలందఱును దీనిం జక్క గుర్తింపరో!"**

అని సప్రమాణముగా వారీ ప్రజ్ఞాప్రభాకరమున తమ అనుభూతి ఉపదేశమును సీవీవీ కరుణా కటాక్షమున సమన్వయించి చూపినారు. 'మీరలందఱును దీనిం జక్క గుర్తింపరో' అని ఆదేశించినారు. గ్రంథ రచనము 'నాడీ గ్రంథము' అను ప్రకరణము వఱకును సాగినది.

అయ్యో! ఈ గ్రంథ మసమగ్రముగా నాగెను గదా అని పై పాటున చదువరికి తోచవచ్చును. కాని 'దీనిం జక్క గుర్తించి' నపుడు గ్రంథ మసమగ్రమగు ముగింపు కలది కాదనియు, సర్వ సమగ్రమగు మాస్టర్ యోగ మార్గమున ప్రవేశార్హతను ప్రత్యక్షముగా కల్పించు నీ "ప్రజ్ఞా ప్రభాకరము" సాధకుని హృదయమున గలుగ వలసిన ప్రజ్ఞా సమున్మేషమునకొక యుపక్రమము మాత్రమే అనియు తెలియుచున్నది.

మాస్టర్ యోగ మిది యొక నూతన ప్రయోగము. పరబ్రహ్మ స్వరూపులగు మాస్టర్ సీవీవీ ఈ యుగమున ఈ రాజయోగము నుపదేశించిరి. వారి వాక్కు స్వతః ప్రమాణమై, వారి సాధనానుభూతి యోగమై, వారి యునికి లోక తారకమై నెగడినది. "సీవీవీ" అను శ్రీవారి నామాక్షర త్రిపుటియే సర్వ మంత్ర రాజమై విరాజిల్లినది. జరుగవలసిన లోక కళ్యాణమునకా మంత్రమే ఆదిమూలము, తార్కాణగా నిలచి

సాధకులకు పథము నిర్దేశించి ఉపదేశమొసగుట కవతరించిన మంత్రమే ప్రజ్ఞాప్రభాకరము తన్మూలము ననుసరించిన వ్యాఖ్యానము.

"నా మాటలు స్వతః ప్రమాణములు గాని పరతః ప్రమాణములు గావు."

"నేను సదా నీలో నుందును. నీకు కావలసిన సహాయమును నీలోనుండి జరుపుచునే యుందును".

"బండి నడచు చుండగానే రిపేరు సాగవలెను. బండి ఊడదీసి చేయుచో బండివాని జీవిక చెడును. అట్టిది నా యోగమార్గము".

'ఈ యోగమున నెవడు గాని ప్రత్యేకముగా కడతేర జాలడు. తాను, తన చుట్టు పట్టులవారు, తన యాప్తులు నన్ను క్రమముగా లోకము నంతను ప్రేమించి లోకమునంతను గడతేర్చువాడు కావలె. తన ప్రేమ సర్వలోక వ్యాపకము కానంత వఱకు నెవ్వడుగాని కడతేరజాలడు. ఆ ఖండము, సర్వ వ్యాపకమునగు తత్త్వమును బడయుటకు తాను నఖండుడు, సర్వ వ్యాపకుడు కాక తప్పదు. దేశ కుల జాతి మతాది పరిచ్ఛేదములతో వేఱుపడిపోయి సర్వ ప్రజలతో సామరస్యము కుదుర్చుకో లేనివాడు సంసార బంధమున కొట్టుకాడ వలసినవాడే!"

"మన పరిపూర్ణత భవిష్యత్తులో నున్నదిగాని భూతము కాలేదు. కనుక భూతమను పీఠికపై నెలకొని భవిష్యత్తున పరమార్థ మనుభవింప వలసియున్నది."

"మానవ హృదయము నిర్ధుష్టము కానంతవఱకు, మానవ వాక్కు సుపవిత్రము కానంత వఱకు సృష్టి రహస్యము మానవత గుర్తున కందనేరదు. ప్రయత్నములు సాగుచున్నవి."

"ప్రజ్ఞోద్బోధములు వెంటాడుచు బాహ్య శాస్త్రాది సాధనములను విడనాడవలెను. కడకు ఆత్మానుభూతిలో నెలకొనుట యగును. మీరు చూడవలసినది యీ తాటాకులనాడి గాదు. శరీరమున చైతన్యముతో ఆడుచున్న నాడి. ఈ తాటాకులనిక గట్టిపెట్టి ఇందుచూపు తత్పరతను యోగ సాధనము మీద చూపుడు."

"మఱ్ఱి చెట్టునకు ఎన్నాళ్ళకేదిక్కున నేశాఖ నది వెలయింప గలదో తెలియనట్టే లోకతంత్రమున, మఱీ యీ యోగ తంత్రమున వికాసముండును."

"మన ప్రజ్ఞ పెరుగను పెరుగను ఈశ్వరునకు జేరువ కానుగాను సర్వ ప్రాణి సృష్టి రహస్యములను మానవుడు గుర్తింప గల్గవచ్చును. మానవత పెరుగను పెరుగను తద్ హృదయమున నుండి ప్రజ్ఞోద్బోధములు పెరుగగలవు".

"పది సంవత్సరములు విడువక నా యాదేశము చొప్పున యోగాభ్యాసము చేయవలెను. అన్ని వాంఛితములను నీవే నెఱవేర్చుకొన గల్గుదువు".

ఇది మాస్టర్ ఉపదేశము.

"గులాబి మొగ్గను గడుపున బెట్టుకొని దాని గ్రమ్ముకొని కఱకు నూగు తొడిమ ఱేకేతొలుతగాన వచ్చినట్లుగా ఉపక్రమమున నిందు ప్రభాకర నామకుడనగు నేనే కానవత్తును గాని నాలోని దివ్యతత్త్వపు బూవు వికాసము చెందిన పిదప నది సువాసనను సౌకుమార్యమును వన్నెలను వెలార్పజొచ్చిన పిదప, దాని గొని యానందింప గోరువారికి నేను తత్ప్రదర్శకుడనుగానే, యంగులీగ్రాహ్య మగుతొడిమను గానే యడుగున బడియుండి కానవత్తును.

అప్పుడది ప్రజ్ఞాచరిత్రమే కాని ప్రభాకర చరిత్రము గాదు. ప్రభాకరచరిత్ర మయినను ఆ ప్రభాకరుడు తొల్లింటి నేను గాక వేఱొకడే".

ప్రజ్ఞాప్రభాకరమిది ఆ ప్రజ్ఞాచరిత్రమున కుపక్రమము. అంగుళీ గ్రాహ్యమగు తొడిమ "అడుగున బడియుండి" కాననగు ప్రజ్ఞోద్బోధము. దివ్య శరీర శాస్త్రమునకు గూర్చిన పీఠిక యోగానుభూతికి సజీవ వ్యాఖ్యానము. సాధకునకు మాస్టర్ యోగమార్గానుయాయికి అతీతకాయ కల్పసిద్ధిని గూర్చు ముఖద్వారము, ప్రవేశానుగ్రహమును కల్పించు ప్రమాణ పత్రము.

ఇది సాధకుల యనుభూతి. ప్రజ్ఞాప్రభాకరమును భక్తితో చదివి ప్రార్థనకు కూర్చున్న వారిలో ఇనీసియేషన్ పొందిన మాస్టర్ యోగ సాధకులకు గలుగు చైతన్య స్పందనము కలుగుటయే దీనికి తార్కాణము.

**– వేటూరి ఆనందమూర్తి**

# VPS TEST

*TEST*

Test on Prabhakara Sastry by C. Radhakrishna Pillai 23.6.1916, 9.17 a.m. boring No. 2. Breathing No. 31. From 11.9.13 by planet Sukra in its ray during its breathing 41.

The figure appears in its own natural colour and with a little healthy constitution in erect sitting posture with smiling face. His penial gland is greenish and is marked by 2 diagonally passing yellow lines. It is often suppressed by a strong vapour emanating from Hithu portion with green mixed yellow tint and rose border with such a force as to cause sudden shaking to the penial gland and this occurs occasionally. A rainbow coloured light with a candle flame like light in the middle which is internally pierced by white sparks which emanate upwards to come from his para Nirvanic Centre. His Hithu is not yet formed. His whole skeleton is not yet condensed and is yet dim white in colour and flexible Two sets of wasted nerves of sympathetic chains with fever ganglia at the neck portion unevenly distributed and the whole spinal nerves with such growths as to appear to be temporarily wasted from natural condition. The ganglia at mental and astral are also very unevenly distributed and very small in size. The chief centre of the nervous system at the Medulla has some of its epithelial cells at the motor generating centre, by the radiation of the above mentioned vapour from Hithu, has semi paralysed and displaced from their original position. Hence it has lost all sensory and motor control over the whole body which has more of sensory portion in actual work than of motor by the above wastage and has become very sensible to all kinds of vibrations and when affected by any

sort of mental anxiety of thought working, it upsets the whole system causing a melting at the chief nervous centre which causes a shaking throughout the main system producing temporary giddiness, semi un-conscious state, fear and failure of auditory and optic nerves, and he loses all control of thought and becomes as if a new man during such hours which continued for a short period only but occurs very often.

It makes him unfit for any work and even for taking his meals and thus a feeling of apprehension prevails and he thinks his life is a burden is in a position not knowing how to act. By this nervous debility, heaviness at chest and hard breathing, improper circulation even in ordinary meals are caused. By the failure of the Motor nerves on the muscular walls of the stomach bile is produced in large quantity and constipation is caused.

Urine too will be uneven in quantity and number varying from a large number of even less than minimum. This affect will also cause pain and swelling in the seed nerves also causing much anxiety and unbearable condition. The interior of his spinal column is filled with yellow tinged semi liquid mucus.

This soul is an ordinary type of the first sort and has passed 1731 births and is in the ladder acquiring gnana with bhakti and though studied much in this birth and able to argue in bits in philosopy he has no practical knowledge of any theories nor does he like to go in for any. He was a prey to his present disease for the last three years which has grown up very gradually and he was seeking relief for his complaint at this stage being informed of the existence and curative power of this society he was advised to seek help since which only can give him remedy and with this idea he was brought up here. From this first idea, the second thought extended that after being

relieved from his ailments and seeing the result to request after wards if there is any way for salvation. With this idea he joined the society and if he finds any relief even minutely, he will work with faith and will follow instrucitons.

The astral is obedient and promises to obey commands. About 1/8th Horse power is less at present to H.P. and the rate of vibrations is 50 per minute. Temperature of the body under normal conditions is 98.6 corresponding chillness in 79. He must be advised to continue practice for one month as per Master's personal instruction and after seeing the result to get advice either to continue practice or to undergo treatment. Let him be advised after he reaches his place to use conjee prepared with rice and green gram mixed with milk and sugar after taking early bath before 6 a.m. and thence to commence practice. At evenings if he finds it convenient to bath let him bath and do the practice. Let him try to avoid coffee and substitute Raw conjee or any other drink for tiffin. Let him take more quantity of ghee and curd and milk food at night. About vegetables and other diets let him adhere according to his desire and taste.

True copy of the "Test" gathered from Yoga Records and sent by Dr. P. Seshagiri Rao - Ed]



వే. ప్రభాకరశాస్త్రి

వేటూరి ప్రభాకరశాస్త్రి తెలుగు సంతకం (చౌహాన్ సింగ్ తీసిన ఫొటో)



ప్రార్థనలో ప్రభాకర గురుదేవులు



ప్రభాకర శాస్త్రి (1888-1950)
డా॥ వేటూరి ప్రభాకర్ చిత్రించిన పెన్సిల్ స్కెచ్

నాడీ గ్రంథాలు, వాటిని గూర్చి నా అనుభవాలు, ధ్రువనాడి, భుజండనాడి, పక్షిశాస్త్రము వగైరాలు, మదరాసు నుండి టూరుకు బయలుదేరడం, ముక్త్యాల, నరసాపురములలో అనుభవాలు, శ్రీ మాష్టరు మదరాసులో నుండగా ఆఫీసు టెలిగ్రాం మీద మేము మెడ్రాసు రావడం, ఆరోగ్యవృద్ధి, శ్రీ మాష్టరుగారి సన్నిధిని నా అనుభవాలు, విశాఖపట్టణం టూరు, అక్కడి విశేషాలు, గంజాం జిల్లా టూరు. నేను రాసిన పద్యాలు, ... పేపరు, అమ్మగారికి అనారోగ్యం, లీవు, ధ్రువనాడి, హైదరాబాదు టూరు, గురువు పుట్టడం, నేను కుంభకోణం రావడం, మాష్టరు గారు నన్ను మందలించుట, దాని రహస్యం, మఱి కొన్నాళ్లకు మదరాసు రావడం, మళ్లీ కొన్నాళ్లకు కుంభకోణం వెళ్ళి మాష్టరుగారితో మాట్లాడడం, అప్పుడు వారు చెప్పిన చాలా ముఖ్యమయిన మాటలు, మదరాసులో అన్నగారి కుమార్తెకు జబ్బు, మమ్మందరినీ కుంభకోణం రమ్మనుట వగైరా, అంగారక, ప్లానెటరీ కోర్సులో శుక్రకోర్సు విషయం, నేను కుంభకోణం వెళ్లి తీవ్రంగా అడుగుట వగైరా, యమ్ కోర్సు, మాష్టరు గారి వియోగం, ఇంచికేపు కమిటీ, పదచ్యుతి, యూనివర్సిటీ ఉద్యోగభంగము, Inner Experiences, ట్రీట్‌మెంటు, ఆనందు పుట్టడం, Treatment I, T.N. రామచంద్రన్, వాని సిస్టరు, కుప్పుస్వామి శాస్త్రిగారు, అప్పారావు గారి స్నేహము, వారి యింట ట్రీట్మెంటు విశేషాలు, లలిత వివాహ నిశ్చయము, తగాయిదాలు, వివాహం జరగడం, అంతకు పూర్వమే వీరమణి, విశ్వనాథం, పాపయ్య సెట్టి, రాధాకృష్ణయ్య, వగైరా – కుప్పుస్వామిశాస్త్రి గారి ట్రీట్మెంటు, పి.పి.యస్. శాస్త్రి, తిరుపతి ప్రయాణం, రిటైరు అవడం, తిరుపతి రావడం.

# పూర్వకర్మానుభవ రీతులు

స్వప్నమున-తేలు కుట్టుట
ఆనందవాహినిలో వ్యాస విషయం
సినిమా బొమ్మల వలె వెళ్లిపోవుట

# సైకాలజీ

ఎదిరివారి మీద కట్టేవి తన మీదనే ఉంటవి సాధారణంగా.
ఎదిరివారేమన్నా అంటే కోపం రావడం వాని ఉనికికి తార్కాణం.
వారి వీరి తప్పులను ఎవరయినా చాడీలు చెప్పుతే నా చేతగానితనమును-ఎత్తి పొడవడం ఇది అనేవారు.
పూలచెట్టు ఇంట్లో నుంచి మారడం, అన్నం తినక పూర్వమే నిర్ణయిస్తాననడం.

# అనాసపండ్లు

మేడ మీద ఉండగా రాత్రి 10 గంటల వేళ జరిగిన అనుభూతులు.
ఇంజనీరు కుంభకోణం వెళ్లడం, వెంకట్రామయ్య గారు రావడం వగైరాలు, నరసింగరావు బిడ్డని విషయం.
బందరు చదువు, విడో మేరేజి, కాపవరపు వెంకటప్పయ్య గారు.
మద్రాసు రావడం, గోపాలాచార్లు, పనప్పాకం, ట్రిప్లికేన్ హైస్కూలు, వివాహార్థము బందరు రావడం, రెంటాల వివాహము, టైఫాయిడ్ – తిరుపతి యాత్ర, గర్భాదానము, సు,కు.శా – “తమ్ములు కుఱ్ఱవాండ్రు, తల్లిదండ్రులు, వృద్ధులు...”, ఒరియంటలు లైబ్రరీ ఉద్యోగము. రంగాచార్లు గారు, కుప్పుస్వామిశాస్త్రి, జబ్బు చేయడం, సర్వందుఃఖం. నంజుండ రాయాదులు, లీవు, లీవు, లీవు! – ఆఫీసులో మూడేళ్లపై జాయనగుట, ఇంటి వానిలోని కథ, తాతినిపడద్రోయడం వగైరాలు –

ఇల్లు మార్చుడం, ముసలమ్మ తిట్టడం వగైరాలు – నరసింగరావు గారి విషయం, వెం॥ సు॥ శా విషయం, కొండుబొట్టు బెంగుళూరు – మాపిళ్ల – కనపడడం – మంగలి క్షౌరం చేయించుకొని; తిరుపతిలో వాంతులవుతూ ఉండడం, శ్రీ వేంకటేశ్వర దర్శన విషయము, పద్మనాభ స్వామివారి విషయం, లఘుర్భవేత్ గురుః, కుంభకోణం వెళ్లడం, శర్మ. పోలేపెద్ది వెంకటరామయ్య గారు.

12 రోజులు కాషువల్ లీవు, క్యూరేటరు డిస్‌మిస్ చేయవలసిందేననుట, అక్బరు సాహెబు వీధి, పి.యన్. కలయిక. కుంభకోణ ప్రయాణం, ఇనిషియేషన్, అప్పటి విషయములు, అక్కడి మనుష్యుల సంభాషణలు, నాకనుభూతులు, మద్రాసు వచ్చుట. కృష్ణా జిల్లా టూరు, రామకృష్ణ కవి, నేను, చల్లపల్లి, జీడిపప్పు, కవి గారికి జ్వరము, నాకూ జ్వరము, టెలిగ్రాం, తంజావూరికి రావలసినదని, రొట్టె విరిగి నేత పడ్డట్టయింది. మద్రాసు వచ్చి, కుంభకోణంలో దిగి, తంజావూరు చేరితిని, ప్రతి ఆదివారం కుం (కుంభకోణం), రావడం, క్రిస్‌మస్ విశేషాలు, తిరిగి వచ్చేటప్పటి విశేషాలు. మాష్టరు గారి జీవితము, దాని విశేషాలు. వారిని గూర్చి నేనాడు విన్న విశేషాలు. ధ్రువ నాడి విశేషాలు, రాజారావు చెప్పిన విశేషాలు, మద్రాసు వచ్చుట, కృష్ణా జిల్లా టూరు విశేషాలు. ముక్త్యాల విశేషాలు. కవిగారు క్యూరేటరుగారితో తంటాలు చెప్పుట. ఆయనకబురంపుట, బదులు చెప్పుట, చారుచర్య. నరసాపురం విశేషాలు. తణుకు, భీమవరం, మద్రాసు వచ్చుట, విశాఖపట్నం జిల్లా టూరు. రాయడుశాస్త్రి గారి పరిచితి, దేవాడ లక్కవరం కోట, శృంగవరం కోట, ఎలమంచిలి, ధర్మవరం, పెనుగొల్లు, పద్మనాభంలో విశేషాలు, మద్రాసు రావడం, గంజాం జిల్లా పర్లాకిమిడి, అక్కడి విశేషాలు, మాడ్గుల అక్కడి విశేషాలు, బరంపురం, సెలవు పెట్టడం, రివర్షన్, 3

నెలలు లీవు. క్యూరేటరు కోపం, హైదరాబాదు టూరు. దివ్యారోగ్యము. గుంటూరు జిల్లా టూరు, దాని విశేషాలు. నెల్లూరు జిల్లా టూరు, తమ్ముల వివాహానికి తొందరపడడం, కారణం. తమ్ముల వివాహాలు, ఇద్దరు తమ్ములు సకుటుంబులుగా మద్రాసులో ఉండుట, సివివి వియోగము –

## సెల్ఫ్ అడ్వైసు – లింకు

భాషా విషయ వివాదము

శుక్ర కోర్సు, తనను గూర్చిన రచన, మా మా భవిష్యద్వృత్తులు – ఒలిడియర్ కోర్సు – నేను యం.టి. అనుట వగైరాలు.

వియోగము తర్వాత చీకాకులు. 1922 మే వియోగము. (19)25 మే నుండి మరల కూడుచుండుట, (19)27 మార్చి నుండి విశేషాలు. (19)29 దాకా జరిగిన విశేషాలు. ట్రీట్మెంట్లు. (19)39 దాకా మద్రాసులోనే, (19)39 తర్వాత తిరుపతి వచ్చుట. ఇక్కడి విశేషాలు. కొండమీదికి వెళ్ళుటను గూర్చి– మద్రాసులో 1927 – 28 పద్మనాభమొదలి యింట పూజ, హారతి వగైరా విశేషాలు. పి.యన్. ఇంట ఉండగా, వెంకటరమణరావు యింట ఉండగా, గురువు జ్వరం – 'స్వదాహ మహమౌషధమ్'. ఇంజనీరు విషయం.

## కుంభకోణం

అరవింద విషయము. అప్పారావుగారితో మైత్రి, వారి భార్యయనారోగ్య విషయము – చి॥సౌ॥ లలిత వివాహ విషయము – దాని నిర్వాహము. శంకరయ్యర్, సత్యనారాయణమూర్తి వగైరా విషయము.

తర్వాత ఎప్పటికో ఒక రెడ్డి గ్రామమున జరిగిన విషయములు, వ్యాఖ్యాతమగుట, రిక్షావాలా విషయము. చి॥ గురువు విషయము. చి॥ సుజాత విషయము. ఆనందు విషయము –

సి.వి.వి. నమస్కారం

# 1. ఉపక్రమం

శ్రీ నిరంతరానంద నిశ్శ్రేయసార్థ
సాధకము సర్వకిల్బిష బాధకము, స
మగ్ర విజ్ఞానదము మహా మహిమ ఘనము
శరణమగు మాకు సద్గురు చరణయుగము.

(ఎప్పటికీ తరగని మంగళకరమైన ఆనందమయమైన ముక్త లోకాన్ని సాధించిపెట్టేదీ, అన్ని దుర్వ్యాధుల్నీ హరించేదీ, అంతులేని విజ్ఞానాన్ని అనుగ్రహించేదీ, గొప్ప మహిమతో కూడుకొన్న పూర్ణత్వాన్ని కలిగినదీ అయినటువంటి సద్గురువు యొక్క పాదద్వయాన్ని శరణు వేడి ఆశ్రయిస్తున్నాను.)

సత్యస్వరూపమూ, జ్ఞానమయమూ, ఆనందపూర్ణమూ అయిన పరతత్త్వం అందుకు వ్యతిరేకమైన చిత్త వృత్తితో, అవివేక జీర్ణారణ్యంలో చిక్కుపడి, చీకాకుపడుతున్న అనద (=అన్యథా శరణం నాస్తి అనుకొన్న అనాథ)ను నన్ను దారికి తెచ్చి కాపాడిన విధానాన్ని మిత్ర సంఘం ముందు వెల్లడించుకోవడమే ఈ గ్రంథ రచనా పరమార్థం. ఇందులో నాకు పురుషోత్తముడైన గంధిమహాత్ముని ఆత్మకథారచనా విధానం దారిచూపే వెలుగు దివిటీవంటిది. గులాబీమొగ్గ రూపుదిద్దుకొనే దశలో దాన్ని ఆవరించి ఉన్న కఱకునూగు తొడిమే ముందు కనపడ్డట్టు, ప్రారంభంలో మీకు ఈ ప్రభాకరుని పేరే మొదట గోచరించినా అందులో దాగి వున్న ఆ దివ్యతత్త్వపు పువ్వు వికసించి, సువాసననూ, సుకుమారతత్వాన్ని, వింత రంగుల సోయగాన్నీ విరజిమ్మే సమయానికి ఆ పువ్వుని మునివేళ్ళతో పట్టుకొని చూపించే తొడిమనుగానే నేను అడుగున పడి వుంటాను. అప్పుడది ప్రజ్ఞా

చరిత్రమే అవుతుంది కానీ, ప్రభాకర చరిత్రము కాదు. ఒక విధంగా అది ఈ ప్రభాకరచరిత్రమే అయినా ఆ ప్రభాకరుడు వెనుకటి నేను కాక వేరొకడే![౨]

**"పరుషము నిష్ప్రయోజన మబద్ధ మనార్యము చేర రాదు నా**
**విరచనలందు, డెందము పవిత్రముగా విలసిల్లి సత్యసుం**
**దరము పరార్థయుక్తమగు తత్త్వమునే వెలయింపగా వలెన్**
**గురుచరణారవిందములకున్ బ్రణమిల్లెద నట్టి నేర్మికై".**

(పరుషమో, ప్రయోజనం లేనిదో, అబద్ధమో, సభ్య వ్యవహారానికి దూరమైనదో ఏదీ నా విశిష్ట రచనల్లో చోటు చేసుకోకూడదు. మనస్సు పవిత్రంగా ఉండి, ఎల్లప్పుడూ సత్యమూ, సుందరమూ, ఇతరులకు సదా మేలు చేకూర్చేదీ అయిన తత్వాన్ని ఆవిష్కరించే నేర్పు కలదిగా ఉండేట్లు అనుగ్రహించాలని కోరుతూ సద్గురుచరణ కమలాలకు శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను).

---

౧. శ్రీ శాస్త్రిగారు 'గంధి మహాత్ముడు' అనే పేర్కొనేవారు, 'గాంధి' అని కాక. గంధి అనే మాట సుగంధ ద్రవ్య సంబంధము కలది.

౨. పరిణతినందిన ప్రజ్ఞాప్రభాకరుడని భావము.

# 2. జననాదికం

(శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తమ ఆత్మకథను ఇలా ప్రారంభించారు.)

(7-2-1888) సర్వజిత్తునామ సంవత్సరం మాఘ బహుళ ఏకాదశీ మంగళవారం నాడు ఉదయాది 19 ఘడియలకు[1] జ్యేష్ఠా నక్షత్రం నాలుగో పాదంలో జన్మించాను. నా జాతకచక్రం జనన ఘడియల వివరాలతో నా బాల్యంలో మా నాన్నగారు వ్రాసింది కలదు గానీ - నేను దానినంతా ఇక్కడ ఉదహరించాలనుకోవడం లేదు. జోస్యులకు దాన్ని పరిశీలించే అలజడి వద్దని నా కోరిక.

మా వూరు పూర్వం వేదశాస్త్రాది విద్యావిదులైన విప్రులతో (బ్రాహ్మణులతో) అన్ని వర్ణాల వారితో విలసిల్లింది. నా పసితనం నాటికి కూడా వేద శ్రౌత సాహిత్య విశారదులు అనేకులు మా గ్రామంలో వుండేవారు. శ్రీవత్స గోత్రులైన వెలనాటి వైదిక బ్రాహ్మణ వంశం[2] మాది. శేషమ్మ మా అమ్మగారి పేరు. సుందరశాస్త్రి మా నాన్నగారి పేరు. ఆ పుణ్య దంపతులకు నలుగురు కొడుకులు, నలువురు కూతుళ్ళు.[౧] నేటికీ (1950) సోదరులు నల్గురమూ సుఖంగా వున్నాం. నాకు ఒక అక్కగారూ, ఒక అన్నగారూ, తక్కినవారు నా తర్వాత పుట్టినవారే. మా అమ్మ పరమ సాధ్వి. మా నాన్నగారు కొంత కొంతగా స్మృతులు (వేద సంబంధమైన విషయములు), జ్యోతిషం శిల్పం సంస్కృత సాహిత్యం నేర్చినవారు. తెలుగులో మంచి సాహిత్యమూ, కొంచెం కవితా పరిజ్ఞానమూ కూడా కలిగినవారు. వైద్య విద్యా విశారదులు. పారంపర్యంగా పౌరోహిత్యమే జీవిక అయినా మా నాన్నగారు ప్రధాన జీవిక వైద్యంగా వర్ధిల్లారు. మా తల్లిదండ్రులు పరస్పరం ప్రేమమయులు. వివాహం అయిన తర్వాత వారెన్నడూ భిన్న స్థలాల్లో

ఎక్కువ నాళ్ళు ఉండి యెరుగరట!

దంపతులు గనుక ఎల్లప్పుడూ గాఢమైన అనురాగం కలవారుగా ఉంటే, సత్సంకల్పాలు గలవారైతే, రస భావానంద మయులై ఉంటే వారి సంతానం కూడా చిరంజీవిత్వాది సద్గుణాలతో ప్రసిద్ధికెక్కి రాణించ గలదని ఇటీవల నేను గట్టిగా గుర్తించిన విషయం. ఇందుకెన్నో తార్కాణాలున్నవి. ౨

మా తల్లిదండ్రుల ప్రగాఢానురాగం వారి సంతానమైన మాకు ఇంత దాకా క్షేమారోగ్యాదికాన్ని ప్రసాదించిందని నా విశ్వాసం. మా తండ్రిగారు ఎనభైమూడేళ్ళు నిరామయ దీర్ఘ జీవితాన్ని గడిపారు. వారి తండ్రిగారు కూడా ఎనభైమూడేళ్ళు జీవించారు. మా తాతగారు అవసాన కాలంలో కుమారుని పిలిచి "నాయనా! నువ్వూ నా వలెనే ఎనభై మూడేళ్లు జీవించగల" వని దీవించారట! చాలా సార్లు మా నాన్నగారు ఈ ఆశీర్వాదాన్ని గురించి చెప్పుకొంటూ వుండేవారు. వారి ఆశీర్వాదం మా తండ్రి గారి యెడ ఫలించింది. మా తల్లిదండ్రులు సంపన్నులు కారుగానీ సంపన్నుల కంటే సుఖంగా జీవితం గడిపినవారు. పుత్రపౌత్రాదులతో మా వూళ్ళో మా యిల్లు దోసతోటలా వుండేది. మా యింట్లో మా నాన్నగారు కుటుంబ సభ్యులతో వంద పుట్టిన రోజు పండుగల్ని జరుపుకున్నట్లు అంటూ ఉండేవారు.

---

౧. సోదరులు 1. శ్రీ వేటూరి వేంకట శివశాస్త్రి (తారణ) 2. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి (సర్వజిత్) 3. శ్రీ వేటూరి చంద్రశేఖరశాస్త్రి (వికారి) 4. శ్రీ వేటూరి శంకరశాస్త్రి (శుభకృత్)

సోదరీమణులు 1. చల్లా మహాలక్ష్మమ్మ (వృష) 2. శ్రీమతి లంక శ్యామలాంబ (నందన) 3. శ్రీమతి కాజ శారదాంబ (జయ) 4. శ్రీమతి కాశీభట్ల సరస్వతమ్మ (దుర్ముఖి)

౨. తమ తల్లిదండ్రుల గాఢానురాగమే తమ సోదరసోదరీమణులందును తమ తమ దాంపత్యానురాగమే తమ తమ సంతానమునందును ప్రతిఫలించునని భావము.

# 3. చిన్ననాటి జ్ఞాపకాలు

ఒక రోజు నేను తోటి పిల్లలతో గోచీ కూడా లేకుండా వీధిలో చింపిరి కాగితాలేరి ఏదో పిచ్చి చదువు చదువుతూ ఉండగా నన్ను చూసి పుణ్యమూర్తి కొట్టరువు సుందరరామయ్య పంతులుగారు – మా ఊళ్ళో అప్పటికి యేభైయేళ్ళ మునుపే బడిపంతులుగా స్థిరపడి పిల్లలందరికీ ప్రాథమిక విద్య నేర్పుతుండిన ఉత్తములు వారు – నన్ను చెయ్యి పట్టుకొని ఇంటికి తీసుకొచ్చి, మా అమ్మగారి నడిగి ఒక గోచీగుడ్డను నా మొలతాడుకి తగిలించి, బడికి తీసుకెళ్ళి, రెండు మూడు రోజుల్లోనే నాకు అక్షర జ్ఞానం కలిగించారు. ఆ తరువాత మా తండ్రిగారు నాకు వారి చేతనే అక్షరాభ్యాసం[3] జరిపించారు. నన్ను నేనుగా గుర్తించడానికి అదే నా మొదటి గుర్తు.

బళ్ళో ఏదో చదువు సాగింది. అన్నింటా నేనే మొనగాడను. లెక్కలు మాత్రం గుండు సున్నా! తెలుగంటేనో వెర్రితీపు! బడిలో ఉపాధ్యాయులు నా చేత తెలుగు పద్యాలు చదివించుకొని సంతోషిస్తూ ఉండేవారు. కానీ పద్యాలను రాగయుక్తంగా చదవడమన్నది అప్పటికీ ఇప్పటికీ నాకు కొఱుకుడు పడని మెతికబియ్యమే! సంగీతంతో కాకపోయినా సందర్భ శుద్ధితో అలా నేను చాలా పద్యాలు చదవగల్గడం ఉపాధ్యాయులందరికీ ముచ్చట కలిగించేది. మా చుట్టుపట్ల గ్రామాలన్నింటి కంటే మా ఊళ్లోనే, మా ఇంట్లోనే సంస్కృత ఆంధ్ర నిఘంటువులు, ధర్మశాస్త్రం మొదలైన గ్రంథాలెన్నెన్నో ఉండేవి. ఆ గ్రంథాల కోసం మా యింటికి చాలా మంది వస్తూ ఉండేవారు. నేనూ అర్థమైనంత వరకూ మా యింట్లో ఉన్న పుస్తకాలన్నింటినీ ఒక్కటీ వదిలిపెట్టకుండా చదువుతూ ఉండేవాణ్ణి. మా నాన్నగారు తెలుగు మఱుగులు (దాగి వున్న విశేషాలు) కొన్ని తెలియ చెబుతూ ఉండేవారు. ఈ ముచ్చట్లలో పడి నేను ఇంగ్లీషు చదువు

నిరాకరించాను. తెలుగూ సంస్కృతం అయితే ఉన్న ఊళ్ళోనే ఉండి ఏ కొన్ని గంటలలో చదివితే సరిపోతుంది. అదే ఇంగ్లీషు చదువుకైతే అమ్మానాన్ననూ, ఇంటి భోజనాన్నీ విడిచి పెద్ద ఊరు బందరు వెళ్ళవలసి వస్తుంది. పైగా ఉదయం పదకొండు గంటల నుంచీ సాయంత్రం ఐదు గంటల దాకా చదువుకోవాలి! ఊళ్ళో స్నేహితుల నందరినీ వదిలి ఒక్కడినే వెళ్ళవలసి వస్తుంది. ఈ భావాలు నా కప్పుడు బాధాకరాలుగా తోచినవి. బలవంతపెట్టి నన్ను మా అమ్మా నాన్నలు కూడా పంపలేదు. పుత్ర వాత్సల్యం, పరాయి చోట తగిన సుఖభోజన వసతి కల్పించే ధన సంపత్తి లేకపోవడం అందుకు కారణాలు.

స్వగ్రామంలోనే బ్రహ్మణ్యులైన మద్దూరి రామావధానులుగారి దగ్గర సంస్కృతమూ, ఇంట్లో తెలుగూ చదువుకునే వాణ్ణి. పుణ్యమూర్తులూ, ప్రాతఃస్మరణీయులూ మద్దూరి రామావధానులు గారూ మా నాన్నగారూ ఇద్దరూ చిన్ననాటి నుండి స్నేహితులు. ఒకే ఈడు వారు కూడాను. పొద్దున్నే బ్రహ్మ ముహూర్తాన[4] నిద్రలేచి, వేళ ప్రకారం సంధ్యా వందనం, అగ్ని హోత్రం మొదలైన వైదిక కర్మలు ముగించుకుని, ఓ గంటసేపు ఉంఛవృత్తి[5] (= ఆ పూటకు సరిపోయే ఆహార సంభారాన్ని సంపాదించుకొనే పని) జరిపి, తొమ్మిది గంటలలోపే ఇల్లు చేరుకుని మధ్యాహ్న పూజ[6] ముగించి, పది అవుతూండగా హాయిగా భోజనం చేసి – కాస్సేపు విశ్రాంతి తీసుకుని, విద్యార్థులకు పాఠాలు చెబుతూ ఆయన కాలక్షేపం చేస్తూ ఉండేవారు. పది గంటల కల్లా భోజనం చెయ్యకపోతే ఆయనకు ఒంటికణత నొప్పి (పార్శ్వపు తలనొప్పి) వచ్చేసేది. వారి శరీర స్థితి అంత సుకుమారమైనది. అప్పట్లో మా ఊళ్ళో వాళ్ళు వారిని గురించీ, మా నాన్న గారిని గురించీ ఇలా అనుకునేవారు – రామావధానులు గారికి ఒంట్లో బాగులేకపోతే

ఊరివారికందరికీ ఒంట్లో బాగోలేనట్లే; మరి, సుందరశాస్త్రిగారింట్లో ఎవరికైనా అనారోగ్యం కలిగితే ఊళ్ళో అందరికీ అనారోగ్యం వచ్చిపడినట్లే – అన్నంతగా (అనగా) తమ అనారోగ్యం గురించో, తమ కుటుంబం వారి అనారోగ్యం గురించో చీకాకు పడేంతగా వారు ఇతరుల అనారోగ్యాల పట్ల చీకాకు పడేవారు కారన్నదే ఆ భావన కర్థం.

మా యింటి దగ్గరే ఉన్న సాలె వీథిలోని సాలెవారు తమ గురువైన భావనఋషికి ఉత్సవం జరుపుకుంటున్నారు. నా వయస్సు అప్పటికి ఏ యెనిమిదో తొమ్మిదో ఉండవచ్చు. సాయం సంజ వేళ 7,8 గంటలప్పుడు అన్నం తినేసి అక్కడ జరుగుతున్న ఉత్సవాన్ని చూడడానికని వెళ్లాను. కాస్సేపటికల్లా, అక్కడే ఒళ్ళు తెలియకుండా కింద పడిపోయాను. ఏదో అయిపోతోంది నాకు అనేలోగానే పక్కనున్న వాళ్ళు గుర్తించి నన్ను ఇంటికి తీసుకెళ్ళారు కాబోలును! ఎంత సేపయిందో! మా నాన్నగారు దగ్గర కూచుని శివకవచం పారాయణ చేస్తూ ఉండగా క్రమంగా మెలకువ వచ్చింది. నాకు మరి ఇంకే బాధా గోచరించలేదు. అంతే ! అటు తరువాత నేను సాధారణంగా ఏ జాతరలకూ, దేవోత్సవాలకూ వెళ్ళటానికి ఉత్సాహ పడకపోవడమే జరుగుతూ వచ్చింది. ఆ సందర్భంలో అలా ఒళ్ళు తెలియక పడిపోవడం ఎందుకు జరిగిందో అప్పుడు ఎవరికీ అంతు చిక్కలేదు. కొన్నేళ్ళ తరువాత అది నాకే తెలియ వచ్చింది. తగిన సమయంలో దాన్ని వివరిస్తాను$_7$.

నాకు పదేళ్ళైనా నిండక ముందు ఇలాటిదే మరో సంఘటన! మా వూళ్ళో కలరావ్యాధి తీవ్రంగా వ్యాపించింది. ఊళ్ళో యీ వ్యాధి పెరిగిపోతోందే అని గూమికూడి బాధపడుతూ ఉన్న వాళ్ళల్లో ఇవాళ మాట్లాడిన వాళ్ళే మరునాడు ఆ వ్యాధి బారిన పడడం, చనిపోవడం

జరుగుతూ వచ్చేది. గ్రామస్థులు దాన్నెదుర్కోవడం కోసం ఎన్నెన్నో తంటాలు పడ్డారు. గ్రామ దేవతలకూ, ఇతర దేవతలకూ మొక్కుకొన్నారు. వ్యాధి కొన్నాళ్ళకి తగ్గిపోయింది. తగ్గంగానే ఊళ్ళో వాళ్ళు పెద్ద ఎత్తున ఆ దేవతల పేరున జాతరలు చేయడం మొదలుపెట్టారు. ఆ దేవతల ఆకారాలూ, వాటి మీద పంబ వారి కథలూ, జంతు బలులూ నాకు చాలా రోతనీ, భయాన్నీ కలిగించాయి. ఆ జాతర చివరిరోజున కొర్లంక అనే పేరున్న దేవతకి ఒక బండి కట్టి, దాని మీది గసికలలో (గసికలు=వాడిగా చెక్కిన కొయ్యగూటాలు) కల్లులు, పందిపిల్ల లైదింటిని గుచ్చి, అవి గిజగిజ కొట్టుకొంటూ మరణయాతన పడుతుంటే ఊరేగిస్తూ ఊరి బయట ఆయా దేవతలకి అంపకాలు చేశారు.

ఆ వేళటి దుర్దర్శనం ఇవేల్టికీ నాకు కళ్ళ ముందు కనిపిస్తున్నది. ఊళ్ళో వాళ్లంతా జాతర బాగా జరిగిందని సంతోషించారు. నేను మాత్రం పెద్ద అలజడికి గురై దుఃఖపడుతూ కూచున్నాను. మరణాన్ని గురించి, మరణానంతర స్థితిని గురించీ, పుట్టుకను గురించీ, పుట్టడానికి పూర్వపు స్థితిని గురించీ, దేవతలను గురించీ ఎడతెగని చింత నాలో చెలరేగింది. పెద్దల్ని అడగలేకపోయేవాడిని. నా తోటి వయసు వారికి చెప్పుకొనీ ప్రయోజనం ఉండేది కాదు. వీటి వెనకనున్న అసలు విషయమేమిటో తెలుసుకోవాలన్న తపనతో రాత్రిళ్ళు భగవంతుడికి మొక్కి కళ్ళు మూసుకుని సమాధానం కోసం వెదకడం మొదలు పెట్టే వాడిని. అలా కళ్ళు మూసుకు చూస్తుంటే చిమ చిమ చిమ్మ చీకటి నన్ను మహాసముద్రంలా చుట్టు ముట్టినట్లయ్యేది. దాని మధ్యభాగంలో ఎక్కడో నేను ఉన్నానని తెలిసేది. అనంతంగా నన్ను చుట్టుముట్టి ఉన్న ఆ చీకటి పొడుగ్గా ఉందా, చతురస్ర ఆకారంగా ఉందా అని కూడా వెదికే యత్నం చేసేవాడిని. అది యేదో

గోళాకారంగా ఉన్నట్టుగా తోచేది. దాని మధ్య 'నేను ఉన్నాను, ఉన్నా' నన్న ప్రజ్ఞ మాత్రం మినుకు మినుకు మంటూ గజిబిజిపాటుతో తోస్తూ ఉండేది. ఇలా యెన్ని రాత్రిళ్ళో నిద్ర ముంచుకువచ్చేదాకా చూస్తూనే ఉండేవాణ్ణి. చుట్టూ చీకటి, భయంకరమైన ఆ అంధకారంలో నేను ఉన్నాను అన్న తెలివి, మెలకువ మాత్రం నాకు కొంత ధైర్యాన్ని యిచ్చేది. అట్లా కళ్ళు మూసుకుని బయటికి చూస్తున్నట్లు చూడ్డమే కాని అప్పుడు నా శరీరంలోకి చూసుకోవడమంటే యేమిటో తెలిసింది కాదు. అలాటి భావనతో చూడనూ లేదు. చూస్తున్న బయటి అంధకారపు గోళం లోంచి నా ప్రశ్నలకు సమాధానాలూ దొరికేవి కావు. నేను చచ్చిపోతే అనిపించి ఆ తర్వాత! అనుకొనే వాణ్ణి. అప్పుడు ఆ చీకటిలో నేను లేను అనిపించేది. బ్రతికి ఉన్నాను అనుకునేవాణ్ణి. కాస్త ధైర్యం తోచి మినుకు మినుకు మంటూ అణుమాత్రుణ్ణిగా ఉన్నాను అని తోచేది. ఎంత తంటాలు పడినా అంతే. ఇలా ఉండగా ఒక రోజు నాలోనే ఒక సంవాదం ఇలా మొదలైంది. అసలు నేనెందుకు పుట్టాను? చచ్చితిని గనుక. ఎందుకు చచ్చితిని? పుట్టితిని కాబట్టి. చచ్చితిని సరే – మరలా పుట్టకుండా ఉండరాదా? పుట్టితినే పో చావకుండా ఉండరాదా? ఏమీ తోచేది కాదు. ఇట్లా మనోమథనం జరిగి జరిగీ చివరికి ఇట్లా తేల్చుకొన్నాను. నా పుట్టుకను నేనెరుగను. నా చావును నేనెరుగను. అంతా చీకటే. ఇప్పటికిప్పుడేదో ఇట్లా మినుకుమినుకుమంటున్నాను. ఇది ఆరిపోతే ఏమవుతుందో తెలియలేదు. వెల్తురు ఎక్కడున్నది? నేనున్నాననే మినుకు మినుకు అణుమాత్రపు వెల్తురే ఉన్నది. అది ప్రజ్వరిల్లరాదా? ఈ చింతే హెచ్చయింది. జాతరల మీది రోత మరీ హెచ్చయింది.

ఆ కాలంలోనే, అంటే – అప్పటికి నా వయస్సు పదేళ్ళైనా ఉంటాయో ఉండవో – మా ఊళ్ళో శివరాత్రి ఉత్సవాలు గొప్పగా జరిగేవి.

మా చుట్టుపక్కల ఊళ్ళన్నిటిలో మా ఊరు ఒక గొప్ప శివ క్షేత్రం. అక్కడ నాగేశ్వరస్వామి అనే శివలింగముంది. అమరావతి వలె అదీ ప్రాచీన శివ క్షేత్రమే. ఎంత ప్రాచీనమైనదైనా అదీ బౌద్ధమత వినాశ చిహ్నంగా వెలసిందే అని నా నమ్మకం. అక్కడి శివలింగం ఒక బౌద్ధ స్థూపశిల అనే ఇటీవలి నా నిశ్చయం. అక్కడి దేవాలయంలో అర్థధర్మ చక్రాలు గల బౌద్ధ స్థూప శిలలున్నాయి. కంటకసేల (ఘంటసాల) స్థూప విధ్వంసనానంతరం (ధ్వంసం చేసిన తరువాత) అక్కడి స్తూప శిలలు ఆ చుట్టుపట్టుల దేవాలయాల నిర్మాణాలకు ఉపయోగపడ్డవి. ఘంటసాల స్తూపపు సూచీశిల ఒకటి మంగి యువరాజు శాసన శిలగా మారింది. క్రీ.శ. 6,7 శతాబ్దాల నాటికే బౌద్ధస్తూపాలు కొన్నైనా విధ్వంసం పాలైనవనే చెప్పవచ్చు. మా ఊళ్ళోని శివలింగం జనమేజయ సర్పయాగ$_8$ స్థానంలో అనంత, వాసుకి, తక్షక, కర్కోటక, మహానాగకుమారుల చేత సుప్రతిష్ఠితమైన దివ్య లింగమని 13వ శతాబ్ది నాటి శాసనమున్నది.

ఒక శివరాత్రి నాడు – జగజ్జ్యోతి వెలిగించేవేళ కంటే చాలా ముందుగానే నేను గుళ్ళోకి చేరుకొన్నాను. కొన్ని మణుగులు (పాత కొలమానం ప్రకారం మణుగు కి = 8 వీశెలు) నింపిన నేతి కుండులో గొప్ప జ్యోతిని వెలిగించారు. అది చూసి తిరిగి వచ్చేటప్పుడు నేను గోపుర ద్వారం దగ్గర జనసమ్మర్దంలో నలిగిపోయి కింద పడ్డాను. జనం నన్ను చింపిరి గుడ్డను దొర్లించుకుంటూ పోయినట్టు నా మీది నుంచే నడుచుకుంటూ పోయారు. ఇక చచ్చాననే అనుకొన్నాను. ఊపిరాడదు. జనం నన్ను అట్లా కాళ్ళతో తొక్కుకుంటూ దొర్లించుకుంటూనే గోపుర ద్వారం బయటికి పడదన్నుకు పోయారు. బయటపడ్డ తర్వాత నెమ్మదిగా ఒంటరి పట్టుకు దొర్లి ఎంతో సేపు విశ్రాంతి తీసుకొంటేనే గానీ నేను చక్కబడలేకపోయాను. ఆ నాటి నుంచే గుళ్ళూ, గోపురాలూ, జాతరలూ నాకు దూరమయ్యాయి.

మరొకప్పుడు మా చుట్టుపట్ల ఊళ్ళల్లో ఒకానొక అలజడి చెలరేగింది. అదేమిటంటే – ఒక రోజల్లా పొద్దున్నుంచీ సాయంత్రం దాకా ఊళ్ళో వాళ్ళందరూ ఊరు వదిలి పొలిమేరలకు వెళ్ళి ఉండాలి; అక్కడే వంటా వార్పూ చేసుకుని, దేవతలకు నైవేద్యాలిచ్చి భుజించాలి. ఇంటి వాకిటి తలుపుల మీద శ్రీ వైష్ణవ నామం అంటించాలి. మెడలో సొరకాయ పెంచిక (ఎండుముక్క) కట్టుకోవాలి. అట్లా చేయకపోతే ఊరికి చాలా అనర్థాలు దాపురిస్తాయి. అంతే! ప్రతి యింటి వాకిలి తలుపు మీదా నామాలు వెలిశాయి. ఎక్కడివో యెండు సొరకాయ బిళ్ళలు – అమ్మేరు కాబోలు – వచ్చిపడ్డాయి. జందేలకూ, మెడ హారాలకూ, మొలతాళ్ళకూ అందరూ కట్టుకోవడం మొదలుపెట్టారు. ఊరి బయటి వంటలకు సన్నాహాలూ పయనాలూ సాగాయి. మా నాన్నగారు మాత్రం ఇందుకు వ్యతిరేకులు. ఊరి బయటికి అందరూ వెళ్ళిన తర్వాత దొంగలు ఊరుదోచుకోగలరని వారి అభిప్రాయం! మునసబు, కరణాలు మాత్రం దైవభీతితోనే అన్ని జాగ్రత్తలూ తీసుకుంటామని మాట ఇచ్చారు. ఎవరైనా కొందరు అలా ఊరు విడిచి వెళ్ళమంటే – తర్వాత అనుకోకుండా గ్రామానికి ఏదైనా కీడే దాపురించిందనుకొందాం – అది వాళ్ళ మీద పడుతుంది! కాబట్టి అందరూ ఒక్కమాటగా ఊరు విడిచి వెళ్ళాలనే తీర్మానించుకున్నారు. మేము మాత్రం ఇంట్లోనే పులిహోర చేసి మూటకట్టుకుని తీసుకెళ్ళి, ఊరవతల దేవతకు నివేదించి, భుజించి, ఇంత మజ్జిగ తాగి, కొంత విశ్రాంతి తీసుకుని ఇంటికి తిరిగి వద్దామనుకొన్నాము. అందుకోసం నన్ను కరివేపాకు తెచ్చి పెట్టమన్నారు. ఊళ్ళో అందరూ ఆహార సామగ్రి కూర్చుకొని ఊరవతలికి వెళ్ళే సన్నాహంలో ఉన్నారు. దొడ్డిలో కరివేప చెట్టుగల బ్రాహ్మణుల ఇంటికి వెళ్ళి కాస్త కరివేపాకు ఇమ్మని అడిగాను. వారూ ప్రయాణ సన్నాహంలో ఉన్నారు. 'మేమూ బయలు దేరుతున్నాం. ఇప్పుడు కరివేపాకు ఇవ్వడానికి

వీల్లేదు పో' అన్నారు. 'నేనే దొడ్లోకి వెళ్ళి కోసుకు వెడతా' నన్నాను. "తలుపులన్నీ తాళాలు వేసేశాం. వల్లగాదు". 'పో' మ్మని చెప్పి ఇంటి వాళ్ళు వెళ్ళిపోయారు. నేను దొడ్డి వీధివైపు కెళ్ళి చెట్టుకేసి చూస్తూ ఉండిపోయాను. అటు వెళ్తున్న వారిలో కొందరు ఏమిటన్నట్టు నన్నడిగితే 'కరివేపాకు కావాలి' అన్నాను. 'ఎందుకూ?' అని వాళ్ళడిగితే 'ఈ దేవతకు ద్వారంలో కరివేపమండ కట్టాలట! అందుకోసం కావాలి' అన్నాను. అంతే. నాకొక మండ కోసి యిచ్చారు. తర్వాత ఒకరొక్కరే ఒక్కొక్క మండ చొప్పున విరుచుకుపోయి ద్వారతోరణాల కెక్కించేశారు. చెట్టున ఒక్క ఆకైనా మిగల్లేదు. మర్నాడు ఇంటివారు వచ్చి ఆదుండగం నేను చేసిందే అని గుర్తించి, నన్ను దండించినంతగా నిందించారు. నేను అబద్ధమాడినందుకు తగిన ఫలితం అనుభవించాను.

దైవం పేర సంఘంలో అలజడి పుట్టించడం తేలికే ననీ, దిద్దడం మాత్రం చాలా కష్టమనీ, మొత్తం మీద సంఘమంతా విద్యా విజ్ఞానవంతమై వర్ధిల్లితేనే తప్ప ఇలాంటి చెడుగులు తొలగించడం సాధ్యం కాదనీ విన్నవించడానికే యీ విషయాన్నిక్కడ ప్రస్తావించాను.

మతం, వైద్యం, జోతిషం, ధర్మం, ఆచారం మొదలైన సంప్రదాయ సంకేతాలతో కూడుకొన్న చెడుగులెన్నెన్నో దిద్దడానికి వీలుకాని విధంగా సంఘంలో పాతుకుపోయి వున్నవి. ఇంకా వ్యాపిస్తున్నవి కూడాను. మూఢ విశ్వాసాలతో వాటినింకా అలాగే పాటించే స్థితిలో లోకమున్నంత వరకూ, వాటిని ప్రచారం చేసేవాళ్ళు తాము నమ్మినా నమ్మక పోయినా సరే, ఏదో లాభాన్ని ఆపేక్షించి సమాజంలో తమ పలుకుబడిని సాగించుకొంటున్నారు. కొంతమంది తెలిసీ తెలియని మిడి మిడి జ్ఞానంతో వాటినలాగే పాటిస్తూనూ వున్నారు.

ఇటీవలనే జరిగిన విషయమొకటి విన్నవిస్తాను.

నా మిత్రునికొకనికి ముక్కులో పెద్ద కురుపు లేచింది. అతగాడికి ఆయుర్వేద వైద్యంలో కొంత నమ్మకమున్నది. ఆంగ్ల వైద్యుడైన మరో మిత్రుడు దానిని ఆపరేషన్ చేసి తేలిగ్గా తొలగిస్తానని చెప్పాడు కూడా. అయినా రోగి పిరికివాడు కావడం చేత కూరగాయ దేశీయ వైద్య మెరిగిన ఇంకో మిత్రుణ్ణి సంప్రదించాడు. అతడేమో తానెరిగిన వైద్యంలో నఖము – అంటే చేతి వ్రేలి గోటిని – నువ్వుల నూనెతో బాగా కాచి గోర్వెచ్చగా ముక్కులో గనుక రెండు బొట్లు వేస్తే వ్యాధి ఠక్కున కుదురుతుంది అన్నాడు. అతణ్ణి తలదన్నిన మిత్రుడింకొకడు ఇతరుల గోటికన్న రోగి చేతి గోటినే కత్తిరించి ఆ వైద్యం చేస్తే మరీ మంచిది అన్నాడు. ఇదంతా వింటున్న నాకు వెర్రులు వేకులు ఎత్తసాగాయి. వారితో నేనిట్లా అన్నాను. "అశాస్త్రీయంగా విషయ పరిజ్ఞానం చాలని ఇటువంటి వింత వైద్యాలు చెప్పకండి" అని. "నేనెందరికో ఈ వైద్యంతోనే ముక్కులో కురుపుల్ని చాలా నయం చేశాను ఇది తెలియని వైద్యం ఎలా అవుతుంది?" అని మొదటి మనిషి అన్నాడు. రెండో వ్యక్తి అందుకొని "ఇది ఆశాస్త్రీయమెలా అవుతుంది? కొన్ని కొన్ని వ్యాధులకు తన శరీరంలోని రక్తాన్నే ఒక చోటి నుండి తీసి ఇంకో చోట ఇంజెక్షను చేసి వ్యాధులు కుదర్చడం తెల్లదొరలే వొప్పుకొన్నారు కదా! ఇది మన పూర్వులు ఇంతకు ముందే కనిపెట్టి సాగించిన వైద్య విధానం! నాకు కురుపు లేస్తే ఒకసారి నేనే నా చేతి గోరే తీసి కాచిన నూనెతో వైద్యం చేసుకొని కురుపు మానేట్లు చేసుకొన్నానే" అని నన్ను మరి మాట్లాడకుండా చేశాడు. నాలో మితి మీరిన అశాంతి పెరిగింది. ఇదంతా బూటకమనీ, ఇట్లాగే గనుక చేస్తే రోగికి అపాయం లేకపోయినా గుణం మాత్రం కలుగకపోవచ్చునన్నదే నా ఆరాటం. మదరాసులో నాకు తెలిసిన

వారినడిగాను. అక్కడి ఓరియంటల్ లైబ్రరీకి వెళ్లి 'నఖము' అనే పేరున్న దాని గుణాల కోసం వెదికాను. అక్కడే ఆయుర్వేద వైద్యశాలలో పనిచేస్తున్న మిత్రుడికీ విషయం తెలిపాను. 'నఖ' మంటే చేతి గోరు కాదనీ, అదొక సుగంధ ద్రవ్యమనీ, నత్తగుల్లల వంటి జల జంతువుల గుల్లల మూతచిప్ప (పెంకు )అనీ ఆ మిత్రుని మూలంగా తెలుసుకొన్నాను. గ్రంథాలను కూడా తిన్నగా పరిశీలించి నఖ తత్వాన్ని గుర్తించాను. వెంటనే ఆ విషయాలన్నీ రోగికి చెప్పి సరైన మంచి వైద్యం చేయించుకొమ్మని కోరాను. ఆ తర్వాత ఆపరేషను జరిగింది. అతని ఆరోగ్యమూ కుదుట పడింది.

అంతరంగంలో స్పష్టమైన పరిజ్ఞానపు తీరు లేని వారు చేసే సాహసపు పనులు ఇట్లాగే వుంటాయి! రోగ కారణం ఏమిటో తిన్నగా తెలియని వ్యాధిగ్రస్తుని శరీరంలో తెలిసీ తెలియని ఔషధాలను, అంతంత మాత్రమే తెలిసిన చికిత్సా విధానంతో ప్రయోగాలు చేయడం, ఏదో జరుగుతూ వుండడంగా ప్రస్తుతపు వైద్య విధానమున్నది. అంతరంగాన్ని చీల్చుకొంటూ, అంతరాత్మ వైపుగా సాగుతూ, సత్యజ్ఞానానందాల అనుభూతిని పొందడం అలవరచుకొన్నవారి ప్రజ్ఞలే ప్రపంచానికి మేలు చేకూర్చగలవు.

ఇంచుమించుగా నా పదేళ్ళ ప్రాయమప్పుడు నా ఆఖరి చెల్లెలికి చాలా జబ్బు చేసింది. ఇక జీవం నిలవదేమో అని సందేహించే స్థితి కలిగింది. తరువాత ఎట్లా వుంటుందో ఏమో అని పిల్లలకు చద్దన్నాలు తినిపించారు. మాతో నోరు విప్పి చెప్పకపోయినా ఇంట్లోని అలజడిని గుర్తించి, నేను బెంగతో ఎవ్వరికీ కనపడకుండా గుళ్ళోకి వెళ్ళి ఓ మూల నక్కి రక్షించ మంటూ చిన్న బిడ్డను గూర్చి భగవంతుని పరిపరి విధాల ప్రార్థిస్తూ, ధ్యానిస్తూ కూర్చుండిపోయాను. ఇంటికి మధ్యాహ్నపు తిండికి రాలేదు. ఇంట్లో అలజడి కొంత తగ్గింది. రెండు మూడు విరేచనములయి బిడ్డ తేటగా వున్నది.

అపాయం తొలగిపోయింది. అందరూ భోజనాలు ముగించి, నేను కనపడకపోవడం గుర్తించి కంగారు పడుతూ నా కోసం వెతికారు. మిత్రుల ఇళ్ళల్లో ఎక్కడా నేను కానరాలేదు. పొద్దుక్రుంకే వేళ కావచ్చింది. మా నాన్నగారికి భయం పట్టుకొంది. వెతగ్గా వెతగ్గా చివరికి గుడిలో ఒక మూల నక్కి కూచున్న నన్ను చూసి, బిడ్డ క్షేమ వార్త తెలిపి నా మనస్స్థితికి దుఃఖించి నన్నింటికి తీసుకు వచ్చారు. పసితనం నాటి నుంచే వ్యాధికి, మృతికి నేను తలక్రిందులైపోయేవాడిని. ఏమీ తోచక, చేయగల్గింది లేక ఇంట్లోనూ నిలువలేక, ఎవ్వరూ గుర్తించలేరు కదా అని గుళ్ళో ఓ మూల కూర్చుని నేను అనుతాపంతో దైవ ప్రార్థన చేశానే కానీ దానికి ఫలితముంటుందని ఆనాడు నాకు తెలియదు.

మా నాన్నగారు వైద్యవృత్తిలో రోగుల దగ్గర కటువుగా వుంటూనే సొమ్ము పుచ్చుకునేవారు. ఒక సందర్భంలో రోగి దైన్యానికి చలించిపోయి నేను మా నాన్నగారిని 'సొమ్ము కోసం నిర్బంధించకుండా మందివ్వండ'ని కోరాను. 'ముందు వ్యాధి కుదర్చండి. వాడి దగ్గర ఇప్పుడు డబ్బు లేదు. నెమ్మదిగా తరువాత సొమ్మివ్వగలడు. ఇయ్యకపోతే పోనియ్యండి' అన్నాను. రెండు నిమిషాలు మౌనంగా వుండి "నాయనా! ఈ కాఠిన్యం నేను వహించేది మీ మీది ప్రేమ చేతనేరా! నాలో ఈ కాఠిన్యం లేకుంటే సొమ్ము రాదు. అది ఆర్జిస్తే (సంపాదించితే) కానీ మీ పోషణ సాగదు. మీ మీది ప్రేమే నన్ను ఇతరుల మీద ఇంత కఠినుణ్ణిగా చేస్తున్నది". అన్నారు. నేను కళ్ళల్లో నీరు కుక్కుకొని ఊరకుండిపోయాను. ఆ సంభాషణము నాలోనే మరిచి పోలేనంతగా ఉండిపోయి నన్ను వేధించసాగింది. దాని నిర్వాహము ముందు ముందు తెలియగలదు.

---

౧. ప్రేమను, అహింసను ఆరాధించే శ్రీ శాస్త్రిగారు బుద్ధదేవుని అంశగా నాడీగ్రంథములలో ఉంది. ఇది వారి అనుభూతికందిన విషయంగా తెలుస్తోంది.

# 4. పౌరోహిత్యం - సదనుష్ఠానం

పురోహిత వృత్తి మీద నాకు చాలా రోత కలిగింది. అందుకు కారణం అది శాస్త్రం ఒప్పుకోనిదని కాదు. ప్రాచీన ధర్మశాస్త్ర ప్రకారం చూస్తే ఇవాళ బ్రాహ్మలు అవలంబిస్తున్న చాలా వృత్తులు శాస్త్రాలొప్పుకోనివే. డబ్బు తీసుకొని బడిలో చదువులు చెప్పడం, సొమ్ము తీసుకొని వైద్యం చెయ్యడం, ప్రతిఫలం పుచ్చుకొని గాయకులు కావడం, వడ్డీవ్యాపారం చేయడం, ఇలాంటివే ఇంకా ఎన్నో నీచములైన వృత్తులు ధన సంపాదన కోసం బ్రాహ్మలిప్పుడు చేస్తున్నారు. అయినా అవేవీ ఇప్పుడు తప్పులుగా కానరాకున్నవి. మరి ఇక బ్రాహ్మణులే చేయవలసిన పూజారితనమూ, పౌరోహిత్యమూ వంటివి తప్పెందుకవుతాయి? సంఘానికి అవసరమైన ఏ కులవృత్తిగానీ తప్పుగానో, తక్కువగానో చూడవలసినవి కావు. కాకూడదు. అయినా పూర్వులందరూ అవలంబించినదే అయినా పురోహితత నాకు సమ్మతం కాలేదు. అది నేడు వట్టి బూటకంగా సాగుతున్నది. నూటికి తొంభై మంది పురోహితులను కోరే వారు వారి మీద ఆదరముగానీ, గౌరవం కానీ లేనివారే కనిపిస్తున్నారు. వాళ్ళు ఏదో అలవాటుగా వస్తున్న దాన్ని పాటిస్తున్నామన్న తృప్తి కోసం కర్మలాచరిస్తున్నారే కానీ పరమార్ధ బుద్ధితో కాదు.

ఆ ఆచరిస్తున్న కర్మలు కూడా వాటి ప్రయోజనాన్నీ, స్వరూపాన్నీ సన్నసన్నగా పోగొట్టుకొంటూ అర్థరహితాలైన బాహ్యాడంబరాలు గానే మిగిలిపోతున్నవి. నిజంగా వాటి పట్ల శ్రద్ధ గలవారే అయితే స్వయంగా వాటిని అభ్యసించి నిర్వర్తించుకోగలవారే కాగలరు. అలాంటి వారు స్వయంగా పరమార్ధ బుద్ధితో ఆచరించే వారినే పురోహితులనుగా ఎన్నిక చేసుకోగలరు. పురోహితత వంశాచారంగా వస్తుండడం చేత అందులో

ఎన్నో లోట్లు వచ్చి చేరాయి. బ్రాహ్మణులలో వేయింటికొక్కరైనా సరిగా అగ్నిహోత్రాన్ని వుంచుకొనేవారు నేడు లేరు. శ్రౌత సంప్రదాయమే అడుగంటి పోతున్నది. ఉపనయనములప్పుడూ, వివాహాలప్పుడూ మాత్రమే చేస్తున్న అగ్నికార్యము, దానిని సరిగా చేయనందుకోసం ప్రాయశ్చిత్తాలూ, హోమాలూ పురోహితుల వింత పాటలూ, ఆటలుగా మారిపోయినవి. కాళిదాసు నాటకాలలో విదూషకుడు ఎలాంటి పూజ్యతను పొందుతున్నాడో వివాహోపనయనాది కర్మలు నిర్వర్తిస్తున్న పురోహితుడూ అలాంటి పూజ్యతనే పొందుతున్నాడు. "అశ్రద్ధ పితాళ్ళకు ఆకతాయి తర్పణం" అన్నట్టుగా అశ్రద్ధకు గురైన గృహస్థుకి తగ్గట్లే అవాకుల పురోహితులూ ఏర్పడ్డారు. కాబట్టి ఈ అవహేళన వృత్తిని గ్రహించరాదనీ, సంభావనలకో, భిక్షములకో, ఇంతవాణ్ణి అంతవాణ్ణి అని చెప్పుకొంటూ యాచనలకు పోరాదనీ నేను నిర్ణయించుకొన్నాను.

నాకు ఉపనయనము అయింది. సంధ్యా వందనాదికమున్ను, నేను నిర్దుష్టంగా నేర్చుకొన్నాను. సంధ్యా భాష్యం చదివి అర్థం తెలుసుకొన్నాను. ఇంటి దగ్గరే ఉంటే ఇక వైదిక వృత్తికే చొరబడవలసి వచ్చేదేమో కానీ ఈశ్వరుడనుగ్రహించాడు. చల్లపల్లి విద్వాంసులు, మహర్షికల్పులు శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రి గారు అప్పుడప్పుడు మా గ్రామానికి విచ్చేస్తూ వుండేవారు. ఎడ్వర్డు పట్టాభిషేకం జరిగినప్పుడు నేనేవో సంస్కృత శ్లోకాలు రాసాను.్ర వారు విచ్చేసినపుడు నా రచన విని నన్ను ప్రేమించారు. వారు విజయనగరంలో భీమాచార్యులు గారనే తర్క విద్వాంసుల దగ్గర సంగమేశ్వర శాస్త్రి ్రు గారితో కలిసి చాలాకాలం తర్కశాస్త్రం అభ్యసించిన వారు. వారు మొదట మా వూళ్లోనే వుండేవారు. అప్పట్లో వారికేదో తీవ్రమైన అనారోగ్యం కలిగితే మా నాన్నగారు వారికి మందిచ్చి వ్యాధి కుదిర్చారట!

తరువాత వారు చల్లపల్లి చేరుకొన్నారు. ఆ అనుబంధం వల్ల వారు అప్పుడప్పుడు మా యింటికి వచ్చిపోతూ వుండేవారు. వారి దగ్గర చదువుకోడానికి నేను చల్లపల్లి చేరాను. లఘు కౌముది చదువుకోవడం మొదలు పెట్టాను. కాని వారు నాకు పాతంజల యోగ సూత్రాలను కూడా చెప్పారు. అందులో చదివిన విషయాలు నాలో చొచ్చుకుపోయి వింత వింత యోచనలు కలిగేవి. వారు తెల్లవారుజామునే నిద్రలేచి రాత్రి పన్నెండు గంటల దాకా అనుష్ఠానంతో తపోమయులై విరాజిల్లుతుండేవారు. విద్యార్థులమైన మమ్మల్ని కూడా అట్లా చక్కదిద్దాలని చూసేవారు. ఎందుకోగానీ కర్మానుష్ఠానాల మీద నాకు శ్రద్ధ లేకపోయింది. బందరులో శ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రులు గారు హిందూ హైస్కూలులో పండితులుగా అప్పుడుండేవారు.

ఇంటి వాకిట కూర్చొని నేను పాఠము చదువు కొంటున్నాను. లోపల ఇల్లు ఊడుస్తూ వుండిరి. ఆ దుమ్ము వాకిటికి వచ్చి నా మీద పడుతున్నది. "సమ్మార్జనీ రజశ్చైవ శక్రస్యాపి శ్రియంహరేత్" (ఊడ్పు దుమ్ము మీద పడితే ఇంద్ర వైభవమైనా హరించుకుపోతుంది) అనే మాట వుంది కదా! ఇక్కడే కూర్చుంటివేమి? అన్నారు. "చూడలేదు" అన్నాను నేను. "అది కాదు. శాస్త్ర విశ్వాసం లేదు" అన్నారు. ఊరకుండిపోయాను. వారు అవతలికి వెళ్లిన తర్వాత "దుమ్ము మీద పడటం రోతే, నేను పుస్తకం మీది దృష్టితో వుండి గుర్తించలేకపోయాను. గురువులవారన్నట్టు నిజంగా ఇట్టి శాస్త్రం మీద నాకు విశ్వాసం లేనట్టే వున్నది." అని యేదో పక్కనున్న మిత్రుడితో అంటున్నాను. అది విని శాస్త్రుల వారు నన్ను చీవాట్లు పెట్టారు.

---

౧. ఇవి లభ్యం కాలేదు. లండనులో లభించునేమో అన్వేషించాలి.

౨. వీరిని గురించి వివరాలింకా గుర్తించాలి.

# 5. అనుభూతి - దాని వికాసం

ఒక సందర్భంలో నా పసితనంలో – అయిదు ఎనిమిది సంవత్సరాల మధ్య – ఆంజనేయుల దేవాలయంలో బ్రాహ్మణ సంతర్పణ జరుగుతుండినది. అక్కడ నేనూ ఉన్నాను. బీటలు వాసి శిథిలంగా వున్న గుడి తలుపు సందులో నుంచి యెవరో తొంగి చూశారు. భోజనాలకు కూర్చోబోతున్నవారు అది గుర్తించి గద్దించారు. బయటి మనిషి పక్కకు తప్పుకొన్నాడు. మేమందరం భోజనాలు ముగించి బయటికి వచ్చాం. అక్కడ ఆకలిగొన్న సాధువు ఒకడు బిక్కు బిక్కుమంటూ కూర్చొని వున్నాడు. 'నువ్వేగా ఇందాకా తొంగి చూసింది?' అంటూ కడుపులు నింపుకొన్న మా వారిలో ఒకరు అడిగారు. 'అవునండీ! లోపల సందడిగా వుంటే గుడి కదా! ఆ కలకలమేమిటో చూద్దామని చూశాను. మీరు భోజనాలు చేస్తున్నారు. మీరు గద్దిస్తే భోజనాలయాక ఆకలిగొన్న నాకూ ఇంత అన్నం పెడతారేమో అని కాచుక్చూచున్నానండి" అన్నాడతను. 'బ్రాహ్మణ సంతర్పణ చెడగొట్టావురా దుర్మార్గుడా!' అని మా వాళ్లు చెడ తిట్టారు.

'అయ్యా! మీరింత అన్నం పెడితే నా కడుపు నిండుతుంది కానీ, మీ భోజనాలు చూసినంత మాత్రం చేత నాకేం ఒలుకుతుందండీ! లోపల భోజనాలు చేస్తున్నారని తెలియక చూశాను' అన్నాడు.

'ఇంకా భోజనాలు చేయవలసిన బ్రాహ్మలున్నారు. అంతా ముగిసిన తర్వత గానీ నీకు పెట్టడానికి వీలు కాదు పో! అవతలికి పో' అంటూ మాలో మొనగాడైన బ్రాహ్మడొకడు. పొట్ట తడువుకొంటూ అన్నాడు. అది మిట్ట మధ్యాహ్నం పన్నెండు గంటల వేళ! ఆ సాధువు కన్నీళ్లు కారుస్తూ ఆకాశం కేసి చూస్తూ సూర్య భగవానుడికి చేతులు జోడించి 'తండ్రీ! నేను ఏ పాపము ఎరుగను. నన్ను వీళ్లు తిడుతున్నారు. నువ్వే సర్వసాక్షివి.

కనికరించు దేవుడా!" అని చేతి కుండిక(కుండ)లోని నీళ్ళతో బిక్క మొగం కడుక్కుని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఆ సాధువు అలా సూర్యునికి మొక్కుతూ మండుటెండలో మాడుతూ ఆడిన పలుకులు వాడిగా నాలో నాటుకొన్నాయి. ఒళ్లు జలదరించింది. ఇంటికి వచ్చేసరికి తీవ్రజ్వరం వచ్చింది. మూడు రోజుల పాటు చాలా బాధ పడ్డాను. ఆ బ్రాహ్మడి దుడుకుతనము, ఆ సాధువు పలికిన జాలి మాటలూ నాలో ఆ మూన్నాళ్లూ కలవరం కలిగించాయి. మా తల్లిదండ్రులకు ఈ గొడవ నేను చెప్పలేదు. క్రమ క్రమంగా జ్వరం తగ్గింది. ఆ మూన్నాళ్ల శరీరకంపం నాలో ఎంతో లోతున ఏదో తెలియని వేదనగా పాతుకుపోయింది. ఈ సంఘటన మాత్రం నా స్మృతి పథంలో పదే పదే తారాడుతూ [10] వుండేది. కాని అది నాలో పాతుకొని పోయి లో నుంచి చిమ్మిన వివేక జ్వాలల్ని మాత్రం నేను ఇటీవలనే – ఈ విషయం రాస్తున్నప్పుడే – విస్పష్టంగా నిశ్చయంగా తెలుసుకొన్నాను.[౧]

ఇప్పటికి పన్నెండేళ్ళకు ముందు[౨] మా తల్లిగారు పరమపదించగా ఉత్తరక్రియలన్నీ మా అన్నగారే చేశారు. నేను తద్దినము పెట్టేవారి తమ్ముడనుగా పక్కనున్నాను. "జ్యేష్ఠే నైవతు కర్తవ్యం" (పెద్దవాడే కర్మకలాపం చేయాలి) అని శాస్త్ర నిర్ణయముంది కనుక నేను దాన్ని పాటించాను. వచ్చి చేరిన వైదిక బృందం మాత్రం నేను కర్మకలాపాలు చేయకుండా వూరక కూచున్నానని నన్ను తప్పు పట్టారు. శాస్త్ర నిర్ణయాన్ని మా యింటి ప్రక్కనే వున్న సాంబశివశాస్త్రి [3] గారనే విద్వాంసులు వివరించి అక్కడ చేరిన వైదిక గోష్ఠివారిని మారు మాట్లాడకుండా చేశారు. అప్పుడు కర్మకలాపాలన్నీ ముగిసిన తర్వాత ఆకలిగొన్న (అన్నాతురులైన) ప్రజలందరికీ వర్ణ విభేదం లేకుండా ఆ రోజంతా ఏడెనిమిది వందలమందికి సంతర్పణం చేశాము. ఆ సంకల్పం నాదేకానీ దాన్ని జరిపించినదంతా మా తమ్ముళ్లే. వీధి వీధంతా శుభ్రం చేసి, విస్తళ్లు వేసి, భోజనాలు పెట్టాము. ఊళ్లో కొంతమంది వీధంతా

చండాల భోజనంతో అంటుపడిపోయిందని దూషించారు. చుట్టు పట్టుల ఊళ్లల్లోనూ అలజడి చెలరేగింది. మా నిర్ణయం మాత్రం ఏ అడ్డూ లేకుండా సాఫీగా నెరవేరింది. ఇలాంటి సంకల్పం నాలో కలగడం చిన్నతనంలోనే నాలో పాతుకొన్న పైకి తెలియని అవ్యక్త భావ కారణంలోంచి పుట్టిన కార్య వికాసమే అని ఇటీవలే నేను గుర్తించాను.

ఇంకా ముక్త్యాలలో జరిగిన మా పెద్దబ్బాయి పెళ్లిల్లో కూడా అక్కడి అన్ని జాతుల వారికీ, పాకీ వారికి కూడా ఒక్కొక్క రోజూ ఒక్కొక్క జాతి వారికని ప్రత్యేకించి కడుపు నిండా భోజన సంతర్పణం కావించాము. ఆ సందర్భంలో కూడా మా తమ్ముళ్లే పూనుకొని అన్నీ నిర్వహించారు. ఆ వివాహ సందర్భంలో మాకు ఆప్తమిత్రులు, శ్రీ ముక్త్యాల ప్రభువులు అది తమ యింటి పెండ్లిగానే భావించి, ఎన్ని వేలయిందో పెళ్ళి ఖర్చు మొత్తం తామే భరించారు. ఇట్లా జరగడానికి కూడా బాల్యంలో నాలో కుదుర్కొన్న అప్పటి అవ్యక్త భావమే మూలకారణం.

భూమిలో పడేసిన విత్తనం కొంత దాకా ఏమైందో తెలియ రాకుండానే వుండి తగిన కాలంలో అంకుర రూపంగా బయలు పడి వికాసం చెందినట్లుగా మానవ హృదయాలలో చొచ్చుకుపోయిన అనుభూతులు కూడా తగిన సమయం రాగానే అందుకుదగ్గ పరిపాకంతో వెలువడి వికాసం చెందుతూ వుంటాయి. కానీ అవి బీజరూపంగా ఏ నాడో లోలోనికి చొచ్చుకుపోయిన వెనుకటి అనుభూతుల వల్ల ఏర్పడినవే అని గుర్తించడం మాత్రం అంతటా జరగదు. లోతైన సంస్కారాలు కొన్ని ఎంతో కాలం గడిచిన తర్వాత అనుకూల సందర్భం సమకూడినప్పుడు గానీ కార్యరూప పరిణామాన్ని పొందలేవు. అట్లా చెందిన కార్య పరిణామం నాటికి ఆ కారణ జ్ఞాపకం కూడా మరపున పడిపోవడం జరగవచ్చు. ఈ బీజరూప సంస్కారాలు లోపలికి చొచ్చుకుపోవడం తర్వాత అవి

బహిర్వికాసం చెందడం అన్నది ఒక్క జన్మంలోనే జరిగేదీ కాకపోవచ్చు. ఒక్కొక్కసారి పూర్వక్షణపు బీజ రూప సంస్కారం ఉత్తర క్షణంలోనే (వెనువెంటనే) బహిర్వికాసం చెందేవి గానూ కొన్ని సందర్భాలుండవచ్చు. కొన్ని సందర్భాలలో అది ఏడు జన్మముల దాక కూడా తేలనిదీ కావచ్చు. భగవత్ప్రాప్తి కోసం నాటుకొన్న సంకల్ప బీజాలు భగవత్తత్త్వాన్ని గూర్చిన స్పష్ట పరిజ్ఞానం కుదురుకొనే దాకా కూడా విరివి చెందుతూ పెరిగి పెరిగి బహిర్వికాసానికి వస్తూ పరిపూర్ణతను పొందడానికి కూడా అట్లాగే ఏడు జన్మల దాకానూ సాగవచ్చు.

పరిపూర్ణత చెందటం అంటే మానవసామాన్యం కంటే ఎంతో ఉన్నతోన్నతంగానూ ఎంతో లోతులోతుగానూ గోచరించిన తత్త్వాన్ని మానవుడు తన ప్రేమ ప్రసరించిన చోట్ల నెల్లా వ్యాపించేట్లు చేయ గల్గడమన్నమాట. ఉన్నతోన్నతమూ, లోతులోతూ అయిన భావం అదాటుగా (ఉన్నట్టుండి), అకారణంగా (నిర్నిమిత్తంగా), అసాధనంగా (సాధన లేకుండా) గోచరించదు. తన హృదయం ఎంతెంత ప్రేమమయమవుతుందో ఆ ప్రేమ మానవత మీద ఎంతెంత అధికాధికంగా ప్రసరిస్తుందో మానవుడూ అంతంత ఉన్నతంగా అంతంత లోతుగానూ పారమ్యానికి దగ్గర దగ్గరగా పోగల్గుతాడు. కూకటి వేరు నేలలోతుల్లోకి చొచ్చుకొని పోగల్గుతుంది కదా!

---

౧. ఈ సంఘటన గురించి శ్రీ శాస్త్రిగారు తమ చిన్ననాటి జ్ఞాపకాలు అనే వ్యాసంలో వివరించారు. (చూ.మణిమంజరి సంచికలు)

౨. ప్రజ్ఞాప్రభాకర రచనకు పన్నెండేండ్లకు ముందనగా శ్రీ శాస్త్రిగారి మాతృశ్రీ శేషమ్మ గారి నిర్యాణము 1934–1935 అగును.

౩. పెద్దకళ్ళేపల్లిలో వేటూరి వారి కుటుంబమునకు శ్రీ తెంజెర్ల సాంబ శివశాస్త్రిగారు సన్నిహితులు.

౪. శ్రీ సుందరమూర్తి గారి వివాహము 1943లో (18–8–1943).

# 6. కాకి పగ

పది పదమూడేళ్ళ ప్రాయంలో అనుకొంటాను, నేను చల్లపల్లిలో చదువుకోడానికి వెళ్లాను. నాకు చింతచిగురు పప్పుకూర అంటే చాలా ప్రియం. మా యింటి దొడ్డిలో వున్న చింత చెట్టు గుబురుగా చిగిర్చి అగ్ని జ్వాలలు రేగుతున్నట్లుగా మిల మిల చిగుళ్లతో మెఱుస్తూ వుండెను. "ఆ చిగురు కోసి తెస్తాను. కూర వండిపెట్టు" అని మా అమ్మగారిని కోరాను. గోడ మీదకెక్కి చిగురుకోస్తూ చేతికందని కొమ్మను ఒక కొంకి కఱ్ఱతో వంచి లాగే యత్నం చేస్తున్నాను. ఆ కొమ్మ పక్కగా ఒక కాకిగూడు ఉన్నది కాబోలును! నాకు తెలియలేదు. ఇంతలో ఒక కాకి అరుస్తూ ఇనపమేకుతో కొట్టినట్టుగా నా నెత్తి మీద ముక్కుతో కొట్టింది. ఇంకా కొడుతూనే కావు కావని అరుస్తూ మరెన్నో కాకుల్ని రప్పించుకొంది. ఒకటే గగ్గోలు! కంగారు పడి గోడ దిగి యింట్లోకి వచ్చేశాను. మర్నాడే నేను చల్లపల్లికి వెళ్లిపోయాను.

అది మొదలుగా నేనెప్పుడు ఇంటికి వచ్చినా ఈ కాకి పగ నాకు ప్రత్యక్షమవుతూ వుండేది. మరిచిపోయి దొడ్డిలోకి వెళ్ళానంటే చాలు ఆ కాకి నా తల మీద ఠక్కుమని కొట్టిందన్న మాటే! భోజనం చేసి చెయ్యి కడుక్కోవడానికి పోతే నా నెత్తి మీద ఆ కాకి రెట్ట వెయ్యడమో, ముక్కుతో పొడవడమో చేసిందన్నమాటే! కొన్ని సమయాల్లో తలమీది ఆ రోతకు మళ్లీ స్నానం చేయవలసి వస్తూ వుండేది. ఈ కాకి పగ నన్నలా పది పన్నెండేళ్లు బాధిస్తూనే వుండింది. తెలిసి నేనేమీ ఆ కాకికి అపకారం చేయలేదు. దాని గూటికి కూడా ఎలాంటి కీడూ జరుగలేదు. కాని దాని పగ మాత్రం నాపై ప్రబలంగా కొన్నేళ్ల దాకా వదల లేదు. మదరాసుకి వచ్చి చేరిన తర్వాత నెలనెలా నేనింటికి పోవడమూ తగ్గింది. ఆ చింత చెట్టూ ఎండిపోయింది. సంవత్సరానికో లేదా సంవత్సరాలకో తర్వాత

నేనింటికి వెళ్లినా కూడా ఆ కాకి బాధ మరి నాకు కలగకుండా తప్పి పోయింది. ఆ కాకి కూడా మరోచోటి కెక్కడికైనా వెళ్ళిందో! ఏమైందో మరి! ఈ కథ నిక్కడ ఎందుకు రాశానంటే ఇది నాకు చాలా వివేకాన్ని కలిగించి ఎన్ని సందర్భాలలోనో నా భావవీధిలో విహరిస్తూ వుండిన యథార్థ గాథ అది!

ఇటీవల బసవపురాణాది గ్రంథాల ముద్రణ సందర్భంలో నాపై తీవ్రంగా కోపం ప్రకటించి, ఇప్పటికీ ప్రకటిస్తున్న వారి విషయమై నేను ప్రవర్తిల్ల వలసిన తీరును ఈ కాకి పగ నాకు పాఠము నేర్పింది. ఎంత తీవ్రంగా విరోధించిన వారి పైనైనా ప్రతివిరోధం పాటించకుండా, అంతరంగంలో ఆత్మీయతనే పాటిస్తూ, అనురాగాన్నే సాగిస్తూ తెలియజెప్పదగిన దానిని (కొందరే అట్లా చెప్పదగిన వారుగా వుంటారు) ఎదుట పడ్డప్పుడు సమ్ముఖంలోనే గట్టిగా తెలియ జెప్పుతూ వుంటే ఆ ద్వేషించే వారి ద్వేషోద్వేగము వారికి తెలియకుండానే అంతరంగంలోకి చొచ్చి నెలకొంటున్న ఆ అనురాగం చేత రేపబడి మరింతగా రేగినా ప్రతిఘటనం లేకపోవడం చేత కాలక్రమాన నీరసించి ఆరిపోగలదు. ఇందుకు నాకు అనేక అనుభవాలు ఇటీవలవి ఉన్నాయి. ఇట్లా ప్రవర్తిల్ల గల్గడానికి నాలో గురుదేవుల అనుగ్రహమూ, శ్రీ గాంధీ గారి దివ్యచరిత్రమూ 'అంతర్బహిశ్చ' (లోపలా బయటా) జాగ్రత్తను బోధిస్తూన్నవి.

# 7. శాస్త్రము - అనుభూతి

శ్రీ సోమనాథశాస్త్రులు గారి తపస్వితపై నాకు మహాభక్తి ! కాని వారిని అనువర్తించి నడుచుకోవాలని గానీ, అట్లా అనువర్తిస్తే ఫలితం కలుగునని గానీ నాకు తోచలేదు. యోగసూత్రాలను పాఠం చెప్పేటప్పుడు వారు తమ యోగ సిద్ధికై కొంత పాటు పడ్డామనీ, దాని మూలంగా ఆరోగ్యం కొంత చెడిందనీ, ఆ విధానాన్ని తాము అనుభూతికి తెచ్చుకోలేకపోతిమనీ వారు అన్నారు. వారికే అది సాధ్యం కానప్పుడు దాన్ని మా చేత చదివించడం దేనికీ అని నాకు అనిపించింది. కాని అడిగితే కోపగిస్తారేమో అని వారికా విషయాన్ని నేను చెప్పలేదు. ఇంకో రోజున నా ప్రశ్నను వారే వేసుకొని ఇలా మాట్లాడారు. "మీలో ఎవరైనా సాధించగలరేమో ప్రయత్నించి చూడండి. సరియైన గురువు లభించునేమో చూడండి. నాకు అనుభూతి కలుగనంత మాత్రాన శాస్త్రం ప్రామాణికం కాదని మీరు తలచరాదు. మీకు మీరుగా మాత్రం సాహసం చేయబోకండి." అన్నారు. ఆనాటి వారి మాట నాలో లోతుగా నాటుకొన్నది. వారి జీవితమే మంత్రయోగ మయంగా సాగినది. అనుష్ఠానంలో ప్రగాఢమైన నమ్మకమే తప్ప వారికి దాని ఫలితమేమిటి అనే ఆలోచనే వుండేది కాదు. ధర్మాన్ని అనుసరించాలి కనుక అది పాటించి తీరాలి. అంతే. ఇటీవల వారి తపః ప్రభావాన్ని గురించి ఆలోచించినపుడు ఆ భావాన్నే ప్రదర్శించే ఉపనిషద్వాక్యమొకటి సమాధానంగా తోచింది.

నేను నా 28వ యేట్న భృక్తరహిత తారక రాజయోగ మార్గంలో చేరి ఆశ్చర్యకరమైన అనుభూతులను పొందుతున్నప్పుడు వారు యథావిధి తపోమయమైన జీవితాన్ని గడుపుతూ వుండినారు. తరచుగా నేను స్వగ్రామానికి వెళ్లినప్పుడల్లా చల్లపల్లికి వెళ్లీ, వారి కూతురు అల్లుడు నివసించి

వర్ధిల్లుతున్న మా స్వగ్రామం పెదకళ్లేపల్లికి వారు విచ్చేసినప్పుడు కలిసీ, నా విషయాలు కొన్ని వారికి చెబుతూ వచ్చాను. వారూ ఎంతో కుతూహలంతో విని తాము కూడా నాతో ఒకసారి కుంభకోణం వచ్చి శ్రీవారిని దర్శించి, మాట్లాడి ఏదో పొందాలని అంటూ వుండేవారు. వారికీ ఈ యోగంతో పరిచయం కలిగించాలని నాకూ కోరిక వుండేది. కానీ అదీ జరగలేదు.

వారు భౌతిక శరీరాన్ని విడిచిన తర్వాత నా 38వ యేట[3] ఒక రోజు నా ధ్యాన సమయంలో పూజ్యులైన వారూ, మా నాయనగారూ, మా మామగారూ[౪] నాతో పాటు ధ్యానానుభూతిలో వుండడం కొన్ని నిమిషాల పాటు గోచరించింది. ఆ ముగ్గురికీ ఇలాంటి అనుభూతి కలగాలని నా ధ్యాన సమయంలో నేను కోరుకుంటూ వుండేవాడిని. ఆ కారణం చేత ఆ నాటి అనుభూతి నాకు చాలా సంతోషం కలిగించింది.

---

౧. సరియైన ఉపనిషద్వాక్యమును గుర్తింపవలెను.

౨. 1916లో

3. 1926లో

౪. పూజ్యులు వీరి గురువుగారు శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారు, తండ్రిగారు శ్రీ వేటూరి సుందర శాస్త్రిగారు, మామగారు శ్రీ పిశుపాటి జగన్నాథం గారు

# 8. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి దగ్గర నా విద్యాభ్యాసం

శ్రీ అద్దేపల్లి సోమనాథ శాస్త్రి గురువర్యుల శుశ్రూషను విడిచి వెళ్లడం ఇష్టం లేకున్నా శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారు కొత్తగా బందరు హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగా చేరి వుండడం చేతనూ, వారి మహత్త్వాన్ని గురించి మా చుట్టు పక్కల వూళ్ళ వారందరూ చాలా విశేషంగా చెప్పుకుంటూ వుండడం వల్లనూ, శ్రీ సోమనాథ శాస్త్రులు గారి దగ్గర సహాధ్యాయులమై కలిసి చదువుకొంటు వుండిన మేం ముగ్గురం్ - అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి, పిశుపాటి వెంకట రామశాస్త్రి, నేనూ [11] బందరులో చెళ్లపిళ్ల గురువుగారి సన్నిధిలో చదువుకోవాలని ఉబలాట పడేవాళ్లం. మొదటి యిద్దరూ ముందుగా బందరుచేరి అక్కడి సంగతి సందర్భాలు చూసుకొని నన్ను పిలుస్తామని చెప్పి వెళ్ళారు. వారి ప్రోత్సాహంతో నేనూ కొన్నాళ్లకు బందరు చేరాను. అప్పటికి నా వయస్సు పదహారేండ్లు వుండవచ్చు.

తెలుగులో నాకేమైనా కాస్త పరిజ్ఞానం కలిగిందంటే అది శ్రీ వెంకటశాస్త్రి గురువర్యుల అనుగ్రహం వల్ల ఏర్పడిందే అనాలి. వారి దగ్గర పుస్తకం పట్టి చదివిన దానికంటే వారి ముఖతః వినోద గోష్ఠిలో విని నేర్చుకొన్నదే చాలా. ఆధ్యాత్మిక విషయంలో బందరు నివాసం వల్ల గానీ, శ్రీ చెళ్లపిళ్ల వారి సన్నిధి భాగ్యం చేత గానీ నాకు కలిగిన మేలు ఏమీ లేదనే చెప్పాలి. అంతే కాదు. శ్రీ శాస్త్రిగారి సన్నిధిలో అవధాన ధారణలూ, పద్య రచనలూ, ఉపన్యాస వినోదాలూ, కవితా కల్పనలూ, వాద ప్రతివాదాలూ, అహంకార మమకారాలూ పెరిగి ఆధ్యాత్మిక చింత అంతర్ధానం చెందినదనే చెప్పుకోవాలి. శ్రీ శాస్త్రిగారు మాయ మర్మాలు తెలియని స్వచ్ఛ హృదయం

గలవారు. బందరు రాక పూర్వం వారి తీరు "దేశాటనం పండిత మిత్రతాచ" అన్న శ్లోకార్థం చొప్పున చాతుర్యమూలాలు గలదై వర్తిల్లేది.[౨] అప్పటి దేశాటనలోని పండిత మిత్రతా, రాజ సభాప్రవేశాదుల్ని గురించి వారు చెప్పనూ వచ్చును, మేము విననూ వచ్చును. కాని పండిత మిత్రతకు తర్వాతిదీ, రాజసభా ప్రవేశానికి ముందుదీ అయిన చాతుర్యమూలాన్ని[12] కూడా వారు చాటుమాటులు లేకుండా చెప్తూతూ వుండేవారు. నేనవి విని సిగ్గుతో చితికిపోతూ వుండేవాడిని.

ఆ కాలంలోనే మా అన్నగారికి వివాహం జరిగింది.. ఆ వివాహం జరిపించిన వారు మా పెదనాన్నగారి బావమరిది. సంగీత సాహిత్య విద్యారసికులు వారు. దివి సీమలోని చోడవరం గ్రామంలో ఉండేవారు. వారి పేరు శ్రీ లంక నాగేశ్వరశాస్త్రిగారు[3] వారికి నా మీద చాలా వాత్సల్యం వుండేది. ఆయన విధురులు (భార్య పోయినవారు). సంతానం కూడా లేరు. వారు విద్యా వినోదులే కాక వేశ్యావినోదులు కూడాను. మా అన్నగారి వివాహం తర్వాత కొన్నాళ్లకు వారొక పుత్ర స్వీకారం కూడా తీసుకొన్నారు. ఆ కుర్రవాడికి ఉపనయనం చేశారు. ఆ వివాహ సందర్భంలోనూ, ఉపనయనమప్పుడూ గొప్పగా భోగం మేళాలు[౪] రోజూ పొద్దునా, సాయంత్రమూ, రాత్రిళ్లలో కూడా జరిపించారు. ఆ భోగం మేళాల్ని చూడడానికి ఉద్యోగులు కూడా చాలామందే వస్తూ వుండేవారు. కుర్రవాని ఉపనయనం అయింతర్వాత కొన్నాళ్లపాటు వారు నన్నక్కడే నిర్బంధించి వుంచేసుకున్నారు. సంస్కృత నాటక కథలు, కాదంబరీ కథ నన్ను మా మేనమామ గారు వేశ్యా పరివారంతో కూచుని చెప్పమంటూ వుండేవారు. నేను చెబుతూ ఉండేవాణ్ణి. కానీ ఎన్నాళ్ళని అక్కడ వుండేది? పదిరోజుల తర్వాత ఆ వూరు విడిచి వచ్చేశాను.

ఆ వేశ్యల శృంగారాలు, ఆటపాటలు, నేను కథలు చెప్తుంటే వారు చూపిన ప్రీతి, వారి హాస్యగాడూ, బ్రాహ్మణ వృద్ధుడూ, సంగీత సాహిత్య రసికుడూ నన్ను మెచ్చుకుంటూ వుండడం, మా మేనమామ గారు ప్రతి సంవత్సరం వేసంకాలం శలవుల్లో – శ్రీ వెంకట శాస్త్రి గారు బందరు విడిచి వెళుతూ వుండేవారు కనుక తమ వూరికి వస్తూ వుండమని కోరడం నన్ను ముగ్ధుణ్ణి చేస్తూ వుండేవి. మా వూరు వదిలి బందరువెళ్లి వారపు మెతుకులు తింటూ చదువుకోవడం నాకప్పుడు వెగటుగా తోచేది. ఇల్లు వదిలి పరహారు మైళ్ళు నడిచి బందరు వెళ్లడం ఎప్పుడూ అలవాటే అయినా నాకప్పుడు అది బాధగా తోచింది. ఒకటి రెండు ఫర్లాంగులు నడవడమే చాలా కష్టమనిపించింది. దారిలో బురద కాలవ ఒకటి వుండేది. దానిని దాటి వెళ్లాలి. అసహ్యంతోచి ఇంటికి తిరిగి వెళ్లుదునా అనిపించేది. ప్రయాణానికి బట్టలు సర్దుకొంటూ కొంచెం సేపు కూచుని ఆలోచించాను. ఎన్నో చీకాకులు నా మనసులో రేగినవి. శ్రీ వీరేశలింగం[13] పంతులు గారి ప్రహసనాలూ, ఉపన్యాసాలూ, అంతకు ముందే నేను కొన్ని చదివాను. వేశ్యలను గూర్చి వారు రాసినవన్నీ నా మనోవీథిలో మెరిసినాయి. ఇక ఇలాంటి గోష్ఠుల కెన్నడుగానీ పోగూడదని శపథం చేసుకొన్నాను. ఇది క్రీస్తుశకం 1904 నాటి మాట! ఆ తరువాత నేనెప్పుడూ వేశ్యాభినయాన్ని చూడడానికి వెళ్లిన గుర్తులేదు.

బందరులో చదువుకొనే కాలంలో నేను శ్రీశ్రీ కొండ వెంకటప్పయ్య[14] పంతులుగారింట్లోనూ, శ్రీ వల్లూరి సూర్యనారాయణ రావు[15] గారింట్లోనూ ఉండేవాణ్ణి. వారికి అప్పుడు నా మీద చాలా వాత్సల్యం. శ్రీ సూర్యనారాయణరావు గారు వారి జీవిత పర్యంతం నా యోగక్షేమాలు కనుక్కొంటూనే వుండేవారు. వారి ప్రేరణం చేతనే నేను మద్రాసు చేరుకొన్నాను. అప్పటికి నాకు 18వ యేడు. వారు శ్రీ రెంటాల సుబ్బారావుగారికి[16] నా గురించి ఒక లేఖ రాశారు.

౧. ఈ ముప్పురిని గురించి వివరములింకా సేకరించాలి.

౨. సచ్ఛాత్రులైన శ్రీ శాస్త్రిగారు 1. దేశాటనం 2. పండిత మిత్రత 3. నారాంగనా 4. రాజసభా ప్రవేశం 5. అనేక శాస్త్ర కావ్యాల పరిచయం అనే చాతుర్యమూలాలైదింటిని ఇక్కడ క్రమంగా సూచించారు.

౩. బంధువర్గంలోని శ్రీ లంకనాగేశ్వరశాస్త్రి గారిని గురించి వివరాలింకా సేకరించాలి.

౪. భోగం మేళాలు ఆనాటి సామాజిక సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలలో ప్రధానంగా ఉండేవి. మరికొన్ని వివరాలకు చూ.శ్రీపనప్పాకం అనంతాచార్లు గారిని గురించి శ్రీ శాస్త్రిగారు వ్రాసిన వ్యాసం - క్షేత్రయ్య అక్షరాక్షరము ప్రమాణమే.

౫. రావు బహద్దూర్ శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు (1848-1919)

౬. దేశభక్త కొండా వేంకటప్పయ్య పంతులుగారు (1866-1948)

౭. బందరులో సుప్రసిద్ధమైన వకీలు శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు గారు .....

౮. అలనాటి చెన్నపట్టణంలో సుప్రసిద్ధులైన శ్రీ రెంటాల సుబ్బారావు గారు .....
(వీరిని గూర్చిన మరికొన్ని వివరాలకు చూ.విడిగా కూర్చిన పాదసూచికలు)

# 9. ధూమకేతు (తోక చుక్క) దర్శనం

మదరాసులో మా బావగారు శ్రీ కాజ వెంకటశేషయ్య గారు శ్రీ వేపా రామేశం[17] గారి దగ్గర గుమాస్తాగా పనిచేసేవారు. వారి అండతో నేను మదరాసులో కాలుపెట్టగానే శ్రీ పండిత గోపాలాచార్లు[18] గారు, శ్రీపురాణం నాగభూషణం[19] గారు నాకు మిత్రులయ్యారు. గోపాలాచార్యులు గారి ద్వారా నాకు శ్రీ పనప్పాకం అనంతాచార్లు గారితోనూ, వారి కుమారులైన శ్రీనివాసాచార్యులు[20] గారితోనూ స్నేహం ఏర్పడింది. మదరాసు చేరగానే వెస్లీ మిషన్ హైస్కూలులో తెలుగు పండితుణ్ణిగా చేరాను. ఆ రోజుల్లోనే తరచుగా ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు వెళ్లి (నేటి GOML) అక్కడి గ్రంథాలన్నీ చదువుతూ వుండేవాడిని.

శ్రీ వేపా రామేశం గారితో నేను తరచుగా విద్యా వినోద గోష్ఠిని అనుభవిస్తూ గడుపుతూ వుండేవాడిని. రామేశం గారు విద్యారాశి. గణితం, ఖగోళశాస్త్రం, చరిత్ర మొదలైన రంగాల్లో ఆయన నిష్ణాతులు. వారి సంపర్కంలో (సాన్నిహిత్యంలో) నేను ఖగోళశాస్త్ర రహస్యాలెన్నిటినో నేర్చుకొన్నాను. వారింట్లో ఒక టెలిస్కోపు వుండేది. వారి ధర్మపత్ని అంతర్వత్ని (గర్భవతి) గా వుండి పురిటికని పుట్టినింటికి వెళ్లుతూ వుండిన సందర్భాల్లో నెలల తరబడి నేను వారితో పాటు రాత్రిళ్లు చాలా సేపు నక్షత్రగ్రహ మండలాలను పరిశీలిస్తూ వుండేవాడిని. ఆయన నాకు ఎన్నెన్నో ఖగోళ శాస్త్ర రహస్యాలను తెలియజెప్పుతూ వుండేవారు. అలా నేను చాలా నేర్చుకొన్నాను. ఎపి గ్రాఫియా ఇండికా, ఇండియన్ ఆంటిక్వరీ, ఎపిగ్రాఫికల్ రిపోర్టులు మొదలైన చరిత్ర = ఆధార గ్రంథాలు వారింట్లో చాలా వుండేవి. వాటినన్నిటినీ ఇంటికి తీసుకెళ్లి తీరికగా చదువుకొంటూ వుండేవాడిని.

1910వ సంవత్సరము – హాలీస్ కామెట్ (హేలీ ధూమకేతువు) వచ్చినపుడు అది యింకా కొన్నాళ్లకు అందరి భౌతిక దృష్టికి అందనున్న దశలో వారి టెలిస్కోపుతోనూ, బైనాక్యులర్‌తోనూ తెల్లవారుజాముననే లేచి ఆకాశ భాగాన్ని మేమిద్దరమూ పరిశీలిస్తూ వుండేవాళ్లం. ఆ తోకచుక్క అరుణోదయమవుతుండగా తూర్పు దిక్కున గోచరించింది. అది పూర్తిగా కంటికి ఆనేలోగానే ఉదయారుణ కాంతులు కమ్ముకొని కనపడకుండా పోయేది. ఒక రోజు బైనాక్యులర్‌ని చేతిలో పట్టుకొని మేడ దిగి రోడ్డు మీదికి పోయి పరిశీలించాను. నాకది ఒక వెలుతురు చీపురుకట్టలాగా కానవచ్చింది. పరుగు పరుగున వెళ్లి (అంతలోనే అరుణకాంతులు కమ్ముకొని కానరాక పోతుందేమో అనే తలపుతో) రామేశంగారికి చూపించబోయాను. ఆ ఆత్రపాటులో మేడమెట్లు కొట్టుకొని మోకాలి చర్మం చిట్లి నెత్తురు కారడం మొదలైంది. అది గుర్తించక నేను, ఇంకా స్పష్టంగా చూడడానికని మేడ మీది వారి టెలిస్కోపుని తిప్పుతూ చూస్తున్నాను. నెత్తురు కారుతున్న మోకాలుని రామేశం గారు గుర్తించి ఇదేమిటని అడిగితే అప్పుడు గుర్తించాను ఆ దెబ్బను. ఆ కొంచెం వ్యవధిలోనే టెలిస్కోపులో తోకచుక్కని స్పష్టంగా గుర్తించగలిగాను. అప్పటి నా ఉద్వేగాన్నీ, దెబ్బ తగిలి రక్తం చిందుతున్న బాధను కూడా గుర్తించలేని స్థితిని చూసి రామేశం గారు నివ్వెరపోయారు. ఆ నివ్వెరపాటు కొంత తగ్గి టెలిస్కోపులో మేము తోకచుక్కను చూస్తూ చూస్తుండగానే క్రమంగా సూర్యోదయపు వెలుగు రేకలు దాన్ని కప్పివేశాయి. ఆ మరునాడు తెల్లవారుజాముననే ఇద్దరమూ లేచాము. జాగ్రత్తగా గుర్తించి క్రితం రోజున చూసిన ఆకాశ భాగాన్ని పరిశీలించగా రామేశం గారూ స్పష్టంగా దాన్ని చూసి వెంటనే ఆ గుర్తించిన అంశాన్ని హిందూ పత్రికకు రాసి పంపారు. మరునాడే వారికి చాలా

టెలిగ్రాములు వచ్చాయి - ఎక్కడ చూశారు ఏమిటి అని అడుగుతూ. ఆ తరువాత వారం తిరక్కముందే ఆ తోకచుక్క అందరి దృష్టికీ కానవచ్చింది.

ఆ ధూమకేతువుని దక్షిణ హిందూ దేశంలోని జనసామాన్యంలోనే మొట్టమొదటగా గుర్తించిన వాణ్ణి నేను కావడంలో మహత్తరమైన విశేషమేదో ఉందని ఇప్పుడు భావిస్తున్నాను. దాని ప్రయోజనం ఏమిటో ముందు తెలియగలదు[21].

---

౧. శ్రీ కాజ వేంకట శేషయ్య గారు శ్రీ శాస్త్రిగారి బావగారు - యోగమిత్రులు.

౨. శ్రీయుతులు పండిత గోపాలాచార్లు గారు (1872-1920)

౩. శ్రీ పురాణం నాగభూషణం గారు - వివరాలు సేకరించవలెను.

౪. శ్రీ పనప్పాకం అనంతాచార్లు గారు (1843-1909)

౫. శ్రీ పనప్పాకం శ్రీనివాసాచార్లు గారు శ్రీ అనంతాచార్లు గారి కుమారులు - శ్రీ శాస్త్రి గారి మిత్రులు - సాహిత్య ప్రియులు. వారి నిర్యాణ సందర్భంలో శ్రీ శాస్త్రిగారు ప్రకటించిన పద్యాలు (1911) తెలుగు సాహిత్యంలో పేర్కొనదగ్గ తొలినాళుల ఎలిజీ రచనలు.

౬. సర్ శ్రీ వేపా రామేశంగారు (1876-1947). నాటి చెన్నపట్టణంలోని హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులు.

౭. 1910లో గోచరించిన హాలీస్-కామెట్ వర్తమాన యుగంలో మాస్టర్ సీవీవీ వారి భృక్తరహిత తారక రాజయోగం అనే నూతన యోగ ఆవిష్కారానికి కారణభూతమైనది.

# 10. బ్రహ్మచర్యం - గార్హస్థ్యం

రెండేళ్లు నేను కెలెట్‌స్కూలు (వెస్లీ మిషన్ హైస్కూలు) లో తెనుగు పండితుణ్ణిగా పని చేస్తుండగా నాకు వివాహ నిర్ణయం జరిగి, మా తల్లిదండ్రులు నన్ను ఇంటికి రమ్మన్నారు. మదరాసు నుంచి బయలుదేరి వెడుతూ బందరులో శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు గారింట్లో దిగాను. అవి హైస్కూలు వేసవి శలవురోజులు. సూర్యనారాయణ రావు గారు మద్రాసు వెళ్లే ముందు నన్ను తరచుగా ఇంటికి వస్తూ కాలక్షేపం చేయవద్దనీ, మదరాసులోని ఓరియంటల్ లైబ్రరీలోని గ్రంథాల్ని విశ్రాంతి సమయాల్లో చదువుతూ పాండిత్యాన్ని వృద్ధి పరచుకొంటూ వుండాలనీ అనేవారు. ఇప్పుడప్పుడే పెళ్లి చేసుకొని సంసారపు బాదరబందీలో పడవద్దనీ, యూరపులో చాలామంది జీవితాంతం అవివాహితులుగానే వుండి గొప్ప విజ్ఞానాన్ని గడించి, డబ్బు సంపాదించి, ఆ సొమ్మును కూడా లోకోపకారానికే సమర్పిస్తూ వుంటారనీ, లోకంలో కొంత మందైనా లోక సేవ కోసం పెళ్లి చేసుకోకుండా వుండడం మంచిదనీ నాకు హెచ్చరికలుగా చెబుతూ వుండేవారు.

అప్పుడు నా రాక వారికి అతృప్తిని కల్గించింది. చల్లని నూతి నీరు తోడుకుని ఇద్దరమూ హాయిగా స్నానం చేసి భోజనాలకు కూర్చున్నాము. చెమటలు దిగజారుతున్నవి. సూర్యనారాయణ రావు గారి ధర్మపత్ని శ్రీ పార్వతమ్మ గారు విసనకర్రతో విసురుతూ, చెమటరోతను తొలగిస్తూ, హాయిని కూరుస్తున్నారు. భోజన సమయంలో తిరిగీ నా కథ నందుకొంటూ 'ఇంటికి రాకుండా మద్రాసులోనే ఉండమన్నాను గదా! ఎందుకు వచ్చావిప్పుడు? పెళ్లి ప్రయత్నాలేమైనా సాగుతున్నవా? పెళ్లికి ఆత్ర పడవద్దని నీకిదివరకే చాలా సార్లు చెప్పాను కదా! యూరపులో చాలామంది

యుక్తవయస్సు వచ్చి, విద్యార్జనం, ధనార్జనం చేసిన తర్వాత కానీ పెళ్లి చేసుకోరని! కొంతమంది అసలు పెళ్లి చేసుకోకుండానే తమ విద్యను, ధనార్జనలను లోక సేవకే అంకితం చేసుకొంటూ వుంటారని కూడా చెప్పాను కదా! ఒక పక్క పేదరికంతో తంటాలు పడుతూ పెళ్లాడిన పడుచును కూడా ఆ క్షోభకు గురి చేయడానికా పెళ్లి చేసుకోవడం? విద్యా విశేషాలనూ, ధనాన్నీ గడించి, తలిదండ్రులను సుఖపెట్టి, చాలినంత డబ్బు సంపాదించ గల్గితే ఆ తరువాత పెళ్లి సంగతి చూసుకోవచ్చు గానీ ఇప్పుడే పెళ్లికి తొందరేమిటి? విద్యా వివేకాలు లేని ఆడ పడుచుల్ని పెళ్లాడి, ఏడాదికీ రెండేళ్లకీ పిల్లలు పుడుతుంటే ఈసురో దేవుడా అన్నట్టు, వసతి గల ఇంటి పట్టుగానీ, పిల్లల్ని పోషించే సౌకర్యం గానీ లేనప్పుడు, చాలీ చాలని జీతాలతో, నిరుత్సాహంతో కొట్టుమిట్టాడుతున్న కుటుంబాలనెన్నిటిని చూడటం లేదు? అట్లాంటి అవస్థలో నువ్వూ ఒకడివై దిగనాసిల్లాలను కొంటున్నావా?" అని యింకా అనేక విధాల తీవ్రమైన భాషతోనే నన్ను మందలించడం మొదలు పెట్టారు. నేను తలదించుకొని తింటున్న అన్నపు ముద్ద మింగుడు పడక, మాట్లాడలేక, సిగ్గుతో చితికి వదవదలాడవలసి వచ్చింది.

అప్పుడు శ్రీ పార్వతమ్మగారందుకొన్నారు :

"ఇటు వినండీ! యూరపుదేశం వారి బ్రహ్మచర్యం మాట యెత్తకండి. ఆ బ్రహ్మచర్యం మన వాళ్లకెందుకుగానీ; వీరికి బాగా ధనాన్ని ఆర్జించిన తర్వాత, ప్రౌఢ వయస్సు వచ్చిన తర్వాత పెళ్లి చేసుకోమంటున్నారే! వింతగాలేదూ? మన దేశపు సర్వైశ్వర్యాన్నీ దోచుకొంటున్నారు కాబట్టి యూరపు వారు ఏ విద్య చేతనైనా ఎంత ధనాన్నైనా ఆర్జించగల్గుతున్నారు. కట్టు బట్ట, కుట్టు సూదీ కూడా వారే తయారు చేస్తూ, మన దేశంలో

అమ్ముకొంటూ ధన ప్రవాహాన్ని తమ దేశం మీదకు పారించుకొంటూ లోకోపకారమే చేయగలుగుతున్నారు – నిజమే అనుకొందాం. అంతంత ధన సంపాదనకు మన దేశం వారికి సౌకర్యాలేవీ? ప్రౌఢ వయస్సు వచ్చిన తర్వాత పెళ్లాడడం యూరపు వారికి చెల్లుతుందేమో గానీ మన దేశం వారికి చెల్లదు గాక చెల్లదు. ఆ దేశంలో యాభై అరవై యేళ్ల వరుని బ్రహ్మచర్యాన్నీ, ముప్పై నలభై యేళ్ల వధువు కన్యాత్వాన్నీ మనం విశ్వసించలేము. చల్లని యూరపు దేశంలో ఆ పద్ధతులు చెల్లుబాటు అవుతాయేమో గానీ మన దేశం వారికి ఆ వయస్సు వార్ధక కాలమే, ఎంత డబ్బు సంపాదిస్తే మాత్రమేమి? అంత ఆలస్యంగా పెళ్లాడడం మన దేశం వారికి గత జల సేతు బంధనమే (దండుగే). మొన్ననే విన్నాం కదా! అధిక విద్యావతిని పెళ్లాడిన భర్తల గోడు! హైదరాబాదులో ఒక గొప్ప డాక్టరు విద్యావతిని పెళ్లి చేసుకొని, తరచుగా యూరపు మొదలైన ఖండాంతరాలకు వెళ్లి వస్తూ, నెలలూ సంవత్సరాలు తరబడి దేశాంతరాలలో వుండడం, తన ఆర్జనమంతా ఆమె యాత్రా వ్యయానికే ఖర్చు కావడం, తన బంగళాలోని గోడలన్నీ కూడా బూజు పట్టి అందమైన చిత్ర రచనలెన్నో దుమ్ము దులిపేవారు కూడా లేక తారుమారై చెడిపోతున్నాయని చివరికి గార్హస్థ్య (కుటుంబ) సౌఖ్యం కూడా లేకపోతున్నదనీ స్నేహితునికి చెప్పి వాపోవగా, ఆ మిత్రుడు ఆ సంగతి మీకు చెప్పడం మనమెరిగిన విషయమే కదా! ఏ యెండకా గొడుగు అన్నట్టుగా వుండడం క్షేమం. తనకు మించిన విద్యావతిని పెళ్లి చేసుకోవడంలో చిక్కులే కానీ క్షేమం వుంటుందన్నది మాత్రం అసాధారణం!

చూడండి! మొదట్లోనే తనకు తగిన పడుచును పెండ్లాడి రోడ్డు రిపేరు చేసుకొనే ఉప్పరి పనివాడు పగలెల్లా మట్టిపని చేసుకుంటున్నాడు.

సంజకడ ఉడుకునీళ్లు కాచి, యిల్లాలు వీపు తోమి స్నానం చేయించగా భర్త సుఖంగా స్నానం చేసి, భార్యతో కలిసి గంజి అన్నం, ఉప్పు, పచ్చిమిరపకాయ నంజుకొంటూ కడుపారా ఆరగించి తమకు కలిగిన చిన్న బిడ్డను అక్కడే ఓ చెట్టు కొమ్మకు వ్రేలగట్టిన చీర ఉయ్యాలలో ఊగించి, చల్లగాలిలో ఆ బిడ్డ సుఖనిద్రలోకి జారుకోగా, చెట్టు క్రిందనే దుప్పటి పరుచుకుని హాయిగా పడుకోవడం మనం చూస్తున్న విషయమే కదా! అలాటి వారి దాంపత్యంలో తృప్తి హాయి కనపడడంలేదా?

మీరొక్కరే ఒంటరిగా మిగిలిన మీ కుటుంబంలో నన్ను పెళ్లాడిన తర్వాత వంశవృద్ధి కలిగి మీరు సుఖిస్తున్న తీరు గుర్తుకు రావడం లేదా? నేను మీ పక్కన ఉండడం చేతనే కదా మీకిలాంటి సుఖ భోజనం లభిస్తున్నది! వంట వాణ్ణి పెట్టుకొని వాడు చేసే వంటతో భోజనం చేస్తూ గడపడంలోని ఇబ్బందులను గుర్తిస్తూనే ఉన్నాం కదా! మీకు ఏవి ఆరోగ్యకరములో హితకరములో అలాంటి కూరగాయలనే నేను తెప్పించి, మీకు ప్రియమైన తీరుగా వంట చేయించి పెట్టడం చేతనే కదా మీ ఆరోగ్యం బాగా ఉండడం, హితమైన భోజన సదుపాయం కలగడం, సాగుతున్నవి! కోర్టు నుంచి మీరు ఇంటికి రాగానే అక్కడ పడిన పరిశ్రమ పరిహారమయ్యేది మా వినోదంతోనే కదా! ఇంతెందుకు? ఈ యెండ ఉక్కపోతలో చెమటలు దిగజారుతుంటే పక్కన కూచుని నేను విసనకర్రతో విసురుతుంటేనే కదా శ్రమ యెరుగకుండా మీరు హాయిగా భోజనం చేయగల్గుతున్నది! ఈ వంటకాలు వంటమనిషే చేసినా నేను దగ్గరుండి మీకేవి ప్రియములో వాటిని తెప్పించి, తరిగి యిచ్చి, మీకు రుచించేట్లుగా తగిన ఉప్పుకారాలు వేయించి వండించి పెట్టడం వల్లనే అవి మీకు రుచిస్తున్నవి!

మన శాస్త్రులు గారు ఇక్కడున్నప్పుడు కొంత కొంత

సంస్కృతాంధ్రాల పరిచయం పెంచుకొని తరుచుగా భారతాదులు చదువుతుండడం చేతనే ఆ పద్యాలివి కొన్ని నా నోటికీ వచ్చినవి చిత్తగించి వినండి!

అధిక దుఃఖరోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చూవె యెందు
నొనర భార్యాసమేతుడై యున్నవాని
కెంతలయ్యును నాపద లెరుక పడవు. (–)

(ఎక్కువ దుఃఖంతోనూ, రోగంతోనూ, బాధపడే రోగికి భార్యతోడే పరమౌషధం. భార్యాసమేతుడై వుండేవాడికి ఆపదలెన్ని ఎదురైనా ఏ కష్టమూ తోచదు).

అలసినెడ, డస్సినెడ, నా
కలి తృష్ణయు నైన యెడల గడుకొని ధరణీ
తలనాథ! పురుషునకుని
మ్ముల భార్యయపాచు జిత్తమున దుఃఖంబుల్. (–)

(అలసిపోయి, బడలిపోయినపుడూ, ఆకలీ దాహమూ అయినప్పుడూ, ఓ రాజా! మగవానికి యిల్లాలే కదా మనసులోని దుఃఖాలన్నిటినీ పోగొట్టేది!)

(నన్నయభట్టు భారతానువాదం – నలోపాఖ్యానం)

పార్వతమ్మ గారు కలుగజేసుకొని యింత పలుకగా, నాకు ముద్ద మింగుడు పడుతుండగా, సూర్యనారాయణ రావు గారు ఇంకేమీ మాట్లాడలేక, నన్ను చూసి "వెంటనే ఇంటికి వెళ్లి పెండ్లాడుదువుగానిలే! నీ వాలకం చూస్తుంటే గట్టి పెళ్లి ప్రయత్నంతోనే ఇంటికి వెళుతున్నట్టున్నావు. శుభమస్తు" అన్నారు.

# 11. వివాహం

నా ఇరవై రెండో యేట్ల నాకు పెళ్ళయింది. మా వూరికి ఆరుమైళ్ళ దూరంలో వున్న ఘంటసాల నా అత్తవారి వూరు. అదే మా మేనమామ గారి ఊరూను. తొంభై యేళ్లకు పై బడిన వయస్సున్న వారు మా మేనమామ గారు శ్రీ పిశుపాటి వేంకటాద్రి గారు. ఇప్పటికీ (1949 నాటికి) ఆరోగ్యంతో ఉన్నారు. వారికి ఏడుగురూ పుత్రులే కలిగారు గానీ పుత్రికా సంతానం లేదు. అందుకు మా కుటుంబంతో సంబంధం ఎక్కడ తెగిపోతుందో అన్న బెంగతో వారికి జ్ఞాతులైన (సగోత్రీకులైన) మా మామగారిని నాకు పిల్లనిమ్మని కోరారు. మా మేనమామ గారి కుమారుడప్పటికి రెండేళ్లకు ముందే (1947ల) స్వర్గస్థుడైనాడు. శ్రీ సోమనాథ శాస్త్రి గారి దగ్గరా, శ్రీ వెంకట శాస్త్రి గారి దగ్గరా నాతో పాటు సహాధ్యాయుడుగా చదువుకొంటూ వుండిన వెంకట రామశాస్త్రి జీవించి ఉన్నప్పుడు ఆయన మీద ఆదరం చూపుతుండడం చేతనూ, మా మేనమామ గారు కోరిన కోరిక మేరనూ, భూవసతి లేదన్న కొరత చేత కాస్త సందేహించినా మా సంబంధాన్ని చిట్ట చివరకు మా మామగారు అంగీకరించారు. వారు చాలా ప్రశాంతమైన చిత్తం కలవారు. మంచి నడవడిక కలవారు, అమాయకులు. మా తండ్రి గారి వలెనే వారూ కడిపెడు (ఎక్కువమంది) బిడ్డలు కలవారు. వివాహం అయింది. మా మాతృశ్రీ గారి మీద భక్తి చేతను, వారు పుట్టినవూరనీ, వారి యింటి పేరి వారనీ, నేనెంతో తృప్తితో ఈ సంబంధాన్ని ప్రేమించాను. వివాహం కాగానే మద్రాసు వచ్చేశాను. అప్పుడు నా నివాసం మైలాపూరులో. అక్కడ నుంచి తిరువళిక్కేణి హైస్కూలుకి రోజూ రాకపోకలు. తొమ్మిది గంటల కల్లా హోటలులో భోజనం చేసి తిరువళిక్కేణికి నడిచి వెళ్లి సాయంకాలం నడిచి వచ్చి, రాత్రి భోజనం చేయడం. ఈ దినచర్య వల్ల

తగిన పోషకాహారం చాలక కాబోలును నీరసంగానే వుండేవాడను. నీరసమే తప్ప అనారోగ్యమేదీ లేదు. అప్పుడప్పుడు కృష్ణామండలంలోని స్వగ్రామానికి వెళ్లి అక్కడ కమ్మని నెయ్యి పెరుగులతో భోజనం చేసినపుడు శరీరానికవసరమైన మంచి బలమూ ఉత్సాహమూ కలిగేవి. సంవత్సరానికొకసారైనా తప్పకుండా ఇంటికి వెడుతూ అట్టి బలోత్సాహాలను కూర్చుకొంటూ వచ్చి ఆ పుష్టినంతా మద్రాసులో ఖర్చు చేసుకొంటున్నా ననిపించేది నాకు. ఈ ప్రయోజనం కోసమే పెళ్లయిన తర్వాత వేసవి శెలవుల్లో ఇంటికి వెళ్లాను.

---

౧. శ్రీ శాస్త్రిగారి వివాహం 1910లో.

౨. శాస్త్రిగారి మాతృశ్రీ శేషమ్మ గారి అన్నగారు వేంకటాద్రి గారు.

3. శ్రీ పిశుపాటి జగన్నాథం గారు.

౪. ఇంచుమించు 1947 కాదగును.

# 12. బండిపాటు

మా వూరికి ఆరు మైళ్ల దూరంలో అవనిగడ్డ అనే గ్రామం వుంది. అది తాలుకా ప్రధాన స్థానం. మా అన్నగారు అక్కడ పోస్టు మాస్టరు. వారి కుటుంబాన్ని చూసి రావడానికై నేనావూరికి వెళ్లి తిరిగి వచ్చే సమయం. మా వూరి వారే మహనీయులు, గొప్ప వేదవేదాంగ వేత్తలు, నా పైన ఎంతో వాత్సల్యం గలవారు, వృద్ధులైనవారు, శ్రీ యడవల్లి అప్పావధాన్లుం గారు మిక్కిలి వృద్ధురాలైన తమ అత్తగారితో సహా అవనిగడ్డ నుంచి మా వూరికి బండి మీద వస్తూ వుండి, అప్పుడు నన్ను కూడా తమ బండిలో రావలసిందిగా బలవంతపెట్టారు. దారిలో నేనేవేవో మద్రాసు పుస్తకశాలలోని గ్రంథాలను గురించి ముచ్చటించే వినోదంలో వుండినాను. బండి ఒకటిన్నర మైలు సాగింది.

అవనిగడ్డకు మా వూరికి మధ్యగా కృష్ణానది పారుతుంది. అది వేసవి కనుక పాటిరేవు గలదే. బండి నదిలోంచి సాగిపోవచ్చును. కాని గట్టు మీది నుంచి యేటిలోకి కొన్ని నిలువుల లోతుకి దిగవలసి వస్తుంది. అట్లాగే బండి దిగుతోంది. బండి తోలుతున్న రైతు (మా వూరివాడే!) చుట్ట కాల్చుకోడానికని అంతకుముందే బండి దిగాడు. గట్టు నుంచి పల్లానికి బండి గాడిలోంచి ముందుకు పోతున్న సమయంలోనే బండితోలే అతను కాలు మడుచుకోడానికని వెళ్ళి కాస్త వెనకపడ్డాడు. అంతలో బండి చక్రమొకటి బండి గాడిలోని పల్లపు చాలులో వుండగా రెండో చక్రం గట్టు మీదికెక్కింది. మొదట్లో ఆ యెగుడు దిగుడు కొంచెంగానే వున్నా రెండు మూడు గజాలు సాగేసరికి ఒరిగి ఒడ్డగెడపుగా (ఒక ప్రక్క పైకి, మఱొక ప్రక్క క్రిందకు) అయింది. ఎడ్లు వడిగా దిగిపోతున్నవి. బండి వెనుక చివరి యంచున నేను కూర్చొని వున్నాను! ఇక ఒక క్షణంలో నా జీవితం

అటో యిటో ఏదో అయ్యే స్థితి దాపురించింది సుమా అనిపించడం వరకే నేనెరుగుదును – బండి వెనుక భాగంలో వున్న నాకు యెడ్ల దూకుడు, దిగుడు, బండి చక్రాలఒడ్డ గెడపు, స్పష్టంగా నాకు కనిపిస్తోందే కానీ బండిలోపలి గూడులో ఒరిగి కూచున్న వారికది కనపడదు – ఇహలోక ప్రజ్ఞ యీ శరీరంలో ఉండడమో ఊడడమో – ఈ లోకంతో సంబంధమిక తీరనున్నదేమో అనే భావం కలిగిన ఆ క్షణమే తెలుసు గానీ దాని తర్వాత ఏమైందో నాకు తెలియదు. నా స్థితి నాకు తెలియలేదు.

ఈ స్థితి కొన్ని క్షణాలో, ఒకటి రెండు నిమిషాలో పట్టి వుండ వచ్చును. "ఛండాలుడా! లక్ష రూపాయల విలువచేసే మనిషిని చంపేశావు గదరా ఛండాలుడా" అంటూ అవధానులు గారు ఏడుస్తూ అరవడంతో నాకు ప్రజ్ఞ తెలిసింది. "బ్రతికే వున్నానండీ బాబూ! బాధ పడకండి!" అన్నాను. అప్పావధానులు గారు నా యెదురుగా ఏ అపాయమూ లేకుండా నిలబడి వున్నారు. నాకు ఐహిక (బాహ్య) ప్రజ్ఞ కలిగినందుకూ, అప్పావధానులు గారు నిరపాయంగా (క్షేమంగా) వున్నందుకు అమ్మయ్య అనుకొని "సోమిదేవమ్మ గారు (అప్పావధాన్లు గారి అత్తగారు) ఎక్కడండీ" అన్నాను. "బ్రతికున్నావా నాయనా" అంటూ ఆమె చేరవచ్చింది. "మా యిద్దరికీ, మొండి ఘటాలకు ఏమీ దెబ్బ తగల్లేదు నాయనా! నీ చెయ్యి ఇదేమిటీ ఇలాగైంది" అంటూ గొల్లుమంది. అప్పుడే నేను నా చేతులను చూసుకొన్నాను. కాని అందాకా నేను బాధను కూడా ఎరుగను. నా కుడిభుజం గూడు జారి నా కడుపు మీదగా వ్రేలాడుతూండడం గమనించాను. ఆ వికారం నాకు వాంతిని, మైకాన్నీ, కంపాన్నీ కలిగించినవి. ఇంకేమేమి అంగ వికృతి కలిగిందో, ముందేమవుతుందో అన్న కంగారుతోనే అప్పావధాన్లు గారినిట్లా ప్రార్థించాను – "నా పూర్వకర్మానుభవమేదో నేను

అనుభవిస్తున్నాను. నా స్థితి ఏమవుతుందో! మా తల్లిదండ్రులకు నెమ్మదిగా నా స్థితిని తెలుపండి. ఈ బండి వానికి ఏ తొందరా కలుగరాదు. నా ప్రాణమున్నా ఏమైనా వీణ్ణి మాత్రం నన్నుగానే భావించి కాపాడండి! కాని తిట్టి పొయ్యకండి - దాహం - దాహం !, అంటూనే మైమరుపాటు చెందాను. కొంతసేపటికి చల్లని మంచినీరు, మజ్జిగ, దగ్గర్లోని కొత్తపేట బ్రాహ్మలు తెచ్చి యివ్వగా, చన్నీటి గుడ్డతో మొహం తుడిచి, ప్రజ్ఞ రప్పించి, మజ్జిగ అందించారు. మా వూరి కరణంగారు మా నాన్నగారి బాల్యమిత్రులు శ్రీ కొడాలి వెంకయ్య్యగారింతలో అక్కడికి బండి మీద వచ్చి చేరుకొన్నారు. నన్ను ఆదరించి బండి మీద కెక్కించి నన్ను వెనక్కి, అవనిగడ్డకే - అక్కడ ఆసుపత్రీ వుంది, మా అన్నగారూ వున్నారు - కనుక తిప్పి పంపి, నా కొక మిత్రుణ్ణి కూడా తోడిచ్చి పంపే ఏర్పాటు చేశారు. బోల్తాపడ్డ బండిని లేవనెత్తి, ఆ బండిలోని వారినీ అందులోనే ఎక్కించుకుని కళ్లేపల్లి వెళ్లారు. నేనెక్కిన బండిని నెమ్మదిగా నడిపిస్తూ జారిపోయి వ్రేలాడుతున్న చేతితో విచారంగా నున్న నన్ను ఎట్లో అవనిగడ్డకు చేర్చారు.

ఆ నాటి రాత్రి - ఆస్పత్రి అసిస్టెంటు ఊళ్లో లేడు. అందుకని కంపౌండరే ఒక సాహెబు నా చేతిని సరిదిద్దే యత్నం చేయబోయాడు. క్లోరోఫారం ఇవ్వలేదు. చంక కింద గుడ్డ మడతపెట్టి దిండుగా వుంచి, ఇంకో తుండు గుడ్డ చంక కింద దూర్చి ఒకరు తల దగ్గర నుంచి లాగడం, ఇంకొకరు నా చేతిని కాళ్ళవైపు నుంచి లాగడం సాగించారు. జబ్బ మజిల్సు చిరుగుతున్నట్లయింది. గగ్గోలు పెట్టాను. అయినా విడవకుండా వాళ్లు లాగుతూనే వున్నారు. డమ్మని పెద్ద మోత మోగింది. చేయి స్వస్థానం చేరిందని చెప్పి కంపౌండరు కట్టు కట్టెను. ఆ మరునాడు ఆస్పత్రి అసిస్టెంటు వచ్చెను. నా చెయ్యి రుబ్బు రోలు లాగా వాచి వుంది. తీవ్ర జ్వరం వచ్చింది.

అక్కడే నాలుగైదు రోజులున్నాను. వాపైతే తీసిందిగానీ చేయి పైకి లేవదు. ఆస్పత్రి అసిస్టెంటు ఉద్యోగానికీ, జీవితానికీ కూడా చివరిదశలో వున్నవాడు (కొద్ది రోజులకే అతడు రిటైరై, స్వర్గస్థుడయ్యాడు. అతిమూత్ర వ్యాధిగ్రస్తుడు) నన్ను బాధించడం తప్ప నా జబ్బను సరిదిద్దలేకపోయాడు. ఇంటికి వచ్చి, అక్కడ నుంచి బందరు చేరి శ్రీ వల్లూరి సూర్యనారాయణ గారిని తోడు తీసుకుని ఆస్పత్రికి వెళ్లాను. అక్కడ సుబ్బయ్యర్ అనే సర్జన్ వుండెను. సూర్యనారాయణ రావు గారి మాట విని వెంటనే క్లోరోఫారం ఇచ్చి చేయి సరిదిద్ది కట్టు కట్టెను. కాని మరునాటి నుంచీ ధనదాహంతో నన్ను పీడిస్తూనే వచ్చెను. వెంటనే మదరాసు చేరుకొని పరిచితులైన డాక్టరు నంజుండరావు[3] గారికి చూపించాను. వారు 'ఇప్పటికే చేతి సంధిబంధాలన్నీ చాలా శిథిలములైపోయి వున్నవి. డాక్టర్లకు ఇక చూపించవద్దు. సుష్టుగా పేరిన నెయ్యి, గడ్డ పెరుగు వేసుకుని భోజనం చేస్తూ, జబ్బకు నూనె, వెన్న, నెయ్యి లాంటి తైలాలు రాచి చన్నీటి కుళాయి కింద ధారగా నీళ్లు పడేటట్టు ఎక్కువ సేపు కూచో – అలా చేస్తూ ఉంటే క్రమంగా చక్కబడగలదు" అని చెప్పారు. ఆ సూచనలు పాటించాను గానీ స్కూల్లో బోర్డు మీద సీమ సున్నంతో ఏదైనా రాయాలంటే కష్టంగా వుండేది. రెండో చేతితోడ్పాటు తీసుకొని కానీ కుడిచేతిని ఎత్తిపెట్టి ఉంచలేకపోతూ వుంటిని. మంచినీళ్ల చెంబుని కొన్ని గజాల దూరమైనా మోసి తెచ్చుకోలేనైతిని. క్రమ క్రమంగా నంజుండరావు గారు చెప్పినట్టు చేస్తుండడంతో కొంత సుగుణం కనిపించడమో, అసౌకర్యాన్ని సహించే అలవాటు పడడమో అయేది. కానీ యెందుకో గానీ రోజు రోజుకీ నాలో నిరుత్సాహం పెరుగుతూ వచ్చింది.

అయినవాళ్లే నా స్థితిని చూసి దుఃఖిస్తూ "పెళ్లయిన దగ్గర నుంచీ వీని స్థితి మరీ యిదిగా వుంది. ఈ పెళ్లి వీనికి శుభప్రదం కాలేనట్టుంది"

అని పరోక్షంగానూ, సనసన్నగా ప్రత్యక్షంగానూ కూడా మాట్లాడుకోవడం మొదలు పెట్టారు. నాకు అది మరీ కష్టంగా వుండేది. “ఇది దైవ నిర్ణీతం. ఇందులో మంచినే గుర్తించాలి కానీ చెడుగుల్నే వెదికిపట్టుకొంటూ మనసుని చిదుకకొట్టుకోకూడదని నేను వారికెదురు పలికేను. అభమూ శుభమూ తెలియని పదేళ్ళ బాలికను గురించిన గర్హణ (తూలనాడడం) నాకు చీకాకు కలిగించింది. అమాయిక ఆ బాలిక మీద నాకు అమితమైన అనురాగం ఏర్పడింది. ఆ బాలిక మూలంగా నేను మేలే పొందగలుగుతానని నమ్ముతున్నాను. ఇది నా గుండెల్లో మాత్రమే తొణికిసలాడుతుండిన భావన.

---

౧. వివరాలు సేకరించవలెను.

౨. పెద్దకళ్ళేపల్లిలో శ్రీ శాస్త్రిగారి కుటుంబమునకు సన్నిహితులైనవారు కొడాలివారు.

3. డా॥ యం.సి. నంజుండరావు గారు (?-1918) సుప్రసిద్ధ వైద్యులు శ్రీ శాస్త్రిగారి సన్నిహితులు, దాత. అలనాటి చెన్న పట్టణంలోని రామకృష్ణ మఠ స్థాపకులలో ఒకరు. మైలాపూరులోని వారి ‘శశివిలాసం’ నకు 1893లో స్వామి వివేకానంద (శశి మహరాజ్) తమ చికాగో పర్యటనకు ముందు చర్చ నిమిత్తం డాక్టరు గారింటికి వచ్చిరని వారి మనుమలైన ఆచార్య ఆర్. నంజుండరావు గారు మైలాపూరు టైమ్సులో పేర్కొన్నారు. డాక్టరుగారు అప్పటి థియోసాఫికల్ సొసైటీతో సన్నిహిత సంబంధం గలవారు. నాటి సమకాలిక ప్రముఖులను గురించి తెలియడానికి చూ.గూగుల్ సమాచారము.

# 13. శకునాలు చూడడం

అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతుండడం చేతనే దేశమంతటా ఇలాంటి విపరీతపు ఆలోచనలే పెచ్చు పెరుగుతున్నాయి. పెద్ద పెద్దలూ, కొమ్ములు తిరిగిన విద్వాంసులూ, మహోన్నత పదవుల్లో వున్నవారూ కూడా ఇంట్లోంచి ఏదో పని మీద బయటికి వెళ్లేప్పుడు ఎదురుగా ఎవరు వస్తున్నారో అని పరిశీలిస్తారు. కుగ్రామాల్లో అయితే అలాంటి పరిశీలనం తగునేమో, అర్థవంత మవుతుందేమో కాని వేల కొద్దీ జనం గల నగరాల్లో అలాంటి పరిశీలనం చీకాకును కలిగిస్తుంది. ఏకకాలంలోనే వీధులలో 'పంచ శుభం పంచాశుభం' (అయిదు శుభాలూ, అయిదు అశుభాలు) అన్నట్టుగా, కలిసికట్టుగానో, కాస్త ముందు వెనుకలుగానో, భర్తలున్నవాళ్లూ, భర్తలు పోయిన వాళ్లూ, ఒంటి బ్రాహ్మలు, బ్రాహ్మణుల గుంపులు కనపడుతూనే వుంటారు. ఇందులోనూ ఏది ముందు, ఏది తర్వాత అన్న ఆలోచనా వుంటుంది. అంతేకాదు ఫలానా వితంతువో, ఫలాని బ్రాహ్మణుడో ఎదురొస్తే అన్నీ సక్రమంగా జరుగుతాయంటూ అసలు శకున శాస్త్రాని కన్నా భిన్నంగా నమ్మడమూ వుంది. అట్లావారు ఎదురు పడ్డప్పుడు మంచి జరిగిందనడానికి ఏవో కారణాలు, యుక్తులు, అసందర్భంగానో అనుకూలంగానో చెప్పడమూ వుంది.

తాము ప్రయాణమయ్యే వేళకు అతడు బ్రాహ్మణుడే అయితే, చివరకు తన కొడుకో, అన్నో, తమ్ముడో అయినా సరే ఎదురుగ వస్తే మొహం చిట్లించుకుని బాహాటంగానే తిట్టడమో తిట్టుకోవడమో కూడా జరుగుతూ వుంటుంది. తమ యింట్లోని వారే అయినా, పరాయి వారైనా సరే వితంతువు ఎదురైతే గర్హించడమో (నిందించడమో), ప్రయాణాన్ని ఆపుకోవడమో కూడా జరుగుతూ వుంటుంది. మరీ వింత! ప్రయాణమయ్యే

వ్యక్తి తాను వితంతువైనా మరో వితంతువు తనకెదురు పడితే గర్హించడం! ఈ లాంటి శకున పరీక్షల వల్ల ప్రయాణాలాపుకొనే వారూ, తప్పని సరిగా ప్రయాణం చేయవలసి వచ్చినా నిరుత్సాహ పడిపోయి ప్రయాణం తిన్నగా చేయలేక ఎదుటి వారిని గర్హిస్తూ వారితోనూ వారి కుటుంబం వారితోనూ దీర్ఘ వైరం తెచ్చుకొనే మనస్తత్వం గలవారూ కూడా చాలా మందే వున్నారు. రైలు ప్రయాణాలకు శకునాలు చూసుకొంటూ అనుకూల శకునాలెదురయ్యే వరకూ ఆగేవారో లేదా చాలా ముందుగానే బయలుదేరి వెళ్లేవాళ్లో కూడా ఉన్నారు.

మన మంచి చెడ్డలకు మనమే కారణమనీ, మనం చేసే మంచి పనులే, భావించే మంచి మంచి సంకల్పాలే మన కార్యసిద్ధికి మూల కారణాలనీ గాఢమైన నమ్మికతో, పట్టుదలతో ప్రవర్తించగల్గినవారు ఇలాంటి చిలిపి చీకాకులకు లోను కారు. మంచి శకునాలున్నా దుష్ఫలితాలు కలగడం, చెడ్డ శకునాలెదురైనా కూడా సత్ఫలితాలు కలుగుతుండడం గుర్తిస్తున్నా కూడా, శాస్త్రమే ప్రమాణమన్న ప్రామాణిక నిశ్చయం లేకున్నా కూడా దాన్నే నమ్ముకోవాలనీ, అందుకేవో అనువైన శ్లోకాలనుదాహరించుకొంటూ సమర్థించుకురావడం అజ్ఞానపు పిరికితనం వల్ల కాక మరేమిటి? గర్భవతులైన వారు గ్రహణాలను చూడకూడదనడం, ఆదివారం నాడు ఉసిరిక పచ్చడి తినకూడదనడం, రాత్రి వేళల్లో లవణం పేరును – ఉప్పు అనేది తెలుగు మాటే అయినా కూడా – ఉచ్చరించకూడదనీ, (లవణము – బుట్టలోనిది – ఆకు చివరది – చెప్పరానిది అనాలనీ) మొదలైనవన్నీ ఇలాంటివే!

మన ఆలోచనల్లో, మాటల్లో, చేతల్లో మంచి చెడ్డలు రెండూ పెనవేసుకొనే వుంటున్నవి. చెఱుపులేని అచ్చమైన మంచితనమన్నది

మానవతకు ఇంకా అందలేదు. ఎన్నో జన్మలెత్తిన తర్వాత తత్త్వము హెచ్చి, మేళ్లను పెంపొందించుకొని, కీళ్లను తొలగించుకోవాలన్న కోర్కె, పుటములు పడీ పడీ బంగారానికి వన్నె హెచ్చినట్టుగానే మానవుడిలోనూ హెచ్చవుతున్నది. మంచి భావానికి ప్రాబల్యం పెరిగినప్పుడు, ప్రపంచం నాలుగంచులా వున్న ప్రజా సంఘాన్ని పారజూడగలిగినప్పుడు దేశము – జాతి – కులము – అనే వర్గభేదాల్ని ఆశ్రయించిన – ప్రయోజనం లేని – ఇలాంటి ఆచారాలన్నీ తొలగిపోగలవు.

అయిన వాళ్లందరూ ఆనాడు నా వివాహాన్ని గురించీ, పెండ్లాడిన కన్య గురించీ అతృప్తి చెందారు గానీ – అప్పుడు నాకు కూడా కొంత వెఅపు ఏర్పడే స్థితి కలిగినా – కాలం గడవనూ గడవనూ అందరి అభిప్రాయాలూ తప్పని తేలిపోయినవి. అదేమిటో ముందు ముందు తెలియగలదు. అలాంటి శుభ పరిణామాలు కలగడానికి నా పెళ్లి అయిన తర్వాత ఎనిమిది సంవత్సరాలు పట్టింది.

# 14. సాహిత్య జీవనం - అరకుడుపు

నేను మద్రాసు వచ్చిన తర్వాత మైలాపూరులో మా బావగారితో కలిసే వున్నాను గానీ భోజనాదికం మాత్రం పూటకూళ్ల యింట్లోనే చేస్తూ వచ్చాను. ఆ రోజుల్లో మైలాపూరు కపాలీశ్వరుని గుడి దగ్గర రంగమ్మ అనే పుణ్యవతి హోటలు నడుపుతూ వుండెను. ఆమెకు ఒక్కడే కొడుకు. అతడా వ్యర్థుడు. (తల్లికి అందివచ్చినవాడు కాడు.) ఆయమ్మ భోజనాలకు వచ్చేవారికి వారి యిళ్లల్లో కంటె హాయిగా అనుకూలంగా వండి పెట్టేది. ఆమె రెంటాల సుబ్బారావు గారి దూరపు బంధువు. ఆమె భర్త చాలా శ్రోత్రియుడు (నిష్ఠాపరుడు), పుణ్యాత్ముడు అని సుబ్బారావు గారు చెప్తూ వుండే వారు ఆమెను శ్రీ సుబ్బారావు గారు కొంతకాలం ఇంట్లో వుంచుకుని పోషించారట! కాని ఆమె వృద్ధురాలు, స్వతంత్రంగా జీవించాలని అనుకొనేదట. కనుక ఆమె అక్కడి నుంచి విడిగా వచ్చేసి ఒక హోటలు పెట్టుకొన్నది. ఆమె పుణ్య స్మరణం ఇప్పుడు నాకు సంతోషం గొల్పుతున్నది. నా మీద ఆమెకు చాలా వాత్సల్యం. ఆ హోటలుకి వచ్చే వారందరూ కూడా ఆమెను మాతృశ్రీ (తమ తల్లి)గా గౌరవంతో చూసేవారు. కొంతమంది హోటలు నడిపే వృత్తి మంచిది కాదు అని భావిస్తారు. వృత్తి యేదైనా సరే మోసమూ ద్రోహబుద్ధి లేకుండా సాగిస్తే చాలు అది పుణ్యాన్ని సమకూర్చేదే అవుతుంది.

ప్రాచ్య లిఖిత పుస్తకశాలకు పదే పదే సందు దొరికినప్పుడెల్లా వెడుతూ అక్కడి గ్రంథాల్ని చదువుతూ, అపూర్వాంశాల్ని గుర్తిస్తూ, గుర్తించిన వాటిని మిత్రులకు ఉత్తరాల ద్వారా తెలుపుతూ తన్మయంగా విద్యా వ్యాసంగం చేస్తూ వుంటిని. ప్రాచ్య లిఖిత పుస్తక శాలాధ్యక్షులు ఒకసారి లైబ్రరీకి వచ్చినపుడు అక్కడి లైబ్రేరియన్ ద్వారా నా గురించి తెలుసుకొన్నారు.

ఆ సమయంలో అక్కడి తెలుగు పుస్తకాలకు కేటలాగు రాసే గుమస్తా సెలవు పెట్టిపోవడంతో ఆ స్థానంలో వారు నన్ను నియోగించారు. అది టెంపరరీ పోస్టు. అందువల్ల ఆ గుమాస్తా పని మానివేసెను. అతని మీద ఆఫీసు వారికీ అతృప్తి వుండెను. ఆతడు తొలగిన తర్వాత ఆ పోస్టును స్థిరం చేసి అందులో నన్ను నియోగించారు.

ఆ రోజుల్లో పావులూరి మల్లనకవిని గురించి నా మూలంగా కొంత చర్చ రేగింది. శ్రీ వీరేశలింగం పంతులు గారు తమ 'కవుల చరిత్ర' లో రాసిన తీరు సరికాదనీ, పావులూరి మల్లన నన్నయకాలంలో వున్న మల్లనకు మనుమడనీ అక్కడి లైబ్రరీలో వున్న వ్రాత పుస్తకాలను పరిశీలించి పత్రికల ద్వారా నిరూపించే యత్నం చేశాను. అప్పటి మద్రాసు తెలుగు పత్రిక 'శశిలేఖ'్ర వీరేశలింగం పంతులు గారి పక్షాన నిలిచి అనేకులు నా మీద చెలరేగారు. వీరావేశంతో చిలుకూరి వీరభద్రరావు్ర గారు లైబ్రరీ పుస్తకాలను పసికుంకనైన నేను, దుర్బుద్ధితో మార్చేస్తున్నాననీ, నేను రాసినట్టుగా వ్రాత ప్రతులలో లేదనీ, గవర్నమెంటు వారు నన్నక్కడ ఉంచరాదనీ, బాహాటంగానే వ్యాసాలు రాయడం మొదలు పెట్టారు. దాని మీద ఇంకెందరో అటు తిరిగి నను కటువుగా మందలించడానికి పూనుకొన్నారు. శ్రీ వీరేశలింగం పంతులుగారి పేరు ప్రతిష్టలట్టివి గనుక, వారి ఆంధ్ర సాహిత్య సేవ అంత మహనీయమైనది గనుక, వాళ్లందరూ అట్లా ఉద్రిక్తులయ్యారు. ఏవో కొన్ని పొరపాట్లు వుంటే వుండవచ్చునేమో అనే దృష్టితో చూసినవారు లేకపోయారు. అట్లా రాసిన వాళ్లందరూ కూడా సత్యమేమిటో పరిశీలించి తెలుసుకోకుండా రాసినవాళ్లే. వారిలో ఒక్క వీరభద్రరావు గారే సత్యమేమిటో స్పష్టంగా గుర్తించగల్గినవారై వుండీ కూడా, నేనేమీ అక్కడి లైబ్రరీ పుస్తకాలను తారుమారు చేయకున్నా స్పర్థాబుద్ధితో సత్యదూరములైన వ్రాతలు రాస్తూ వచ్చారు.

ఆ రోజుల్లో ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో మహావీరాచార్యుని గణితసార సంగ్రహము అనే గ్రంథాన్ని ప్రొఫెసరు రంగాచార్యులుగారు[౩][22] ముద్రిస్తూ వుండిరి. మల్లన గణితం దానికి అనువాదమని గుర్తించి నేను రంగాచార్యులు గారికి తెలియజేశాను. వీరభద్రరావు గారి వ్రాతలను గూర్చి కూడా వారికి తెలిపాను. అప్పుడు మా వివాదాలన్నింటినీ హైకోర్టు కేసు రికార్డులను పరిశీలించినట్టుగా పరిశీలిస్తూ, శ్రీ వేపా రామేశం గారు నా వాదం సత్యమైనదనీ, ప్రతివాదము శ్రుతి మించి అసంబద్ధంగా సత్యదూరంగా వుందనీ గుర్తించి, నా నౌకరీకే కీడు తేవాలని చూస్తున్న వారి ఉద్రేకానికి రోత పుట్టి, శ్రీ బయ్యా నరసింహేశ్వర శర్మ[౪] గారితో ఒకసారి వారు ముచ్చటించారు. రంగాచార్యులు గారు నాకు అభయమిచ్చారు. ట్రాన్స్‌లేటరు ఆఫీసు వారు నా మీది నిందను ప్రభుత్వం వారి దృష్టికి తెచ్చే స్థితి కలిగింది.

ఇంత జరిగిన తర్వాత డొక్క చెదిరి (బుద్ధి కలిగి) అంతవరకూ నాకు ప్రతికూలంగా వున్న వారొకరు లైబ్రరీ వ్రాతప్రతుల్లో వున్న పాఠాలన్నిటినీ యథాతథంగా శశిలేఖ పత్రికలో ప్రకటించారు. అవి అన్నీ నేను ప్రకటించిన తీరునే నిరూపించేవిగా తేలినవి. అంతేకాక కాకినాడలో కొచ్చెర్ల శ్రీనివాసరావు గారనే[౫][23] వారు పావులూరి గణితపు తాటాకు ప్రతుల్ని సంపాదించి వాటిల్లోని పాఠాల్ని శ్రీ పోలవరం జమీందారుగారు[౬], దురిసేటి శేషగిరిరావు[౭] గారు వగైరాల సంతకాలతో ప్రకటించారు. అవి అన్నీ కూడా నేను చెప్పిన తీరుగానే వున్నవి. అంతటితో ఆ వివాదం అణిగింది. ఒక రోజు "నార్తరన్ సర్కార్సు అసోసియేషన్" మీటింగు (యూనివర్సిటీ కాన్వకేషను తర్వాత) జరుగుతుండగా నేనక్కడికి వెళ్లాను. అక్కడికి వచ్చివుండిన వీరభద్రరావు గారు నా విషయంలో తాము ప్రవర్తించిన

తీరునకు పశ్చాత్తాపం ప్రకటించారు. మిత్రులమైనాము. ఆనాటి సభలో నేను పది పద్యాలు చదివాను. ఆ యేడాదే శ్రీ శొంఠి రామమూర్తి గారు గొప్పగా పరీక్షలో నెగ్గి ఇంగ్లండుకి వెళ్లే యత్నంలో వుండిరి. నా పద్యమొకటి:

ఆంధ్రులత్యంత దేహ బలాఢ్యులనెడు
కీర్తి హెచ్చెను మన రామమూర్తి వలన.
ఆంధ్రులత్యంత బుద్ధి బలాఢ్యులనెడు
కీర్తి హెచ్చెను మన రామమూర్తి వలన.

వీరభద్రరావు గారు ఆనాడు అట్లా పశ్చాత్తాపం ప్రకటించారన్నమాటే కానీ కొన్నేళ్ల తర్వాత మళ్ళీ నాతో వికటంగానే ఉంటూ వచ్చారు. శ్రీనాథుని గురించీ ఇంకేవేవో విషయాలు గురించీ సత్యదూరములైనవే కాక ధూర్తం (మోసపూరితం)గానూ నామీద రాస్తూ వచ్చారు. వాటికేనాడూ నేను బదుళ్లు రాయాలనుకోలేదు. శ్రీ వీరేశలింగం పంతులుగారు పరమ పూజ్యులూ, మహనీయులూ అయినా అహంకారమూ, మమకారమూ అధికంగా గలవారని తర్వాత అర్థమైంది. సాటిలేని మహామహిమాన్వితులూ, పురుషోత్తములూ అయిన గంధిగారు ప్రసిద్ధి కెక్కిన తర్వాత మానవ మర్యాదయే అసాధారణ యోగ్యతను అందుకోగల్గింది. వారి శీలజ్యోతి ముందు ప్రఖ్యాతిగాంచిన పెద్దల ప్రకాశాలెన్నో సూర్యోదయం తరువాతి నక్షత్రకాంతుల వలె వెలవెల లాడవలసినవై పోయినవి.

శ్రీ లక్ష్మణరావు గారు వీరేశలింగం పంతులు గారి నొక రోజు ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు తీసుకువచ్చారు. వారప్పుడు తమ కవుల చరిత్రను సంస్కరించి ప్రకటించే యత్నంలో వున్నారు కాబట్టి – వారికి మాలాంటి వారి సహాయాన్ని అందింపచేసే యత్నంలో నన్ను వారికి పరిచయం చేశారు. పావులూరి మల్లన చరిత్ర విషయాలు వీరేశలింగం గారి దగ్గరా,

నా దగ్గరా తెచ్చి తత్వాన్ని నిర్ణయించగోరారు. అన్ని వ్రాతప్రతుల్నీ చూపించి నా వాదాన్ని తెలిపాను. వీరేశలింగం గారు అవి చూశాక, మరో విధంగానో తామిది వరకు రాసిన విధంగానో మాట్లాడడానికి వీలులేకపోయింది. లక్ష్మణరావు గారు మళ్లీ అన్ని విషయాలు – వీరేశలింగం గారికి వివరించి చెబుతూ "మీరింక ఇట్లా మార్చుకోవలసిందే కానీ ఇది వరకు మీరు రాసినదీ మీ వాదాన్ని బట్టి యితరులు రాసిందీ రెండూ సరికావని తేలిపోయింది కదా!" అన్నారు. దాని మీద పంతులు గారు "నా దగ్గరున్న వ్రాత ప్రతితో అందుకు అనుకూలంగా ఏదో వుండబట్టే నేనప్పుడట్లా రాశాను. రాజమహేంద్రం వెళ్ళి నా దగ్గరి గ్రంథాల్ని బట్టి మళ్ళీ ఆలోచించి నిర్ణయిస్తాను" అన్నారు. లక్ష్మణరావు గారు అందుకొని "ఇన్ని ప్రతులలో వున్నదానికి విరుద్ధంగా మీ వ్రాత ప్రతి వుండదు. ఒక వేళ అలా వుంటే తిన్నగా సమర్థంగా మీ వాదాన్ని నిర్వహించుకోవలసి వుంటుంది" అన్నారు. "పంతులు గారి పట్టుదలను మెచ్చుకొంటూనే వీరేశలింగం గారికి మనమందరమూ సహాయం చేద్దాము. వారి చేతనే వారి కవుల చరిత్ర సంస్కరణాన్ని జరిపిద్దాము" అని లక్ష్మణరావు గారు అన్నారు. నా చేతనయిన తోడ్పాటు చేస్తానన్నాను నేను. వారిద్దరూ ఇంటికి వెళ్లారు.

ఆ[24] తరువాత కొద్ది రోజులు అక్కడ వుండి వీరేశలింగం పంతులుగారు బెంగుళూరికి పయనమై వెళ్లారు. కవుల చరిత్ర మొదటి భాగంలో మాత్రమే చేయవలసిన సంస్కరణలు నేనెరిగినంత వరకూ చేసి, బెంగుళూరికి రాసి పంపించాను. అదొక పెద్ద కట్ట! పంతులు గారు వాటిని ఉపయోగించుకొన్నారు. కాని తమ గ్రంథంలోని ఆయా పట్టుల్లో (సందర్భములలో) నా సహాయాన్ని పేర్కొనలేదు సరికదా గ్రంథ పీఠికలో "శాస్త్రిగారును... తమ గ్రంథాలయములో నున్న పుస్తక భాగములను,

పద్యములను నేను కోరిన వానిని వ్రాసి నాకెంతో తోడుపడిరి" అని రాశారు. వారికేయే విషయాలు గ్రంథ సంస్కరణలు కావలసి వుంటాయో వాటిని నేనే తెలిపి, లిస్టు రాసి, సంస్కరించవలసిన చేర్చవలసిన విధానాలు, పద్యాలు రాసి పంపిస్తే ఆ విషయాన్ని ఇట్లాగేనా స్మరించడం? ఈ సంస్మరణంలో ఫలాని ఫలాని పద్యాలను, గ్రంథాలనూ రాసి పంప వలసిందిగా వారు కోరినట్టూ, మా లాంటి వారు రాసి పంపినట్టూ అర్థం వస్తుంది. నేనన్న వాస్తవార్థమూ రాబట్టవచ్చు. అంతేకాక తమ చిరకాల మిత్రులైన శ్రీ మానవల్లి రామకృష్ణ[25] కవి గారిని కూడా అందులో విమర్శించారు. ప్రబంధ రత్నావళిని గురించి ఉత్తి పుణ్యానికే మళ్లీ కవుల చరిత్ర పీఠికలో నన్నూ తప్పు పట్టారు. వాటినన్నిటినీ వివరించడం రోత! నేను వారికి జాబులు రాస్తే జాలి జాలిగా వాటికి బదుళ్లు వచ్చేవి. ఆ జాబులన్నిటినీ ఇటీవల నేను చించి వేయబోతుండగా తాము జాగ్రత్తగా వాటిని ఉంచుకొంటామని మిత్రులడిగి తీసుకున్నారు[౧౨].

దీనిని ఇంతగా ఇక్కడ ఎందుకు రాశానంటే నాకు వాఙ్మయ రంగంలో క్రీడా వినోదం అనుభవించాలని కొండంత కోరిక చెలరేగుతున్నా మొదటి నుండీ కూడా దానికి ఆటంకాలూ, ఎదురుదెబ్బలూ తరుచూ తగులుతూ వుండి, నిరుత్సాహాన్ని కల్గించేవని చెప్పడానికే. ఆ రోజుల్లో నాలోనూ వాదానికి ప్రతివాదం చేసే ఉత్సాహం కాస్త దూకులాడుతూనే ఉండేది. అయితే నేను స్వర్ణకారుడు బంగారాన్నీ, వెండినీ కరిగించడానికి తన ముందు నిప్పుల కుంపటి నుంచుకొని, మధ్యలో అంగారాలను (నిప్పు కళికలు) పేర్చి, దాని మీద కుండ మూకుడొకటి కప్పి, కుంపటి నిండా ఉముక (ఊక = ధాన్యపుపొట్టు) నింపి ఉంచుకొంటాడు. అవసరమైన మేరకు ఆ అంగారాలను వూదే గొట్టంతో వూదుతూ అగ్ని ప్రజ్వరిల్లేటట్టు చూసుకుంటాడు. ఆ ప్రజ్వలనాన్ని కూడా కప్పిన కుండ మూకుటి మూతకు

లోపడి దాటి పోనీయకుండానే చూస్తాడు కానీ దాన్ని దాటి పైకి ఉముకలోకి ఎగ్రబాకకుండా చూసుకొంటాడు. అది ఉముకలోకి నలువైపులా వ్యాపిస్తున్నదన్నప్పుడు చుట్టూ నీళ్లు పోసి చల్లారుస్తూ వుంటాడు. మొదటి నుంచీ నా స్థితి కూడా సరిగ్గా అట్లాగే జరుగుతూ వచ్చింది. జీవనాన్ని సాగించుకోవడానికి మాత్రమే నా వాఙ్మయసేవ నాకు సాధనమయింది కాబట్టి, అందులోనూ అరకుడుపు సాగేటట్లే (సగం కడుపు నిండే విధంగా మాత్రమే) పని చేయడానికి నా అంతర్యామి నన్ను మెలగనిచ్చింది గానీ అంతకెక్కువగా పని చేయడానికి గానీ, అంతకంటే ఎక్కువగా సాధించడానికి గానీ నాకు అవకాశమివ్వకనే పోయింది.

---

౧. నాటి ప్రముఖ సాహిత్య పత్రిక 'శశిలేఖ'.

౨. శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు

౩. రావుబహద్దూర్ ప్రొఫెసరు రంగాచార్యులు గారు ముద్రించిన మహావీరాచార్యుని గణిత సార సంగ్రహము (....) ఫొటో 1912.

౪. రావుబహద్దూర్ సర్ బయ్యా నరసింహేశ్వరశర్మ గారు (1867–1932) సర్.బి.యస్. శర్మగా ప్రసిద్ధులు. మేధావి, వక్త థియాసోఫిస్టు, లా పట్టభద్రులు. ఆంధ్ర మహాసభ (1913 తొలినాటి బాపట్ల సభ) అధ్యక్షులు. 1914లో కాంగ్రెసు పక్షాన జిన్నా, సిన్హా, లజపతరాయ్ మున్నగు వారితో లండను సమావేశాలలో పాల్గొన్నారు.

౫,౬,౭. మరిన్ని వివరాలు సేకరించవలెను.

౮. శ్రీ శొంఠి వేంకట రామమూర్తి గారు (1888–1964) ఎస్.వి. రామమూర్తి, KCIE CSI – ఉమ్మడి మదరాసు ప్రెసిడెన్సీలో చీఫ్ సెక్రటరీగా (1939–43లో) ఉన్నవారు. మహామేధావి శ్రీ శాస్త్రిగారికి సన్నిహితులు.

౯. ఆనాళ్లలో ఇద్దరు రామమూర్తులు ప్రసిద్ధులు. ఒకరు శొంఠి రామమూర్తిగారు. రెండవ వారు కోడి రామమూర్తిగారు. వీరు జగత్ప్రసిద్ధులైన వస్తాదు. ప్రపంచమంతా తిరిగి బలప్రదర్శనలిచ్చిన కలియుగ భీమ పరాక్రమ కద్వసులు.

౧౦. శ్రీ కొమర్రాజు వెంకట లక్షణరావు పంతులు గారు (......) సుప్రసిద్ధ వాఙ్మయారాధకులు.

౧౧. అపూర్వమైన ఈ సమావేశము ఏనాడు జరిగెనో, అందు పాల్గొన్న వారెవరెవరో పరిశీలించి చెప్పిన వివరాలకు చూ.నా పరిశోధనాత్మకవ్యాసము - మణిమంజరి - 1-1, ఫిబ్రవరీ 1918, ఆ తేదీ యిది - 1917, ఏప్రిల్ 21, శనివారము నాడు సమావేశము జరిగెను.

౧౨. వీరెవరో తెలియరాలేదు. కానీ శ్రీ వీరేశలింగం పంతులు గారు శ్రీ శాస్త్రిగారికి వ్రాసిన ఒక లేఖ మాత్రము మా కడ కలదు. (.....) ఈ లేఖకు ఆధునిక వాఙ్మయ పరిశోధనా రంగంలో ప్రముఖ స్థానమున్నది. (చూ.వివరాలకు మణిమంజరి... సంపుటం : .... సంచిక : .....)

# 15. టైఫాయిడ్

మైలాపూర్ నుంచి ఎగ్మూరు మ్యూజియం బిల్డింగ్స్‌లో వుండిన ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు రాకపోకలు సాగించడం, యెడతెరిపి లేకుండా అక్కడి సంస్కృతాంధ్ర గ్రంథాలను చదవడం, చదివిన గ్రంథాల్లోని ముఖ్య విషయాలకు నోట్సు రాసుకోవడం, కొన్నింటిని అప్పుడప్పుడు పత్రికలకు రాస్తూ వుండడం, ఆ రోజుల్లో నేను చేస్తుండిన పని! రేయింబవళ్లూ విశ్రాంతి నెరుగకుండా శ్రీ రామేశంగారు గ్రంథ పఠనం చేస్తుండడం ఎరిగిన వాడను గనుక నేనూ అట్లా సాధించాలని నా కోరిక. పూర్వ సుకృతం చేత అది వారికి తేలికగా సాధ్యమైంది కానీ నాకు మాత్రం అది అసాధ్యంగానే వుండింది. పగలు చదివిన గ్రంథాల అర్థాలు రాత్రిళ్లు గోచరిస్తూ వుండేవి. నిద్ర తగ్గిపోయింది. నిద్ర పట్టనప్పుడెల్లా లేచి మళ్ళా చదువుతూ వుండేవాడిని. బలహీనత నిరుత్సాహమూ కూడా పెరుగుతూ వచ్చింది. ఇంటికి వెళ్లివద్దామని ఒక నెలపాటు సెలవు తీసుకున్నాను.

సెలవు తీసుకున్న మరునాడే నాకు తీవ్రంగా జ్వరం వచ్చింది. డాక్టరు మందిస్తూనే వున్నా జ్వరమూ పెరుగుతూనే వుండింది. అట్లా నాలుగైదు రోజులు చూసి డాక్టరు నన్ను స్వగ్రామానికి పంపించేయండి అని మా బావగారితో చెప్పెను. నేనా కదలలేని స్థితిలో వుంటిని. మిత్రులయిన పండిత గోపాలాచార్యులు గారికి కబురు పంపాను. వారు వచ్చి చూసి 'నేనూ సుదూరంలో వున్నాను! నిత్య సమీక్షకు సమీపంలో వున్న వైద్యుల దగ్గరే మందు తీసుకోవడం మంచిదేమో!" అన్నారు వారు. అంతదాకా ఇంగ్లీషు వైద్యాన్ని నేను పాటించి యెరుగను. మా నాన్నగారూ ఆయుర్వేద వైద్యులే. వారే ఎప్పుడైనా మాకు జ్వరాలూ అవీ వస్తే ఆయుర్వేద ఔషధాలిచ్చేవారు. నాకు కూడా అంతవరకూ ఎప్పుడూ ఏ తీవ్ర అనారోగ్యమూ

కలగలేదు. "ఆయుర్వేద వైద్యమే పరిచయమున్నది గనుకా మీరు మిత్రులు గనుకా మీరే మందివ్వండి" అన్నాను వారితో. ఆయన అందుకు సమ్మతించి వైద్యం చేయడం ప్రారంభించారు. ప్రతిరోజూ ఆచారప్పన్ వీధి నుంచి మైలాపూర్‌లోని శాలై వీధికి కొన్ని మైళ్ల దూరం కోచిబండి మీద వారు వచ్చి వెడుతూ వుండేవారు.

సాఫీగా విరేచనం కావడానికని వారొక రోజు నాకు ఆవగింజంత మాత్ర ఒకటి ఇచ్చారు. అప్పటికి పది రోజుల నుండీ తిన్నగా ఆహారమే లేదాయె. ఆ మాత్రతో నాకా రోజు నాలుగైదు విరేచనాలయినవి. దొడ్డిలోనుంచి ఇంట్లోకి రావడం నాకు తెలుసు. ఆ తరువాత ఏమైందో తెలియదు. స్మృతి తప్పి పడిపోయాను. కొంత సేపటికి స్మృతి వచ్చినట్లయింది. నాడీ చూసుకున్నాను. నిమిషానికి ఏ రెండువందల సంఖ్యకు పైగానో నాడి కొట్టుకొంటున్నట్లుంది. గుండెలదిరి యెగిసి పడుతుండెను. దగ్గరగా వున్న రామేశంగారిని పిలుచుకువచ్చారు. వారు నాడీ చూసి అపాయస్థితిలో వున్నట్టు గుర్తించి వెంటనే డాక్టరు నంజుండరావు గారికి చీటీ వ్రాసిచ్చి మనిషిని పంపారు. నా స్థితి గందరగోళంగా వుంది. అప్పుడే కాచిన పాలు రెండు అళాకులు (అప్పటి కొలమానం – అళాకు = సుమారు 200 మి.లీ.) తాగేశాను. పది నిమిషాలకు ప్రాణం అందుకున్నట్లుగా తోచింది. అంతలోనే నంజుండరావు గారూ వచ్చి పరీక్షించారు. 'తీవ్రమైన టైఫాయిడ్ జ్వరం. వెంటనే యీ మందులు తెచ్చి యివ్వండ' ని చీటి రాసిచ్చారు. గుడ్విన్ కంపెనీ వారి మందులవి. ఆ మందు తాగిన పది నిమిషాలలోనే ప్రాణం కుదుట పడింది. జ్వరం 22 రోజులుండి తగ్గుముఖం పట్టింది. ఆ మధ్యకాలంలోనే కొన్ని ఒడిదుడుకు స్థితులూ కలిగినవి. ఏమి కలిగినా అప్పుడు వారిచ్చిన మందు వెంట వెంటనే పనిచేస్తూ నాకు గుండె నిబ్బరాన్ని కలిగిస్తూ వచ్చింది.

ఒక రోజు విరేచనములాగడానికి ఏదో మందిచ్చి పూర్వం వాడిన మందులు పుచ్చుకోవద్దన్నారు. ఆనాడు నాకు నిస్త్రాణ (బలహీనత) హెచ్చింది. డాక్టరు రాగానే "రోజూ తాగే మందులు పుచ్చుకోవద్దన్నారట! అవి తాగగానే నాకు పుష్టి కలిగేది. ఇవాళ అట్లా లేదు" అన్నాను. ఆయన నా వీపు చఱిచి, నవ్వి, "అయితే మళ్ళీ తీసుకోండి" అన్నారు. జ్వరం తీసిన తర్వాత అవి చికెన్ బ్రాత్ బ్రాందీలో కలిపినదొకటి, ద్రాక్షాసవము వంటిదింకొకటి అని తెలిసింది. ఆ తరువాత అవి నాకు రోత కలిగించినా అప్పటి దాకా అవే నాకు అమృతంతో సమానంగా తోచినవి.

అప్పటి జ్వర తీవ్రతలో నా జీవితాన్ని గూర్చిన సంశయం ఏర్పడి మా బావగారు జాబు వ్రాయగా నా మిత్రులు శ్రీ సుసర్ల కుమారస్వామి శాస్త్రిగారు, మా మామగారు, మా తల్లిదండ్రులు, అన్నగారు, మద్రాసు వచ్చారు. తీవ్రానారోగ్యంతో వున్న ఆ రోజుల్లోనే తమ కుమార్తె రజస్వలయైనట్లు మా మామగారు లేఖ రాశారు. ఆ స్థితి మా వాళ్లకు మరింత వ్యాకులాన్ని (చింత) కలిగించింది. నెమ్మదిగా జ్వరం తగ్గింది. ఆరోగ్యవంతుడనయ్యాను. నా స్థితి విని విచారించి నంజుండరావు గారు ఆర్నెల్లు లీవుపెట్టి యింటికి వెళ్లి వుండమన్నారు. ఇతర అనారోగ్య సమస్యలేవీ లేవు కాబట్టి వడివడిగా ఆరోగ్యం కోలుకోగలదనీ – టైఫాయిడ్ జ్వరం వచ్చి తగ్గిన తర్వాత నూటికి తొంభైమందికి సహజంగానే సంపూర్ణారోగ్యం పెంపొంది, జ్వరానికి పూర్వం వుండిన అనారోగ్య వాసనలు కూడా తొలగిపోయి విజృంభణముతో వుండగల్గుతారనీ, సంపూర్ణారోగ్యమూ, బలమూ కలిగి మూడు నెలల తర్వాత గృహస్థ స్థితిని పొంది ఆరు నెలల్లో సకుటుంబంగా మద్రాసుకి తిరిగి వచ్చేద్దువు గాని అనీ అన్నారు.

---

౧. ప్రపంచ ప్రఖ్యాతిని గాంచిన అమెరికన్ మందుల తయారీ సంస్థ.

# 16. వేంకటేశ్వరస్వామి దర్శనం

అప్పటి నా జీవితాశలు రెండు. మా తల్లిదండ్రులు ఎప్పుడో మొక్కుకున్న శ్రీ వేంకటేశ్వరస్వామిని[26] దర్శించడం ఒకటి. నాకు నా చిన్నతనం నాటి నుంచీ కూడా దేవాలయాలకు వెళ్లడంగానీ, అక్కడ స్వామి దర్శనం కలుగుతుందని నమ్మడంగానీ, అక్కడి విగ్రహాలకు అర్చన మొదలైనవి జరపడం గానీ ఇష్టం లేని ముచ్చటే. తిరువళిక్కేణిలో గానీ, మైలాపూరులో గానీ గుడిలోకి స్వామి దర్శనానికై యెన్నడూ నాకు నేనై వెళ్లి యెరుగను. కాని అప్పుడప్పుడేవో నా మనోభావాల్ని పద్యాలలో తిరువళిక్కేణి పార్థసారథి స్వామి స్తుతిగా వెల్లడిస్తూ వుండేవాడను. అట్టి నాకు తిరుపతి వేంకటేశ్వర స్వామిని దర్శించాలన్న వేడుక అంత తీవ్రంగా ఎందుకు కల్గిందో అప్పుడు నేను గుర్తించలేకపోయాను. "కలౌ వేంకట నాయకః" అన్న శ్లోకాంశం నన్ను ఆకట్టుకొన్నది.

మేమందరం మొక్కు చెల్లించుకోడానికి – మొక్కు ఏమిటంటే చిరంజీవి మా తమ్ముడికి శంకరునకు ఉపనయనం స్వామి సన్నిధిలో చేయటానికి – బయలుదేరాం. మద్రాసు నుంచి బయలుదేరి తిరుపతి రావడంలో నిజంగా నేను స్వామి సన్నిధికే వస్తున్నంతగా ఉప్పొంగి పోయాను. అఖిలాండనాయకుని, విశ్వమును, విష్ణువుని, వషట్కారుని, భూత భవ్య భవత్ప్రభువుని కళ్లారా చూడబోతున్నాను ధన్యుడనవుతున్నాను అదిగో ఇదిగో చూడబోతున్నాను, అని లోలోపల మురిసి పోయాను. అప్పుడే తీవ్రమైన అనారోగ్యం నుండి విముక్తుడనయి బలహీనంగా వున్నా ఆ ఉత్సాహం నెట్టుకొచ్చి స్వామి పైని పద్యాలేవో రాస్తూ వచ్చాను ప్రయాణంలో. తిరుచానూరులో ఉపనయనం జరిగింది. స్టేషను నుంచి యెండలో ఆ వూరు చేరుతుండగా మా అన్నగారి కుమార్తెకు పసిబిడ్డకు, తీవ్ర జ్వరం

వచ్చింది. జ్వరం తగ్గేదాకా నేను పద్యాలతో స్వామి స్తుతి చేస్తూనే కూర్చున్నాను. జ్వరం కొన్ని గంటల్లో తగ్గిపోయింది. పద్యాలు ఎన్నో రాశాను. వాటిలోంచి ఒకటి రెండు :

చట్టని మేను కాలె, గనుచూడ్కి వికారము దోచె, నన్నకుం
గుట్టది, యారుమాసముల కూన, యిదెక్కడి వేకి సోకొ మా
మొట్టల నాలకింపుము నమో నమ! చప్పున నీకు నప్ప నా
చిట్టన చీదకుండ సుఖ సిద్ధికి దార్పుమి, బిడ్డ దేర్పుమీ.

**జ్వరం తగ్గిన తర్వాత :**

అంకిలి లేని భక్తి మనసార దలంచి నమస్కరించి మా
సంకటమార్పవే యన వెసన్ సుఖమిచ్చి యనుగ్రహించి తో
కింకర కల్పకంబ! పరికించితి నీ మహనీయతన్ "కలౌ
వెంకట నాయకో" యను సువిశ్రుత సూక్తి యథార్థ భావమున్.

ఆనందంతో అందరం కొండ ఎక్కాము. మా నాయనగారు వృద్ధులు గనుక, అంతకు ముందే చాలా సార్లు స్వామి దర్శనం చేసుకొన్నవారు గనుక, దిగువ తిరుపతిలోనే అప్పటికి కొంత కాలం క్రిందటే కట్టిన 'పుష్పతోట' సత్రంలో వుండిపోయారు. స్వామి దర్శనానికై ఉవ్విళ్లూరుతూ వెళ్లానే కానీ అక్కడ నాకెంత తంటాలు పడినా స్వామిమూర్తి దర్శనం కాలేదు. మద్రాసు నుంచి మహంతు గారికి వారి దగ్గర నుంచి కొండ మీది ఉద్యోగులకూ లేఖలు తీసుకువెళ్లాం కాబట్టి అక్కడ కావలసిన వసతులన్నీ కలిగాయి. మా వాళ్లందరూ కొంత అలజడీ, త్రొక్కటమూ చెందినా స్వామి దర్శనం బాగా చేసుకొని తృప్తి చెందారు. నేను చాలా సేపు స్వామి మూర్తిని చూసే యత్నం చేశాను. కాని నా ప్రయత్నమూ, కోరికా నెరవేరలేదు.

ఎంత ప్రయత్నించినా చెదిరి చెదిరి చీకటే కానవచ్చింది కాని నాకక్కడ స్వామి మూర్తి గోచరించలేదు. చాలా నిరుత్సాహం చెందాను. నేనెంత దుష్టుడనో అని దురపిల్లాను (దుఃఖించు). పాపిష్ఠుడనని పలవించాను (విలపించు). చివరకు ఏమీ తోచక ఏడుపొచ్చింది. నా అనారోగ్య దుర్బలత్వం కారణంగా అక్కడి మూర్తి దర్శనానికి కళ్లు మిరుమిట్లు కొన్నవేమో, స్వామికీ నాకు మధ్య దివ్వెలు వెలుగుతుండడం చేత అవి అడ్డం వచ్చి మూర్తి దర్శనం కాలేదేమో, నా పాప కర్మల చేతనే దర్శనం కలగలేదేమో అనే పరిపరి విధాల ఆలోచనలు రేగాయి. వాటి వాటికేవేవో అపవాదాలూ తోచాయి. ఇట్లా ఏమిటో స్వామి గోచరించకపోయెనే అన్న ఆరాటం మాత్రం నన్ను వదలలేదు.

ఇప్పుడీ గ్రంథంలో ఇది రాస్తున్న నాటికి ఇంచుమించుగా నలభై యేళ్లకు పూర్వం జరిగిన సందర్భమిది! అంటే 1910వ సంవత్సరము నాటిదీ వృత్తాంతమన్న మాట! తరువాత 1930 నుంచీ తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామి గూర్చిన తత్వం నాకు బోధ పడుతూ వచ్చింది౧. 1949 నాటికి ఇంకా ఎన్నో విషయాలు గోచరించినవి౨. వాటిని ఆయా సందర్భాల్లో సక్రమంగా వివరిస్తాను.

---

౧ మరియు ౨ :

ఈ విషయాలను శాస్త్రిగారు గ్రంథంలో వివరించలేదు. అప్పుడప్పుడు వారి ప్రార్థనానంతర ప్రసంగాల్లో చెప్పిన విషయాలను బట్టి మేమిట్లా భావించాము. 1910లో వారికి గుడిలో స్వామి దర్శనం కాలేదు. 'కలౌ వేంకట నాయక' అనే వ్యాసంలో (చూ. ఆంధ్రప్రభ వారపత్రిక 23-10-85) కొంత వివరించితిమి. అప్పటికి వేడిన వారికి ఆరోగ్య భాగ్యాన్ని ప్రసాదించే తమ గృహ దైవతమన్న యెరుక మాత్రమే. క్రమంగా వారికి 1916లో ఆరోగ్య భాగ్యాన్ని ప్రసాదించిన కుంభకోణం మాస్టర్ సీవీవీ గారి ప్రత్యక్ష స్వస్వరూప దర్శనం తరువాతే గుడిలో తమకు 1910లో గోచరించిన చీకటికి సమన్వయం తెలిసింది. యోగ సంబంధం ఎరుకకు వచ్చింది. 1930 నాటికి వెల్లడియైన విషయము నాడీకారుడైన భుజందరు ఋషి

యొక్క శక్తి (అనంతర వర్తమానంలో మాస్టర్ శిష్యుడైన ఎన్.ఆర్.బి. వేంకటాచలపతి నాడీ కారుని అంశగా గోచరించుట. 1949 నాటికి ఆలయాలలోని దివ్యశక్తులన్నీ మాస్టర్ తత్వానికి లోబడి పనిచేసే శక్తులనీ, యోగసిద్ధి జరిగే నాటికి అట్టి శక్తులన్నీ బహిర్గతములై మాస్టర్ శక్తిలో విలీనం కాగలవనీ గోచరించుట. అందుకే మాస్టర్ సీవీవీ గారు మిత్రులు రాజారావు గారితో తిరుమలకు వెళ్ళినప్పుడు మాస్టరుగారు స్వామికి నమస్కరించలేదు. రాజారావు గారు నమస్కరించబోగా మాస్టరు గారు వారించుటతో రాజారావు గారికి చేతులు లేవకపోవుటతో జరుగుటకు కూడా హేతువు అదే అని తెలియుట. 'పదేళ్ళు శ్రద్ధతో విడువకుండా యోగసాధన చేస్తే యోగసిద్ధి చేకూరి నీవే అన్ని కార్యములు నెరవేర్చుకోగలవు' అని మాస్టరు గారు శాస్త్రిగారితో పలికిన మాటకు, చూపిన అనుగ్రహమునకు అదే అర్థమన్న సమన్వయము గోచరించుట. అన్నమాచార్యోత్సవాల సందర్భంలో కొండకు వెళ్లినపుడు స్వామి వారిని మిత్రమా అని సంబోధించుట, ఆలయంలో ఏకాంతగోష్ఠి జరుపుట ఆనాటి వారెరిగిన సమాచారమే. నాడీకారుడు మాస్టరుగారిని వర్ణిస్తూ 'ప్రణుత నిజజనాన్ స్వాత్మతుల్యాన్ కరోతి' అన్నట్లే అన్నమాచార్యులును స్వామి వారిని కీర్తిస్తూ "నిన్ను గొలిచిన వారిని నీయంత వాని జేతువు" అనుటయు మాస్టర్ సీవీవీ వారి యోగలీలా విశేషమే అనదగును.

# 17. మొదటి రాత్రి

నాకు టైఫాయిడ్ తగ్గి ఆరోగ్యం లభించేనాటికి జీవిత వాంఛలు రెండు కలవంటిని కదా! మొదటిది శ్రీ తిరుపతి వెంకటేశ్వరస్వామి దర్శనం. అది మొదట అగమ్య గోచరంగా వుండడం. ఈ నాటికి చాలా విషయాలు తెలియరావడం రేఖామాత్రంగా చెప్పాను కదా! ఇక, రెండోది వివాహమయింది గనుక అచుంబిత ప్రక్రియ (ముట్టియెరుగని ముచ్చట) యైన స్త్రీ సుఖాన్ని అనుభవించాలనుకోవడం. అదీ యేదో వేంకటేశ్వర స్వామి దర్శనం లాగే అపూర్వమైన అద్భుతమైన అతిలోకానందాన్ని కల్పించేదిగా వుంటుందనుకొంటూ వువ్విళ్లూరుతూ వుంటిని. ఈ రెండూ నెరవేరితే నా జీవిత ప్రయోజనం పూర్తిగా లభించినట్టే అనుకొన్నాను.

తిరుపతి నుంచి యింటికి వెళ్లిన వెంటనే నా ఆరోగ్యాభివృద్ధి క్షణ క్షణ విజృంభణమయింది. మా అమ్మానాన్నా మద్రాసు నుంచి వచ్చేదాకా ఇంచుమించు ఒక పక్షం రోజులు నా మిత్రులైన శ్రీ సుసర్ల కుమారస్వామి శాస్త్రి గారి[27] యింట్లోనే ఉన్నాను. వారూ, వారి యిల్లాలు శ్రీమతి రామమ్మ గారు నన్ను బిడ్డను చూసినట్టు చూచుకొన్నారు. ఆకలి నాకు అమితంగా కలుగుతుండేది. ఎక్కువగానే భోజనం చేసేవాడిని. దృష్టి తగులుతుందేమోనని శ్రీమతి రామమ్మ గారు నాకు చాటుగా ఎవరూ చూడకుండా వుండేటట్లు భోజనం వడ్డిస్తూ వుండేవారు. ఆ దంపతులిద్దరూ ఇప్పుడు లేరు. వారి పుణ్యగతికై తలపునకు వచ్చినప్పుడెల్లా తపిస్తూ వుంటాను. కుమారస్వామి గారిని నేను నా భృక్తరహిత తారక రాజయోగానుష్ఠానంలోకి తర్వాత 1917 వ సంవత్సరంలో చేర్పించాను. కాని వారు దుర్భలమైన చిత్తవృత్తి కలవారు కావడం చేత శ్రద్ధాళువులు కాలేకపోయారు. దుస్సహవాసాలకు మరిగి సంపదనూ, ఆరోగ్యాన్నీ కూడా

పూర్తిగా చెడగొట్టుకున్నారు. వారి భార్యగారు ముందుగానూ 1928 ప్రాంతాలలో కాబోలును వారూ చనిపోయారు.

కుమారస్వామి గారు చనిపోయిన పదోనాడు నేను ధ్యానంలో కూచుండగా నా కళ్లయెదుట స్పష్టంగా గోచరమై చిరునవ్వు నవ్వుతూ "నీ మంచి సహవాసాన్ని నీకు దూరంగా వుండడం చేత నేను చాలా కోల్పోయాను. నీ మాట వినకుండా చెడు సహవాసాల్లో చిక్కి చెడ్డాను. శారీరక సుఖాలు నన్ను అలా ఆకట్టుకుని పెడమార్గాన్ని పట్టించినవి. చక్క జేసుకోడానికి సాధ్యం కాని తుచ్ఛ శరీరం తొలగిపోయింది ఇక నీ గోష్ఠిలో నేను సదా కుదుర్కొని వుండగలను" అని సిగ్గుతో పలికి నాతో పాటు ధ్యానమగ్నుడై కూర్చోవడం కానవచ్చింది. శీలం పవిత్రం కాకున్నా ఉపకార ప్రవృత్తి, ఆతనిలో అసాధారణంగా వుండేది. కష్టాలలో వున్న వారికెందరికో అతడు ఉపకారం చేసేవాడు. తన కలిమినంతా అందుకోసం ధారపోశాడు. ప్రధానంగా నాపై చూపిన సహృద్భావ వాత్సల్యాలకూ, ఆ సుగుణాలకే ఆ జీవుడు ఉద్గతి (సద్గతి) పొందును గాక అని తపిస్తూ వుంటాను.

వాళ్లింట్లో పదిహేను రోజులకన్నా ఎక్కువ కాలమే నేనప్పుడున్నాను. అంతలో మా తల్లిదండ్రులూ తోడివారు అందరూ ఇల్లు చేరుకున్నారు. మూడు నాలుగు నెలలకు నేనంతకు ముందెన్నడూ పొందనంత ఆరోగ్యాన్ని పొందాను. నా భావాన్ని పసికట్టిన వారు కావడంతో మా తల్లిదండ్రులూ, అక్కగారూ పునస్సంధాన ముహూర్తం నిర్ణయించి తెలుపండని మా అత్తవారిని కోరారు. ఇంకా కొంతకాలం ఆగవచ్చుననుకొన్న మా కష్టసుఖాలనాలోచించి మా మామగారూ ముహూర్త నిర్ణయానికి అంగీకరించారు. అంతకు కొద్ది రోజులు ముందుగా మా సోదరికి కూడా

పుసస్సంధాన (శోభన) ముహూర్తం నిర్ణయించారు.

అంతదాకా బులపాటం చెందుతున్న నేను ముహూర్త నిర్ణయం జరిగినప్పటి నుంచీ చాలా మానసిక వేదనకు గురి అయ్యాను – నా వ్యాకులపాటుని గమనించారే కానీ కారణమేమిటో ఎవరికీ తెలియదు. మొదట్లో నాకూ కొంత అర్థమయేది కాదు. కారణం తెలియకుండానే వ్యాకులత పెరిగింది. వివాహము నాటి నుండీ నా జీవితం కష్టాల పాలవుతూండడం, అందుకు కారణం పెళ్లాడిన పిల్ల జాతకం పొంతనాలు కలవలేదని మా వాళ్ళు చీకాకు పడుతూండడమే దీనికంతా మూల కారణమనీ నాలో నేను ఎంతో తర్కించుకోగా తేలిన సమాధానం. నా పెళ్లి సమయంలో వధువు జాతకం చూపగోరితే మా మామగారు తాను జాతకం రాయలేదని చెప్పేశారు. అందువల్ల దానిలోని గుణదోషాలేవో గుర్తించే వీలు లేకుండా పోయింది. అసలు నాకూ జాతకాల పరిశీలనం మీద అంత గురీ లేదు. "యస్యాం మనశ్చక్షుషోర్నిబంధస్తస్యా మృద్ధిః' అన్న ధర్మ సూత్రం నాకు నచ్చి నేను మనసారా ప్రేమించే ఆ పిల్లను పెళ్లి చేసుకున్నాను కాబట్టి నా కప్పుడు ఏ కొరతా అనిపించలేదు.

అప్పటి వరకూ ఆ వధువు నాకు ధర్మపత్నిగా నాతో సంసార యాత్ర సాగింపబోతోంది సుమా అన్న భావనే కానీ అంతకెక్కువ యోచనలు లేవు. ఇక మీద ఆ వధువు మా యింటికి రానున్నదనీ వివాహ ప్రయోజనం ఇక మీదనే అనుభవించబోతున్నామనీ, నా హృదయాన్ని నే నెరుగుదు ననుకొన్నాను కాబట్టి ఆమె హృదయాన్ని నా కర్పించి నా హృదయాన్ని స్వీకరిస్తుందో, తన హృదయాన్ని నాకర్పించక నా హృదయాన్నే హరిస్తుందో ఇంకేమిస్తుందో అనీ, అంతదాకా నన్ను ఎంతో ఎక్కువగా ప్రేమిస్తున్న మా తల్లిదండ్రులకు ఆ పిల్ల ప్రేమపాత్రం కాగలుగుతుందో లేదో అనీ, ఆ పిల్ల

వాళ్ళనెంత ఏడిపిస్తుందో అనీ, నా అన్నదమ్ములకూ, అక్కచెల్లెళ్లకూ, నాకూ గల సౌమనస్యం (సాన్నిహిత్యం) ఇక ముందు ఏమి కానున్నదో కదా అనీ నా భీతి. క్షణ క్షణానికీ స్పష్టాతిస్పష్టంగా నాలోని విచారం పెరుగసాగింది. కాక, అంత వరకూ మా తలిదండ్రుల చాటుననే నా జీవితం గడుస్తూ వచ్చింది. సర్వభారమూ వారు మోస్తుండగా నేను వారి అండన నిర్భయంగా వుంటూ వుంటిని. నా దృష్టికి ఇక వారు తప్పుకోబోతున్నట్లు నేనొక వంశవృక్షాన్ని వెలయించి ఆ స్థానాన్ని ఆక్రమించబోతున్నట్లు తోచేది. నేను అంత నిర్వహించగలుగుతానా? మా తల్లిదండ్రులున్నంత దాకా వారి చాటువాడినై వుండడమే మంచిది కదా! నేను ఏర్పరచబోయే వంశ వృక్షం మా తల్లిదండ్రులు వెలయించిన వంశ వృక్షంతో పొంది పొసగి (అనుసరించి) లోబడి వుండవలెను కదా! ఏమి కానున్నదో! నా జీవిత మార్గం మంచికో చెడుగుకో దారి తొక్కనారంభించే సన్నివేశం ఎదురైంది. ఎందరి కుటుంబాలో యిలాంటి సన్నివేశాల్లోనే తప్పుదారిని పట్టినవి వున్నవి. ఇంక ఎందరి కుటుంబాలో మంచి దారిని పట్టినవీ వున్నవి. ఇటువంటి చింతతో నా ముఖంలో అశాంతి లక్షణాలు స్పష్టంగా కనపడుతూ వుండేవి. అది గమనించి మా అమ్మానాన్నలూ, అక్కగారు బాధపడుతూ వుండే వాళ్ళు.

సంతోషంగానీ, సంతాపం గానీ అంతరంగాన్ని కలవర పరుస్తున్నప్పుడు దాని చేష్ట స్పష్టంగా సహజంగా వున్నదున్నట్టుగా కొందరి ముఖాల్లో కనిపిస్తుంది. కొంత మంది లోపలి సంతోషాన్ని దాచి వుంచుకొని – ముఖంలో ఆ సంతోషాన్ని వ్యక్తం చేయకున్నామానె గానీ – ఏవో ప్రయోజనాల కోరి పైకి మాత్రం విచారాన్నే ప్రకటించగలుగుతూ వుంటారు. ఎంత దుఃఖ కారణం కలిగినా దాని బలాన్ని వివేకంతో తగ్గించుకుని దాన్ని

లోపల కూడా భరించకుండా వుండడం మంచిదే కానీ లోపల కుములుతూ పైకి నవ్వు తెచ్చుకోవడం మాత్రం రోతే! అలాంటి నవ్వు వెఱ్ఱి నవ్వు అవుతుంది కానీ తియ్యని నవ్వుగా మాత్రం తోచదు. అప్పుడు నవ్వే ప్రయత్నమే వుంటుంది కానీ దాని సత్ఫలితం మాత్రం కలుగదు.

తాను ప్రేమించే వారెవ్వరు గానీ తప్పు చేసినట్టు తాను భావించినపుడు, వారిని సరిదిద్ద గోరినప్పుడు, ఆయా వ్యక్తుల వివేక సంస్కారాన్ననుసరించి కోపసూచనలు చేయడమో, గర్జించడమో, తిట్టడమో, కొట్టడమో కూడా జరుగుతూ వుంటుంది. అందులో అంతరంగాన అవ్యక్తంగా, స్థాయిగా, అనురాగమే నెలకొని వుంటుంది. అలాంటప్పుడు చప్పున కోపం రేగవచ్చు. కోప సూచన మొదలుగా కొట్టడం తిట్టడం దాకా వివేక పరిపాకానుసారంగా ఒక చేష్ట జరుగుతుండగా అంతరంగం కేసి చూసుకొన్నప్పుడు అక్కడ అనురాగరేఖలు కానవచ్చి నవ్వుతూ, అవి తననే కోపిస్తూ, తిడుతూ, కొడుతూ వున్నట్లు అనిపించి ఇక ఇలాంటి చేష్టలు చేయకుమా అని మందలించడం అంతరాత్మ పరిశీలనానుభవం కల వారందరికీ గోచరిస్తుంది. చెలరేగిన ఆ కోపోద్రేకం ఆ మానవుని అంతరంగం, తనలో హాయిగా వున్న అనురాగం, శరీరాణువుల్లో అంతటా నిండుకోవడానికి చేసే యత్నంలో తనకు విరుద్ధమైన, తనలో వుండకూడని, కోపపు బండాలాన్ని (సామగ్రిని) సమయమెరిగి వెడలగొట్టినపుడు చెలరేగి బయటపడిన దాన్నిగానే గుర్తింప వీలవుతుంది. శరీరాన్ని చుట్టి వుండే ఆవరణం దాకా అది ఎఱ్ఱని పొగలతో చెలరేగి దిద్దుబాటు చెందవలసిన వారిని తాకి వారి వారి ఆనుకూల్య – ప్రాతికూల్య – సౌమనస్య – వైమనస్య, ప్రాబల్య – దౌర్బల్యాదుల కనుగుణంగా తాను చేయగలిగిన మంచిని చేసి శాంతిస్తుంది. ఈ విధంగా అప్పుడప్పుడు లోపల నిలువ వుండిపోయిన

కోపపు సరుకులో, ఎంతో కొంత చెడు వస్తువే కాబట్టి, యిక నిలువ వీలు కాక ఖర్చు అయి పోగా పోగా లోపల స్థాయిగా వున్నది ప్రేమే గనుక అదే శాశ్వతమై పెంపొందుతూ వుంటుంది. దీనిని ఆత్మాన్వేషణపరులు గుర్తింపగల్గుతుంటారు. అంతరంగంలో స్థాయిగా అనురాగమూ ప్రేమా వున్న సందర్భాలను గురించి రాసిందే ఇది.

ఆత్మాన్వేషణపరులు ఇలా లోనికి చూస్తూ పోగా పోగా ఇక పోవడానికెక్కడా ఎడములేని చివరి సరిహద్దులోగల చోటు ప్రేమైకమయం గానే వున్నదని తెలుస్తుంది. ప్రేమ అన్నది సత్పదార్ధము. కాబట్టి ఆ స్థానంలో ప్రేమేతరమైన ద్వేషవాసనలు కూడా వుండవు. అలాంటి ప్రేమనిధిని చేరుకోడానికి లోనికి పోనూ పోనూ ప్రేమేతర పదార్థం క్రమంగా పలచబడుతూ సనసన్నగా దిగనాసిల్లి పోతుంది. ప్రేమ పదార్థం చిక్కబడుతూ దాని విజృంభణం కూడా అంతరంగంలోనే కాక బహిరంగాన కూడా 'అంతర్బహిశ్చ' (లోపల-బయట) క్రమక్రమంగా నిండారుతుంది. అసలు తత్వాన్వేషి సముద్రమథనకథగా సత్సంకల్పపు మందర పర్వతాన్ని శరీర సముద్రంలోకి దింపి శరీరాన్ని మథించగా లోనుంచి మంచి చెడ్డలు రెండూ రేగుతూ, చెడుగులను తొలగద్రోసికుంటూ మంచిని గుర్తించి స్వీకరిస్తూ అనుభవానికి తెచ్చుకుంటూ రాగా చివరకు అమృత లాభం చేకూరుతుంది. ఇందుకు మూలాధారం కూర్మమవుతూ అన్ని చర్యల్నీ నియంత్రిస్తూ నిలుస్తుంది.

గార్హస్థ్యం : అప్పుడే గార్హస్థ్యం అనుభవిస్తున్న మా బావగారిని నా దుఃఖకారణమేమిటో కనుక్కోమన్నారట మా వాళ్లు. ఒక రోజు నిద్రలేచి వూరి పొలిమేరలో వున్న మా పొలానికి వెళ్లి అక్కడి మా మంచినీళ్ల బావి దగ్గర కాలకృత్యాలు తీర్చుకొని స్నానానికుపక్రమిస్తూ తాటి చెట్టు చాటు

కెళ్లి దుఃఖిస్తున్న నన్ను వెనుకతట్టు నుంచి వచ్చి పట్టుకుని మా బావగారు దుఃఖ కారణమేమిటని అడిగారు. ఏమీ లేదన్నాను. ఒకవేళ వున్నా అది చెప్పినా మీరు దాని విలువను గుర్తించలేరు అన్నాను. ఆయన ఏదో నాలో గొప్ప దోషం వున్నదనుకొని తీవ్రంగా చకితుడై (స్పందిస్తూ) పదే పదే అడగడం మొదలుపెట్టెను. నాకేదో యోగ్యతాలోపభీతి వున్నట్లు ఆయన అనుమానిస్తున్నాడని నాకు తోచింది. ఇక దాచకూడదని వున్నదున్నట్లు చెప్పేశాను. మా తల్లిదండ్రుల అస్తమయం గోచరిస్తున్నట్టున్నదన్నమాట చెప్పాను. ఆ మాట మా తల్లిదండ్రులకు చెప్పవద్దని వొట్టు వేయించు కున్నాను. అంతా విని 'అయ్యో! ఇదా నీ యేడుపు!! అని ఆయన పగలబడి నవ్వెను. 'లోకసాధారణమైన భావాలన్నిటినీ నీ తల మీదనే విరిగిపడినట్టుగా భావించి అఘోరిస్తావెందుకు?' అని తెగడెను (తప్పు పట్టెను). ఆ తరువాత మా తల్లిదండ్రులతో ఉచితమైనంత వరకూ చెప్పి వారికి వూరట కలిగించెను. రాగ విరాగాలు రెండూ అప్పుడు నాలో రేగినవి.

ముహూర్తం జరిగింది. తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామి దర్శనం వంటిదే అదికూడా అయింది. వాత్స్యాయనాదుల కామసూత్ర గ్రంథాలేవేవో చదివానే కానీ అది పుస్తక విద్యే కానీ అనుభూతి లేనిది! నాకు నర్మసచివుడు (ఆంతరంగికుడు) మా బావ మర్నాడు శుష్కేష్టితంత్రంగా (మాదిరి) తెలియజెప్పిన తర్వాత కృతార్థుడనైనాను. ఇంజనియరింగు, వైద్యము మొదలైన అనేక విద్యల్లో పుస్తక పఠన మాత్ర పండితులైన ఉద్యోగులెందరో ఉద్యోగంలో చేరిన తర్వాత కార్యనిర్వాహణం ఏమీ తెలియనివారై మెల్లమెల్లగా చేతికింద పనిచేసే చిన్న ఉద్యోగులను చూసి తెలుసుకొని చతురులు కావడం చూస్తూనే వున్నాం కదా!

౧. శ్రీ శాస్త్రిగారి బాల్యమిత్రులు సుసర్ల కుమారస్వామి శాస్త్రిగారు. వారి దయాగుణము, పరోపకార పరాయణత్వము శ్రీ శాస్త్రి గారి హృదయము నాకర్షించినవి. ఆ దంపతుల పుణ్యగతికి వారు తపించిరి.

౨. శ్రీ కుమారస్వామి శాస్త్రిగారికి మాస్టర్ యోగ ప్రవేశము కల్పించుటలోని ఆంతర్యమిదే.

౩,౪. శ్రీ కుమారస్వామి శాస్త్రిగారి నిర్యాణవార్త కృష్ణా పత్రికలో పడినది. కళ్లేపల్లి వరదల బీభత్సంలో శ్రీ కుమారస్వామి శాస్త్రిగారు ఆర్తులను ఆదుకొన్న తీరు అసాధారణము.

౫,౬. శ్రీ శాస్త్రిగారి దృష్టిలో జాతకాల పొంతన చూడటమన్నది గుణదోషాలను గుర్తించేటంత వరకే. మనస్సు దృక్కు కలిసినచోట ప్రేమ పెరుగుతుందే కానీ తక్కిన అడ్డంకులుండవు.

# 18. ఆవేదన

రెండు మూడు నెలలు ఇంటి వద్దనే వుండి నేను మా తమ్ములతో కలిసి మద్రాసు చేరుకొన్నాను. కొన్నాళ్లు మా బావగారింట్లోనూ, కొన్నాళ్లు హోటలులోనూ భోజనం చేస్తూ ఉన్నాం. ఇంటికి వెళ్లి యిల్లాలిని తోడుకొని వచ్చాను. అంతకు ముందు నేను చెందిన ఆందోళన కూడా వెనకపడి పోయింది. గార్హస్థ్య దశలో ప్రాచ్యలిఖిత పుస్తకశాల (GOML)లోని గ్రంథాలను ఎప్పటికప్పుడు చదివే ఉత్సాహంతో కాలం గడుస్తూ వుండేది. అప్పటికే చాటు పద్యాలు చాలా సేకరించి "చాటు పద్యమణిమంజరి" అనే పేరుతో ఒక గ్రంథాన్ని సంకలనం చేశాను. దానిని ముద్రించి ప్రకటించడంలో శ్రీ రెంటాల వెంకట సుబ్బారావు గారు నాకు చాలా సహాయం చేశారు. వేయి రిప్లై కార్డుల మీద (కార్డు ధర ఒక కాణీ!) నోటీసు, పుస్తకాలు కావాలనుకొనే వారు రాయడానికి పై అడ్రసుతో కూడా అప్లికేషన్ ఫారం అచ్చు వేయించి అడ్రసులతో సహా పోస్టు చేయించారు. వెంట వెంటనే వెయ్యి పుస్తకాలూ అమ్ముడు పోయాయి. ఇట్లా నేను పుస్తక వ్యాపారం మొదలు పెట్టానని బాధపడ్డ పుస్తక వ్యాపారులూ వున్నారు. దీని తర్వాత ప్రబంధ రత్నాకరము, భాసనాటకాలు, కొన్ని ప్రకటించాను. కానీ అవి అన్నీ మీరు అచ్చువేసి వ్యాపారం చేయడమెందుకు. మాకిస్తే మేమే అమ్మి సొమ్ము ఇస్తాం కదా!' అనేవారు పుస్తక వ్యాపారులు. అప్పుడు నా అనారోగ్య కారణాల వల్ల, తర్వాత గ్రంథరచన కోసం దేశాటనం చేయవలసి రావడం వల్ల, అట్లా కోరిన పుస్తక వ్యాపారులకు పుస్తకాలు అమ్మేశాను. అట్లా అమ్మిన పుస్తకాల మీద వచ్చిన ఆదాయంతో మా జీవిత యాత్ర సుఖంగానే గడిచింది. తమ్ములిద్దరిలో ఒకరు స్టాన్లీ రాయపురం మెడికల్ స్కూల్‌లోనూ, ఇంకొకరు ఆయుర్వేద కళాశాలలోనూ ఆ తర్వాత చదివారు

కానీ అప్పటి వరకు కెలెట్ హైస్కూలులో చదువుకొంటూ నా దగ్గరే వుండిరి. సుఖంగా జీవయాత్ర సాగుతూ వుండేది.

శ్రీ రామేశం గారికి నటేశన్, రామయ్య గారు, మరికొందరు గ్రంథ విక్రేతలు మిత్రులు. వాళ్లు తమ వ్యాపారం కోసం తెప్పించిన పుస్తకాలనన్నింటిని వారం వారం చదివి ఇవ్వడానికి ఇంటికి తెచ్చుకుంటూ పుస్తకాలేవీ నలగకుండా, చెడకుండా చదివి వాళ్లకు తిప్పి ఇచ్చేస్తూ వుండేవారు. ఆ గ్రంథ విషయాలన్నింటిని మిత్రుల కందరికీ తెలియజెప్పుతూ వుండేవారు ఆయన. వారు పుస్తకాలు చదవడం, చెప్పడం వల్ల గ్రంథ విక్రేతలకూ (అమ్మేవాళ్ళకు) లాభసాటిగానే వుండేది ప్రచారం పెరిగి. వారి గ్రంథ పఠనోత్సాహం నాకూ చక్కిలిగింతలు పెడుతూ మేలు కలిగించింది. నేనూ లైబ్రరీ నుంచి ముద్రిత గ్రంథాల్ని మోయగలిగినన్ని ఇంటికి తెచ్చుకొని అన్నీ చదువుతూ వుండేవాణ్ణి. చదువు – చదువు – ఇరవై నాలుగు గంటలూ చదువే. అప్పటికి నా వయస్సు ఇరవై యారు (1914).

అప్పుడు ఒకసారి తెలుగు దేశంలో చాలా చోట్ల కలరా వ్యాధి వ్యాపించింది. మద్రాసులోనూ కలరా వుండింది. బందరులో మా బావగారి తల్లి కలరా వచ్చి చెల్లిపోయెను. మదరాసు నుంచి మా బావగారు, మా తోబుట్టువు ఆమె గారి ఉత్తర క్రియ(కర్మకాండ)లకని బందరు వెళ్లారు. వాళ్లు ఊరు నుంచి తిరిగి వస్తూ అక్కణ్ణుంచి కొన్ని మొక్కజొన్న కండెలు తెచ్చారు. వారి రాక తెలిసి ఆఫీసు నుంచి ఇంటికి వచ్చిన తర్వాత వాళ్లింటికి వెళ్లి, అక్కడి కష్టసుఖాలు విచారించి వచ్చాను. తిరిగి వచ్చేటప్పుడు వారిచ్చిన మొక్కజొన్న కండెలు తెచ్చుకున్నాను. రాత్రే వాటిని మేమందరం ఆరగించాం. నిద్రలో రాత్రి రెండు గంటల వేళ నాకు మెలకువ. శరీరమంతా ఒకటే అలజడి. కలరా వ్యాధి కమ్మి ఆ మొక్కజొన్న కండెలతో అంటివచ్చి నాలో

ప్రవేశించినట్టు, నాకు కలరా వచ్చినట్లు భావన. బహిర్భూమికి (దొడ్లోకి) వెళ్లవలసి వచ్చింది. రాత్రిపూట గనుక, నేనున్న చోటు (తిరువళిక్కేణి సాతాని వీథిలో చివరి మేడ), కొబ్బరి తోటలు కలది గనుక, యింటికి కాస్త దూరంగా వెళ్లవలసి వచ్చింది. వట్టి గాలియే అమితంగా వెళ్లెను గానీ విరేచనం కాలేదు. నాలుగు మూడు గజాల దూరంలో బందరులో కలరా వచ్చి చనిపోయిన మా బావగారి తల్లిగారు అరవైయేళ్ల వృద్ధ (ముసలి) ధూమ్ర (పొగచూరిన) దుఃఖిత (విచారంతో వున్న) ఆవిష్ట (పూనినట్టున్న) ఆననంతో (ముఖంతో) ప్రత్యక్షమవుతూ కానవచ్చింది. చీకాకు కలిగింది.

అంతకు ముందు అలాంటి దుర్దర్శనం నాకెప్పుడూ కలగలేదు. నిద్రరాక ఆ చీకాకుతోనే రాత్రంతా గడిపాను. పొద్దున్నే శరీరమంతా ఏ కీలుకాకీలు విరిచినట్టు నొప్పి. పదిగంటల వేళ ఆఫీసుకి పోవాలి గనుక భోజనం చేయబోయాను. ఒక ముద్ద మింగానో లేదో ఒళ్లంతా అదిరినట్టయి చల్లబడిపోయింది. మృత్యు దశకు చేరుకున్నట్టయింది. తమ్ములు స్కూలుకి వెళ్లారు. ఇవాళ (1949) హైకోర్టు జడ్జిగా వున్న చింతగుంట రాఘవరావు గారు నేనూ ఒకే యింట్లో వుండేవాళ్లం. డాక్టరు నారాయణస్వామినాయని గారిని రాఘవరావు గారే పిలుచుకుని వచ్చారు. ఆయన వచ్చి పరీక్షించి విరేచనానికి మందిచ్చి జబ్బేమీ లేదని చెప్పి వెళ్లిపోయారు.

అప్పటికే మొదటి ప్రపంచ మహా సంగ్రామం ఆరంభమై సాగుతున్నది. ఆ యుద్ధాన్ని గూర్చి నాలో క్షోభ చాలా తీవ్రంగా వున్నది. నా అనారోగ్యం దుర్భరంగా వుండెను. డాక్టరు నంజుండరావు గారు మందిస్తూ వచ్చారు. ఇట్లా నాలుగైదు రోజులయింతర్వాత ఒక రోజు నా శరీరమంతా చిమ్మచీకట్లు కమ్ముతున్నట్లై, ధారలుగా ఒళ్లంతా చెమటలు దిగజారి లోపల నుంచి తీవ్రమైన బలమూ, ప్రజ్ఞా పొంగారుతున్నట్టయింది.

నంజుండరావు గారు నరాలకూ గుండెకూ మందిస్తున్నారు కాబట్టి దాని ప్రభావం కాబోలు అది అనుకొన్నాను. ఆ రోజంతా తీవ్రమైన ఉత్సాహంతోనే వున్నాను. నంజుండరావు గారు నన్ను సెలవుపెట్టి స్వగ్రామంలో ఇంటిపట్టున కొన్నాళ్లు వుండి రమ్మన్నారు. నెల కాబోలు సెలవు పెట్టాను. ఇంటికి నేను ఒక్కణ్ణే బయలుదేరాను. తమ్ముళ్లు, భార్య మద్రాసులోనే వుండిరి.

బందరులో గురువర్యులైన శ్రీ వెంకటశాస్త్రి గారికి కాబోలు ఏదో బంగారు వస్తువు కావాలని సొమ్ము పంపిస్తే చేయిస్తూ వున్నాను. దాన్ని తెచ్చుకోడానికి ఆఫీసు నుంచి సాయంకాలం ఆరుగంటల వేళ టౌనులోకి వెళ్ళాను. చెన్నకేశవ గుడి ప్రాంతంలో ఉంది ఆ శెట్టి గారి యిల్లు. నేను వెళ్లి సొమ్మిచ్చి వస్తువులు తీసుకుని వస్తూ మీ సోదరుడేడి! అని ఆ శెట్టి గారినడిగాను. అప్పటికి పదిహేను రోజుల క్రితం ఆయన శ్రీ కన్యకాపరమేశ్వరి దేవాలయానికి రాత్రి పది గంటల వేళ వెళ్లి అక్కడి పూజోత్సవాలు దర్శిస్తుండగా ఎమ్డన్ గుండు దెబ్బ వినవచ్చి, ఒక గుండులోని తునక కన్యకాపరమేశ్వరి ఆలయంలో పడిందట. దాని వెలుగు చూసీ చూడగానే గుండె పగిలి నెత్తురు వాంతి చేసుకుని మరణించాడని సెట్టిగారు చెప్పారు.

అది వినగానే నాకు మళ్లీ ఒళ్లంతా అదిరిపోయి చల్లబడి మృత్యుకల్పమైన స్థితి కల్గింది. నా శరీర వికృతి సెట్టి గారికి కానరానీయక అక్కడి నుంచి బయటపడి గోవిందప్పనాయని వీధి మొగనే ఒంటరిగా కాపురముంటున్న శ్రీ పురాణం సూర్యనారాయణశాస్త్రిగారి తోడ్పాటు కోసం వారింటికి వెళ్లాను. చాలా డీలాపడి ఎట్టాగో అక్కడికి చేరుకోగలిగాను. ఉదయం పదిగంటలకెప్పుడో చేసిన భోజనం. అంతకు ముందు ఆకలి

కూడా తీవ్రంగానే వుండెను. అప్పటికింకా హోటలు, కాఫీ వగయిరాల అలవాటు నాకు లేదు. వెంటనే నన్ను ట్రాము మీద ఇంటికి చేర్చమని కోరాను. ఆయన కాశీ, విజయనగర నివాసాల్లో అభ్యాసమైన 'భంగు' పానపరాయణుడు (మత్తు పదార్థము). అది నూరి తాగి కానీ కదలలేనని చెప్పెను. అవస్థపడుతూనే కూచున్నాను. భంగు తయారుచేసుకొని తాగి నాతో బయలుదేరి నన్ను మా యింటికి చేర్చారు.

ఎమ్డన్ గుండ్ల దెబ్బలు ఆ నాటికి పదిహేను రోజుల ముందుగా రాత్రి వేళ పారీస్ కార్నర్‌లో తగలడం. ఎమ్డన్ నౌక[28] వారు మదరాసు నగరం మీద తీవ్రమైన టార్చిలైటు ప్రసరింపజేయడం నాకు అనారోగ్యం మొదలుపెట్టున్న అవస్థలో వుండి గుర్తించలేకపోయాను. మర్నాడు ఊరంతా చెప్పుకోవడం విన్నాను. అంతదాకా ఇండియా నుంచి అనేక కృత్రిమ మార్గాల్లో యుద్ధ భటుల్ని చేర్చుకొని తీసుకుపోవడం, కసాయి వారికి మేకల్ని అర్పించినట్టు యుద్ధభూమిలో వీరిని బలియివ్వడం, దేశ దౌర్భాగ్యస్థితి వీటిని గూర్చిన విచారమె కానీ చివరికి ఇండియాలోనే యుద్ధ వికారాలు తలెత్తడం ఎవరూ వూహించని విషయం. యుద్ధ చింత నన్ను అల్లకల్లోలాల్లో ముంచేసింది. ఆ రోజు బాలయ్య సెట్టి గారింట్లో పడ్డ ఫిరంగు గుండ్ల ముక్కలలాంటివి వూరంతా పడడం, అది చూచి ఒక నిండు జీవి ఆకస్మికంగా చనిపోవడం విన్న మీదట యుద్ధంలో నిండు జీవులు గుండు దెబ్బలూ, ఈటె పోట్లూ అవీ తగిలినప్పుడు పొందే మరణయాతన నా శరీరంలోనే జరుగుతున్నట్టనిపించేది. క్షణ క్షణం నాకు మరణ యాతనే. ప్రతి దేశలేశంలోనూ, ప్రతికాలలేశంలోనూ నాకు మృత్యు భయమే. చచ్చిన చావూ కాక బ్రతికిన బ్రదుకూ కాక చావు బ్రతుకుల సందులో ఊగులాటగా అయింది.

# 19. అనారోగ్యం

అప్పటికే ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో నాకు జీతం పెరిగింది. మదరాసు రాష్ట్రమంతటా గల ప్రాచీన గ్రంథాల్ని సంపాదించే పని మీద కొందరు ఉద్యోగుల్ని ప్రభుత్వం నియమించింది. అందులోనే నేనొక ముఖ్యుణ్ణి. పనిలో ప్రవేశించాను. కాని అనారోగ్య కారణాల వల్ల సెలవు పెట్టవలసి వచ్చింది. ఆ గ్రంథ సంపాదన కార్యక్రమం చాలా యేళ్ళు కొనసాగవలసిందే అయినా ఆ ఉద్యోగాల్ని మాత్రం టెంపొరరీగానే యేర్పాటు చేసింది ప్రభుత్వం. గ్రంథ సంపాదనార్థం టూరు చేయవలసిన పార్టీ కూడా వెంటనే పని ప్రారంభం చేయవలసి వచ్చింది. నేనా దీర్ఘ అనారోగ్యగ్రస్తుడినవుతూ వచ్చాను. కాబట్టి నన్ను తప్పించి ఆ వుద్యోగం ఇంకొకళ్లకిచ్చారు. నేను మళ్లీ పర్మనెంటు పోస్టుకే రివర్ట్ అయ్యాను. సెలవు మీద వున్నాను గనుక ఇంటికే వెళ్లిపోయి వున్నాను. అలా అనారోగ్యంతో మూడేళ్ళపాటు బాధపడ్డాను. మదరాసులో వుండగా మార్చి మార్చీ నంజుండరావుగారు చాలా మందులిస్తూ వుండేవారు. ఎన్ని ఇచ్చినా గుణం కనపడకపోయింది. చివరకు ఎట్లా అయిందంటే ఏ మందు తీసుకున్నా అది నా అనారోగ్యాన్ని పెంచేదిగానే అవుతూ వచ్చింది. “మందులన్నీ కట్టిపెట్టి ‘శానిటోజన్’ మాత్రం ఆహారంగా తీసుకోండి’ అని నంజుండరావు గారు చెప్పిరి. ఇంటికి వచ్చీరాగానే కొన్నాళ్లు నంజుండరావుగారు చెప్పినట్టే చేస్తూ వచ్చాను. ఒక రోజు రాత్రి భోజనం చేసిన తర్వాత శానిటోజోన్ పాలతో కలిపి తీసుకున్న కొంతసేపటికే శరీరంలో నరాలన్నీ పట్టుతప్పి యెక్కువగా బిఱ్ఱబిగించి విడిచిన ఫిడేలు, వీణతంత్రుల వలె కదిల్చినా కదిలినా త్రుటితములై (ముక్కలై) విరిగిపోతున్నట్టు అదరుపాటు కలిగే సంకట స్థితి ఏర్పడింది. మంచం మీద నుంచి అదిలించి ఎగరగొట్టి కింద పడేసినట్టు

అయింది. ఆ రాత్రంతా నిద్రలేక అలాగే బాధ పడ్డాను. శానిటోజన్ పూర్తిగా మానేసి చల్లా అన్నం తింటూ వచ్చాను. అట్లా చేయగా రాత్రిళ్లు కాస్త నిద్ర పట్టేది.

అలా రెణ్ణెల్లో మూణ్ణెల్లో తీసుకున్న సెలవంతా ముగిసిపోయింది. రోజూ ఆంధ్రపత్రిక చదువుతుంటే అందులో చదివిన యుద్ధ తీవ్రతలు నాలో అల్లకల్లోలాన్ని కలిగిస్తూ చెలరేగుతుండేవి. అలాంటి స్థితిలో మా వాళ్లు కొందరు చూడడానికి జ్వరమా, తలనొప్పా, ఆకలి లేకపోవడమా ఏ జబ్బూ లేదు. వట్టి పిరికితనంతో ఇంట్లో కూచున్నాడు అని నిందిస్తుండడం నాకు సహించడానికి కష్టమయ్యేది. మా తల్లిదండ్రులు, అక్కగారు, భార్య నన్నేమీ అనలేక దుఃఖిస్తూ వుండేవారు.

సాహసం చేసి నేనొక్కణ్ణే మద్రాసు వెళ్లి డ్యూటీలో చేరుదామనుకొని బండిలో బయలుదేరి బందరు చేరుకున్నాను. అక్కడొక మిత్రుని ఇంట్లో బస చేశాను. గురువులైన శ్రీ వెంకటశాస్త్రి గారిని దర్శించుకొన్నాను. వారితో కలిసి వారికీ నాకూ మిత్రుడూ, డిగ్రీలు అవీ లేకున్నా ఆంగ్ల వైద్యం చేస్తూ, వూళ్లోనే ప్రఖ్యాతుడుగా వుంటున్న ఒక వైద్యుణ్ణి చూడడానికి వెళ్లాము. అతడు నంజుండరావు గారిచ్చిన మందుల జాబితా చూసి 'ఇవన్నీ చాలా తేలిక డోసులో ఇచ్చారు' అంటూ వాటిలో ముఖ్యమైన మందొకటి నరాలకు బలాన్నిచ్చేది వుందని చెప్పి, అదొక సీసాడు పుచ్చుకొంటే ఠక్కున తగ్గుతుందనీ అన్నాడు. ఆ మందును కొని, తీసుకొని మద్రాసుకి బయలుదేరాను.

అలా ఆ మందు తీసుకొంటూ, ఆఫీసు డ్యూటీలో జాయినయినాను. ఆ మందు పుచ్చుకొన్న రెండు పూటలకే ఒళ్ళంతా మంటలెత్తి, నిద్ర పట్టనీయకుండా, నరాలన్నీ బిట్ట బిగించి అదరగొట్టినట్టయింది. "భ్రష్టస్యకావా గతిః" (చెడిపోయినవానికి దారేదీ) అన్నట్లు. అది మాని,

తిరిగి నంజుండరావు గారి దగ్గరికే వెళ్లి చూపించుకోలేక దగ్గర్లో వున్న ఇంకెవరో మంచి డాక్టర్లనే సంప్రదించి వైద్యం చేయించుకున్నాను. ఆ వైద్య విధానం నన్ను మరింతగా గగ్గోలు పరిచింది. తిరువళిక్కేణిలో నాకు పరిచయమున్న డాక్టరు ఒకరు 'ఫాస్పరస్' ప్రధానంగా వున్న మాత్రలు పది రాసి యిచ్చి "ఏమీ అనుమానించకుండా ఈ పదీ చివరంటా రోజుకి రెండేసి మాత్రలు చొప్పున వేసుకుని తరువాత కనపడు" అని చెప్పి పంపించాడు. మదరాసులోని మా వాళ్లూ "ఆ డాక్టరు చెప్పినట్టు చేయు" మని నిర్బంధం చేశారు. దానితో అప్పటి నుంచీ నోరు తడియారిపోవడం, రేయింబవళ్లూ అసలు నిద్రే లేకపోవడం, ఒళ్లంతా ఎర్రబడి మంటలెత్తడం, ప్రేగుల్లో మంట మరీ ఎక్కువ కావడం మొదలయ్యింది.

# 20. ఔషధ సన్యాసం

అప్పుడు మళ్లీ నంజుండరావు గారిని చూశాను. ఆయన తిట్టి చీవాట్లు పెట్టి "నీవు బ్రతకాలనుకొంటే ఇక ఎవ్వరి దగ్గరా మందులు పుచ్చుకోకుండా ఏళ్ల తరబడి స్వస్థత కోసం మీ యింటి దగ్గరికే వెళ్లి వుండు. ఇదొకటే నువ్వు చేయవలసింది. ఏవో మందులిచ్చారు గానీ అవేవీ కూడా పనిచేయలేదు. తల మీద పాము పొలుసూడినట్టు తోలు పొడలూడసాగినవి. స్వగ్రామానికి వచ్చేశాను. చలువ చేసే ఆహారం తీసుకోగా తీసుకోగా కొన్ని నెలలకు ఆ మంటలు కొంత తగ్గినవి. తొట్టెస్నానాలు చేయడం ప్రారంభించాను. కొన్నాళ్లపాటు అది కాస్త నయంగా వున్నట్లనిపించింది. అప్పుడే నా నోట "ఔషధ సన్యాసం" (మందులు మానెయ్!) అనే మాట మాటి మాటికీ రాసాగింది. "ఇక చచ్చినా సరే, ఏమైనా సరే! మందులు మాత్రం పుచ్చుకోకూడదు అనే సంకల్పం ప్రబలమవుతూ వచ్చింది. తిన్నగా తెలియని శరీరాంతరంలోని తంత్రానికి, తిన్నగా అర్థం చేసుకోలేని ఔషధగుణాలు, అందులోనూ అనేకానేక ఓషధుల మిశ్రమైన మందులగుణా లెలాంటివో తెలియక, ఔషధాలు ఎంతెంత మోతాదుల్లో ఇవ్వాలో కూడా తెలుసు కోకుండా, వ్యాధి నిదాన విధానం తిన్నగా అవగాహనకు రాక, అర కొర పరిజ్ఞానంతో గుడ్డెద్దు చేనబడ్డ విధంగా సాగుతున్న వైద్య తంత్రంతో ఇక నేను చిక్కులు పడకూడదని నిశ్చయించుకొన్నాను. ఇంత వ్యాధితో వున్నా రోజులూ, వారాలూ, నెలలూ, ఏళ్లూ తరబడి నిద్రలేకుండా బాధపడుతూ సర్వ వికారాలతో వున్నా నా మనస్సు మాత్రం తలకిందులు కాక, ప్రజ్ఞ చెడక, జ్ఞాపకశక్తి చెదరక సరిగానే వుండెను. కానీ, స్థిరంగా కూర్చొని అరగంట సేపయినా చదవడం లాంటి

మానసిక పరిశ్రమ చేయలేక పోయేవాణ్ణి. పది రోజుల కొకసారి తీవ్రంగా ఆముదం తీసుకోవటం. అప్పుడు పచ్చని పిత్త ద్రవం క్రింది నుంచి వెళ్లిపోయేది. నాలుగు మూడు రోజులు కొంత శాంతిగా వుండడం. మళ్లీ కడుపులో మంటలు, తాపం, నిద్రలేమి, వగైరాలు చెలరేగటంగా వుండేది. చల్లటి చప్పటి ఆహారమే, తొట్టె స్నానమే కొంత నాకు శాంతికరంగా వుండేది. తొట్టె స్నానాలు మెరుగ్గా వుండడం వలన ఆముదం పుచ్చుకోవటం క్రమంగా ఆపేశాను. ప్రతిరోజూ ఆంధ్ర పత్రిక చదువుతూనే ఉన్నాను. యుద్ధవార్తలు తెలుసుకొంటూనే వుండినాను. ఆంధ్రపత్రిక చదవకుండా వుండలేను. ఈ నాటికీ (1949) అంతే. అట్లా యుద్ధవార్తలు చదివీ భరించలేను. చదివితే యుద్ధరంగంలోని మారణాలన్నీ నాలోనే అనుభవానికి వచ్చేవి. చదవకపోతే యుద్ధంలో ఏమి జరుగుతున్నదో తెలియటం లేదు కదా అనిపించేది. పగలు పన్నెండు గంటలేకాక రాత్రి పన్నెండు గంటలు కూడా ఏమీ చెయ్యకుండా చింతతో, మెలకువతో, ఇంట్లో కొందరికైనా అతృప్తి కల్గిస్తూ, ఇతరులు గుర్తించలేనంత తీవ్ర వ్యాధితో సంక్షోభం చెందటంగా వుండేది. ఎప్పుడో కొన్ని రాత్రిళ్లు పల్చని తెర కప్పినట్టు నిద్ర సోకు (నిద్రావస్థ) వుండేదేమో కానీ కళ్లు తెఱుచుకున్నంత తేలికగా వుండేది. అది చూసి మా వాళ్లు కొందరు ఏదో కొంత నిద్ర పట్టిందనుకొనేవారు.

అప్పటి నా తలపోతల్లో (ఆలోచనలతో) ఒక్కటి – ఏ పుణ్యాత్ముడైనా వచ్చి “నువ్వు ఫలానా పాపకర్మం చేయటం చేత నీకిటువంటి వ్యాధి కలిగిందీ, క్లోరోఫారం ఇయ్యకుండా వాడిఖడ్గంతో నీ కుడిచేతిని రస్సని నరికేస్తానూ, అందుకు నువ్వు అంగీకరిస్తే, ఆ బాధకు ఓర్చుకోగల్గితే, ఆ తరువాత నీ కుడిచెయ్యి లేకపోవడానికే ఇష్టపడితే, నీ చేతిని నరికిన గాయం మానే

నాటిలోగానే నీ రోగం కుదురుస్తానూ, చేతిని నరకడం చేత నీకే అపాయమూ వుండదూ, అంతటితో నీ కర్మ తీరిపోతుందీ", అన్నాడనుకోండి! వెంటనే ఒప్పేసుకునే వాణ్ణి అనిపిస్తూ వుండేది నాకు. నా బాధ అంత తీవ్రంగా వుండేది! ఈ మాటే యితరులతోనూ అంటూ వుండేవాడిని. క్షణ క్షణమూ మరణ యాతనే. 'దిన దిన గండము' అని అనుకొనే వాడను. దాని పై మాట "నూరేళ్లాయుష్షు" అనేది లోలోపల ఎక్కడో తోచేదే కానీ, గుండె దానికి వాక్యరూపమియ్యటానికీ, నోటితో ఉచ్చరించటానికీ దుఃఖించే వాడిని! దినదినగండంతో వెయ్యేళ్లాయుష్షు దేనికీ? వెయ్యేళ్లు కాదుగదా వెయ్యి గంటలైనా ఎందుకు? అని బౌద్ధమతం వారు చెప్పుకునే మాటలు "సర్వం దుఃఖం దుఃఖమ్", "సర్వం క్షణికం క్షణికమ్" అనే అర్థమే సదా నాలో అనుభూతికి వస్తూ వుండేది. ఆ పలుకులే నా నాలుక మీద మెదులుతూ వుండేవి.

చిన్న నాటి నుంచీ భవభూతి ఉత్తరరామచరిత్ర మంటే నాకు పరమానందం. అందులోని పలుకులు "జగజ్జీర్ణారణ్యమ్..."[29] అనేది ఎల్లప్పుడూ నా ఆలోచనల్లో మెదులుతూ వుండేది. "జగజ్జీర్ణారణ్యం" అనడానికి ఎంతో గొప్ప వివరం తోచేది అరణ్యమైతే అందులో నీడనిస్తూ పళ్ళూ పూలతో నిండిన చెట్లూ, లతలూ, చివురాకు పొదరిళ్లూ, నీటిపట్టులూ, పక్షుల కలకలారావాలూ ఎగురుతూ దూకుతూ కనపడే జంతు విహారాలూ, మనుష్య సంచారాలూ వుంటాయి! ముళ్ల పొదలూ, పులులూ మొదలైన క్రూర జంతువులూ, పాములూ, తేళ్లూ, అడవి చెట్లూ వుంటే వుండవచ్చు గానీ, పూలకోసమో, పళ్లకోసమో, అందులో ప్రవేశించేవారు తగిన సాధనోపకరణాలతో వాటిని తప్పించుకుని, ఏ అపాయమూ లేకుండా

పని పూర్తి చేసుకుని రాగలుగుతారు. అదే జీర్ణారణ్యమైతే – అందులో ఫలపుష్ప వృక్షాలుండవు. జలాశయాలుండవు. లతాగుల్మాలుండవు (చెట్టుతీగల పొదలు). ఎండిన అడవి. రక్కెస మట్టలు, చీకిరేని పొదలు, పాములూ, తేళ్ళూ, తోడేళ్లూ మొదలైనవి మాత్రమే వుంటాయి. కర్మవశాన దారి తప్పి ఎవడైనా అలాంటి అడవిలో పడ్డాడా! అంతే సంగతి. వాడు అక్కడ కడతేరాల్సిందే. జగత్తు ఒక జీర్ణారణ్యంగానూ, దుర్విధిచేత నేనందులో పడ్డట్టుగానూ భావించే వాడను.

---

౧. భవభూతి ఉత్తరరామచరితమంటే శ్రీ శాస్త్రిగారికి ఎంతో ప్రీతి. ఒకసారి తిరుపతిలో వారం రోజుల పాటు ప్రార్థనానంతరం ప్రసంగాలకు బదులుగా సందర్భావశాన ఉత్తరరామచరిత నాటక మూలాన్ని తాము పాఠం చెప్పుతూ నాలుగు ప్రసిద్ధ తెనుగు అనువాదాల్ని నలుగురి చేత చదివిస్తూ సవిమర్శ వ్యాఖ్య చేశారు. వారి వ్యాఖ్యానరీతిని, పాఠ ప్రవచన వైఖరిని అనువాదాల తారతమ్యాలన్నీ అందరూ తెలుసుకోగలిగి ఆనందించారు. ఆ గోష్ఠిలో హైస్కూలు విద్యార్థిగా నేనూ ఒక శ్రోతనుగా ఉన్నాను.

# 21. వెలుగు నీడలు

భవభూతి మళ్లా వినిపించిన ఈశావాస్యోపనిషత్తులోని వాక్యం – "అసుర్యానామతే లోకా అంధేన తమ సావృతాః తాంస్తే ప్రేత్యాభి గచ్ఛన్తి యేకేచాత్మ హనోజనాః"౯ అన్నది అప్పటి ఆత్మ హత్యా సంకల్ప జ్వాలల్ని చల్లారుస్తూ వుండేది. చాలా పసితనంలోనే కళ్ళు మూసుకుని బోరగిల పడుకొని చూస్తూ వుండినపుడు "నేను – నేనని" నాలో గోచరించిన మినుకు మినుకు మనే గుడ్డి వెలుగే దూరాన గోచరించి, నాలోని జీవితాన్ని గురించిన ఆశనూ, శ్వాసనూ నిలుపుతూ వుండేది.

మందులు మానేశాను గనుక మా వాళ్లు మంత్రాల మీదికి దృష్టి సారించారు. వారినీ వీరినీ పిలిపించి మంత్ర జపం చేయించాలను కొంటుండగా నేను అడ్డు తగిలే వాడిని. ఆ మంత్ర జపాలను చేయించేవారి యోగ్యతలు నేనెరిగినవే. కాబట్టి వారిని పిలిపించడానికి నేను ఒప్పుకొనేవాణ్ణి కాదు. నా అనారోగ్యమేమిటో నన్నే అడిగి, విద్వాంసుడు కదా అని అడిగినవన్నీ నేను చెప్పగా, అంతా విని చివరికి ఆ వేద శ్రౌత విద్యా విశారదుడు ఒకడు "ఏభై రూపాయలు తెచ్చి నాకిస్తే నీకు పట్టిన మోహినీ పిశాచాన్ని నేను వదలగొడతాను" అంటూ ఏదో చెప్పబోయాడు. ఛీ కొట్టి పొమ్మన్నాను. ప్రతిరోజూ వెయ్యిసార్లు గాయత్రీ మంత్రం జపం[30] చేస్తూ అమాయకంగా వుండే వృద్ధ బ్రాహ్మలొకర్ని – ఆయన కొడుకే మా వూర్లో స్కూలు మేష్టరుగా కూడా కొన్నాళ్లు పని చేసెను – పిలిపించాలనుకొన్నప్పుడు నేనూ సరే అన్నాను. వారిని గ్రామాంతరం నుంచి పిలిపించారు. నలభై రోజుల పాటు ఆయన మంత్ర జపం జరిపించెను. అందువల్ల నాకే ఉ పకారమూ జరుగబోదని నేను బిగ్గరగానే అంటూ వుండేవాడిని. నాకు పట్టిన గ్రహచారమో, గ్రహమో, ఉపకారకములైన పద్ధతుల మీద నాకు

నమ్మకం లేకుండా చేస్తున్నదని మా వాళ్ళు నిందించేవారు. "నిజమే! నాకు ఇటువంటి వారి ప్రజ్ఞ మీద విశ్వాసం లేదు. అదే నాకున్న జబ్బు అని మీరూ వారూ అంటున్నారు కదా! మరి మీరూ వారే కదా అలాటి జబ్బుని కుదర్చవలసిన వారు? నాకు నమ్మకాన్ని కలిగించండి మరి!" అనేవాడను. నలభై రోజులయిన తర్వాత జప ఫలాన్ని నాకు ధారాదత్తం చేస్తూ గొప్ప బ్రాహ్మణ సంతర్పణం జరిపించారు. వృధా ధనవ్యయమయిందని నేను వీటితో వ్యధ చెందాను. ఇలాంటి చీకాకులెన్నో పడ్డాను, వేటి వల్లా నాకు మేలు కలుగలేదు. తొట్టె స్నానం, ఉప్పూ కారం లేని తిండి ఒక మాదిరిగా సాగిస్తూనే వుంటిని. మదరాసులో నా స్థానంలో నియుక్తులైన విద్వాంసులు హఠాత్తుగా అస్తమించారు. చలి జ్వరం నూటారు డిగ్రీలకు పైగా వచ్చి, ఆ తరువాత మందులు పనిచేయక పుణ్య లోకాలకు వెళ్లిపోయెనట! మా ఆఫీసు క్యూరేటరు శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు నాకు డి.ఓ. లెటరు రాశారు. "నీవు వెంటనే వచ్చి డ్యూటీలో చేరటం మంచిది. నీకు ఏ తొందరా కలక్కుండా దేశాటనం చేసే ఏర్పాటు కూడా చేస్తున్నాము. రావలసింది" అని!

ఆ సంవత్సరమే ఆంధ్ర సాహిత్య పరిషత్తు సంవత్సరోత్సవం గుంటూరులో జరిగింది. నేను చాలా గౌరవించే వేదం వెంకట రాయశాస్త్రిగారు ఆ సభకు అధ్యక్షులు. మిత్రులు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారూ నన్ను మద్రాసు రాగోరుతూ ఉత్తరం రాశారు. గుంటూరులో కలుసుకొందామని బదులు రాసి అట్లాగే గుంటూరుకి బయలుదేరి వెళ్లాను. అక్కడ నేను మాట్లాడిందీ చేసిందీ పెద్దగా ఏమీ లేదు. అయినా ఆ ఉపన్యాసాల వినికిడికి, ఎండలకూ నేను తట్టుకోలేకపోయాను. మిత్రులు శ్రీ కనుపర్తి మార్కండేయ శర్మ గారింట్లో నా విడిది. తొట్టెస్నానం చేసి కొంత స్వస్థత చేకూర్చుకొన్నాను.

మిత్రుల ప్రోద్బలం మీద నేను మద్రాసు వెళ్లడానికి నిశ్చయించుకున్నాను. ఇల్లు చేరుకుని తగిన యేర్పాట్లతోనే ఒక్కణ్ణే బయలుదేరాను. ఆప్తులు, బంధువులు మంగళగిరి నృసింహస్వామి దర్శనం కూడా చేసుకు వెళ్లమని నిర్బంధించారు. నిండు భక్తితో సంకీర్తనా గానం చేయగల బ్రాహ్మణులొకరు నాతో వచ్చిరి. మంగళగిరికి వెళ్లాము. అక్కడ బాలాంబ గారు<sub></sub> అనే మహనీయురాలు మాకు ఆతిథ్యమిచ్చారు. పానకాలు వగైరా నైవేద్యాలు చేయించాము. పానకం ఆరగింపు చేయించేటప్పుడు నాకు వెండి కవచంతో వున్న మూర్తి తీరును గూర్చిన యోచన సాగింది. ఆ విషయాన్ని నేను వెల్లడించబోతే దైవ పరీక్ష వద్దంటూ అక్కడివారు నాకు హితముపదేశించారు. స్వామికేదో చెల్లించాలనుకొన్నా కూడా అది చెల్లించలేదు. ఆ మొత్తాన్ని శ్రీ బాలాంబ గారికి సమర్పించాలన్న కోరికతో ఇయ్యబోగా, అప్పుడు "మా ఇంట్లో ఆతిథ్యం తీసుకుని ఇప్పుడేదో మీరివ్వబోతే అది పూటకూళ్ల యింటికిచ్చినట్లవుతుంది. తరువాత మీరు చేరవలసిన చోటికి చేరుకొని ఏదైనా పంపుదురు గాని లెండి" అన్నారామె.

మదరాసు చేరుకొన్నాను. ఆఫీసు డ్యూటీలో చేరాను. అప్పుడు కొందరు మిత్రులతో కలిసి బకింగ్‌హాం లాడ్జిలో వున్నాను. జనార్దన్ అనే పుణ్యాత్ముడు హోటల్ ప్రొప్రైటరు నాకు మిత్రుడు. అతని హోటల్‌లోనే భోజనం. డ్యూటీలో చేరిన పది రోజుల్లోనే అయిదు రోజులు కేషువల్ లీవు పెట్టవలసి వచ్చింది. రాత్రిళ్లు నిద్ర రాదు. కడుపులో మంట. శరీరంలో తాపం. తీవ్రమైన అశాంతి. అప్పుడు నా బాల్యమిత్రం శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు కూడా నాతో వుండిరి. వారి తోడ్పాటుతో డాక్టరు లక్ష్మీపతి గారింటికి వెళ్లాను. ఆయన సరిగా వ్యాధి ఏమిటో గుర్తిస్తే కానీ మందిచ్చేవారు కారు. ఎక్కువగా మందులు వాడక ఆహార విహారాల

సర్దుబాటుతోనే సాధ్యమైనంత వరకూ వ్యాధి నివారణకు ప్రయత్నించేవారు. ఆయన కూడా నాకు చిరకాల మిత్రుడే. నా వ్యాధి చరిత్రమంతా విని నరాల ఉద్రేకం తగ్గడానికేదో మందు (బ్రొమైడు) ఇచ్చారు. అది తీసుకుంటే ఒక రాత్రి నెమ్మదిగా ఉందేమో గానీ మర్నాటికి శరీరమంతా పట్లు విడిపోయినట్లయి లేవలేని స్థితికి వచ్చాను. ఆ మందు మానేశాను. ఇక నౌకరీ చేయడం దుస్సాధ్యమనే నిశ్చయానికి వచ్చేశాను. అప్పటికే క్యూరేటరు గారు ఇక నీతడు సెలవు కోరితే డిస్మిస్ చేసి యింటికి పంపవలసిందే అని రెండు నాళ్ల క్రితం ఇచ్చిన సెలవు చీటీ మీదనే రాసేశారు. వారూ అంతదాకా ఎంతో ఓర్పుతో నన్నక్కడ నెలకొల్పాలనే చూశారు. లాభం లేకపోయింది. నాకూ దిక్కు తోచలేదు. బలవంతాన ఎట్లాగో శరీరాన్ని ఎగసన ద్రోసి నరాల బలాన్ని కూడగట్టుకుని, స్నానం ముగించి హోటలుకి వెళ్లాను. నేటితో నౌకరీకి నీళ్లు తోడుకోవలసిందే! ఇలాంటి స్థితిలో ఇంటికి మళ్లీ వెళ్లడం బతికుండీ చచ్చినట్టే అవుతుందనిపించింది. చేతిలో వున్న సొమ్ముతో హరిద్వారానికి టిక్కెట్టు కొనుక్కొని (టిక్కెట్టుకి చాలినంత సొమ్మే వుంది కాబట్టి) దారిలో ఉపవాసమే చేసి, ఎవరినీ అడగకుండానే ఏదైనా లభిస్తే తిని మహా ప్రస్థానకల్పంగా పోయి గంగానదీ ప్రవాహంలో కలిసిపోవాలని నిశ్చయించుకొన్నాను. ఆత్మహత్య అసుర్యానరకమనే చింత రేగింది కానీ పాండవాదుల మహాప్రస్థానం[31] పాపాపాదకం (పాపాన్ని కలిగించేది) కాక పాపాపనోదకమే (పాపాన్ని తొలగించేదే) అయిందని చెప్పబడిన విషయం గుర్తుకు వచ్చి సమాధాన పడ్డాను.

క్యూరేటరు డిస్మిస్ చేసేదాకా ఎందుకు? నేనే రిజిగ్నేషన్ చీటి పంపుదును గాక అని నిశ్చయించుకొని రెజిగ్నేషన్ లెటరు రాసి చేతిలో వుంచుకున్నాను. తొమ్మిదిన్నర గంటలకు భోజనం చేసి నౌకరీ చెల్లు చీటీని

– నాతో పాటు నౌకరీలో చేరినవాడు నా అనారోగ్యానికి నా కంటే ఎక్కువగా దుఃఖపడుతూ వుండే గుమస్తా యింటికి వెళ్లి – ఇచ్చేయాలని నిశ్చయించుకున్నాను. హోటలుకు భోజనానికై వెళ్లగా జనార్దనుడు జబ్బుగా వున్నానని నా కోసం ప్రత్యేకంగా కారం లేకుండా చాలా రుచిగా కూరలు, పచ్చళ్లు చేయించెను. అతడు వాటిని మామూలుగానే చేయించాడేమో గానీ నాకు మాత్రం ఆ నాటి భోజనం కొన్నేళ్లకు పూర్వం నేనెప్పుడైనా చేశానో లేదో అన్నంత రుచిగా వుండెను. కడుపార ఆరగించాను. శరీరంలోఉత్సాహం తోచింది. నరాల స్థితి చక్కబడ్డట్టైంది. "ఇవాళ ఆఫీసుకి వెళ్లి పని చేసుకోగలనా? జబ్బు కుదురునా? ఊహించని ఈ ఉత్సాహమేమిటీ ఇవాళ? ఏమో! డ్యూటీలో వుండలేను! హరిద్వారానికి వెళ్లవలసిందే ! గంగలో కలిసే మాట అక్కడే నిర్ణయించుకోవచ్చు గాక!" అని పరిపరి విధాలైన యోచనలతో అక్బరు సాహెబు వీధిలో వస్తూ వున్నాను.

---

౧. ఎవరు ఆత్మహత్యకు పాల్పడతారో అట్టివారు అసుర సంబంధమైన అంధకార లోకాల్లోకి వెళ్లిపోతారు. (ఈశావాస్యోపనిషత్తు) అట్టి బలవన్మరణము కూడదని భావము.

౨. ప్రఖ్యాత విద్వాంసులు వేదం వేంకట రామశాస్త్రి గారు 1853 - 1929.

3. శ్రీ మానవల్లి రామకృష్ణ కవి 1866–1957. గొప్ప పరిశోధక విద్వాంసులు. వీరిని "కవి బిరుదంతో శ్రీ పనప్పాకం ఆనందాచార్లుగారు సత్కరించారని శ్రీ శాస్త్రిగారు స్వయంగా తెల్పిరని శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు చెప్పిరి.

౪. శ్రీ కనపర్తి మార్కండేయ శర్మగారు ప్రముఖ విద్వాంసులు. శ్రీ శాస్త్రిగారి స్నేహితులు.

౫. వివరాలు సేకరించవలెను.

౬. శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు శ్రీ శాస్త్రిగారి బాల్య స్నేహితులు. ఆధునిక ఆంధ్ర కవితా విశారదులు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ నారంభించిన తొలి ఆచార్యులు.

౭. డా॥ ఆచంట లక్ష్మీపతి గారు ప్రముఖ ఆయుర్వేద వైద్యులు. శ్రీ శాస్త్రిగారి సన్నిహితులైన మిత్రులు.

# 22. వెలుగు బాట

రోడ్డు మీద అబ్బూరి జగన్నాథరావు[1] గారనే మిత్రుడు అగపడి నా చేయిపట్టుకుని "మీరు ప్రభాకరశాస్త్రిగారేనా? ఇట్టా వున్నారేమిటి?" అని అడిగెను. మూడేళ్ళ నుంచీ జబ్బుగా వున్నానన్నాను. "ఏమిటి జబ్బా?" అంటూ నన్ను ఇంటిలోకి తీసుకొని వెళ్లెను. శూన్య హృదయంతో నేనూ లోనికి అడుగు పెట్టాను. అక్కడ శ్రీ గురజాడ అప్పారావు[2] గారి ద్వారా నాకు మిత్రులైనవారూ, అప్పారావు గారి బంధువూ, మూడేళ్లకు పూర్వం అప్పుడప్పుడు లైబ్రరీలో యోగశాస్త్ర గ్రంథాలను గురించి అడుగుతూండిన వారూ అయిన శ్రీ పోతరాజు నరసింహం[3], ఎం.ఏ., ప్రెసిడెన్సీ కాలేజీ ఫిలాసఫీ ప్రొఫెసరు కనపడ్డారు. వారి ప్రశ్నపై సంగ్రహంగా నా అనారోగ్య విషయం చెప్పాను. వారి బావమరిది జగన్నాథరావు నన్ను "మా బావగారు చేరిన యోగ గోష్ఠిలో చేరితే అనారోగ్యం తొలగిపోతుంది కదా! ఎందుకు చేరకూడదు?" అన్నారు. నరసింహంగారు 'ధ్రువనాడి'[4] అనే గ్రంథం లైబ్రరీలో వున్నదా అంటూ అడగడం మొదలు పెట్టారు. వారు చేరిన యోగ గోష్ఠిని గురించీ, ధ్రువ నాడిని గురించీ నేనూ వారిని ప్రశ్నించాను. నా జాతకం కూడా ధ్రువనాడిలో వుంటుందా అని అడిగాను. వారు గంపెడు విషయాలు చెప్పి నన్ను వెంటనే కుంభకోణం వెళ్లి యోగగోష్ఠిలో చేరమన్నారు. వెళ్తానంటే ఉత్తరం రాసిస్తానన్నారు.

హరిద్వారం కాక ఆరోగ్యద్వారం చేరబోతున్నట్టుగా అనిపించింది. "నేను" అనే నా బాహ్య ప్రజ్ఞలో తిరుగుతున్నట్టూ, అందుకు ఒక దారి పాయ విచ్చి ఏర్పడుతున్నట్టూ తోచింది. ఎడమ పక్క నుంచి తేలి తేలి చెడుగు పోతున్నట్టూ, కుడి పక్క నుంచి దూరి దూరి చోటు చేసుకొంటూ గుణమేదో లోలోపల కుదుర్కొంటున్నట్టూ, ఆ రెండింటి నడుమనా ఒక బాట అరటాకు ఈనలాగా సాగుతున్నట్టూ అనిపించింది. ఒక పక్క ఆఫీసుకి

వెళ్ళవలసిన తొందర. ఆ సమయంలోనే మా లైబ్రేరియన్‌కీ, మా నరసింహం గారికీ కూడా మిత్రుడైన వారక్కడుండి నా గోడంతా విన్నవారై "రెండు రోజులు సెలవిప్పించడానికి నేను లైబ్రేరియన్‌తో చెప్పి ఏర్పాటు చేస్తాను. కుంభకోణం వెళ్ళండి" అని నా చేత కొత్త లీవు చీటీ రాయించి పుచ్చుకుని వెళ్లారు.

నేను సాయంత్రం రైలు ప్రయాణానికి సన్నద్ధుడనైనాను. నరసింహం గారు నాకు పరిచయ పత్రం రాసిచ్చారు. రాత్రి ఏడు గంటలకల్లా ఎగ్మూరు స్టేషనుకు చేరుకున్నాను. అక్కడ మా లైబ్రరీ అరవ పండితుడు కనపడ్డారు – అతడు నన్ను చూసి చెయ్యి పట్టుకుని "ఇవాళ ఆఫీసుకీ రాక అయ్యో! ఇదేమిటి? ఇక్కడున్నారు? ఎక్కడికీ ప్రయాణం? మీ యింట్లో దిగపెడతాను రండి. మతి స్థిమితం తప్పి ఎమైనా ఇట్లా తిరుగుతున్నారా?" అని వాపోయెను. నేనూ దుఃఖించాను. ఆతడు నా దగ్గర అంతవరకూ ఎంతో అణకువతో వుంటూ వున్నవాడు – దయనీయమైన అప్పటి నా స్థితికి బాధపడి అట్లా అన్నట్లున్నాడు. నేను అతనికి నచ్చచెప్పాను. "నాకు మనసు చెడలేదు. ఆరోగ్యం కోసమే నేనిప్పుడు వెడుతున్నాను. రెండు రోజుల్లో తిరిగి వస్తాను. కంగారు పడకు. నా మీది ఆదరమే నిన్నిట్లా పలికించింది. నాకు తెలుసు. భయపడకు. లైబ్రేరియన్‌తో నేనిట్లా వెళ్లుతున్నానని చెప్పు" అన్నాను. అతడే నాకు టికెట్టు కొని తెచ్చిపెట్టి రైలెక్కేదాకా నాతోనే వుండి ముచ్చటిస్తూ కూర్చుండెను.

---

౧. శ్రీ అబ్బూరి జగన్నాథరావు గారు.

౨. శ్రీ గురజాడ అప్పారావు గారు. ఆధునికాంధ్ర కవితా వైతాళికులు. శ్రీ శాస్త్రిగారికి సన్నిహిత మిత్రులు. వారు మదరాసు వచ్చినప్పుడల్లా శాస్త్రి గారిని కలిసేవారు. ఉభయులూ కలిసి వారి కోచ్ బండి మీద గైటీ టాకీసులోని మూకీ సినిమాలు చూచేవారట. గురజాడ వారి కన్యాశుల్క నాటక ప్రదర్శన చూచిన పిమ్మట శాస్త్రి గారు వారి కొక అభినందనలేఖ వ్రాశారు. దానిని విశాలాంధ్రవారు తమ కన్యాశుల్కం కొత్త ఎడిషనులో ప్రకటించారు.

౩. ప్రొఫెసర్ పోతరాజు నరసింహం పంతులు గారు మాస్టర్ సీవీవీ గారి ప్రథమ శిష్యులలో ప్రముఖులు. మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఫిలాసఫీ ప్రొఫెసర్‌గా పనిచేసినప్పుడు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు అసోసియేట్ ప్రొఫెసర్‌గా పనిచేసిరి.

౪. ధ్రువనాడి అనే సంస్కృత జ్యోతిష గ్రంథం సత్యాచార్యకృతము. అద్భుతమైన నాడీగ్రంథములు విరివిగా తమిళంలోనూ, సంస్కృతంలోనూ, అరుదుగా తెలుగులోను కలవు. ధ్రువనాడిలో మాస్టర్ సీవీవీ గారు సాక్షాత్ పరబ్రహ్మాంశమని కలదు. ధ్రువనాడి, పరాశరనాడి సంస్కృత భాషలో కలవు. భుజందర్ నాడి తమిళభాషలో ప్రసిద్ధమైనది. వివరాలకు ఇందే తుది ప్రకరణమును చూడదగును.

# 23. దివ్య దర్శనం

రైలు సాగింది. రైలు వేగాన్ని మించి నా మనోవేగం వుంది. మరునాడు ఉదయం ఎనిమిది గంటలకు కుంభకోణం స్టేషనులో దిగాను. కాలకృత్యాలు తీర్చుకుని, మంచి మామిడిపళ్లు కొనుక్కుని నరసింహం గారు ఇచ్చిన అడ్రసుకి బండి మీద వెళ్లాను. బండి వానికి ఆ యిల్లు బాగా తెలుసు. దారిపొడవునా అతను అక్కడి గురుదేవుల గొప్పదనాన్ని వర్ణిస్తుండగా ఉత్సాహంతో వింటూ వింటూ వుండగానే చేరవలసిన చోటుకి చేరాను.

ఒక సన్యాసి కాషాయం ధరించిన వారు, రోడ్డు మీద బండి ఆగగానే చేరవచ్చి నా తెలుగు తీరును గుర్తించి "ఎవరు నాయనా నువ్వు? ఎక్కడ నుంచి రావడం? ఎందుకోసం?" అంటూ తిన్నని తెలుగు పలుకుబడితో ప్రశ్నించారు. ఆలింగనంతోనే బండి నుంచి దించారు. ఆయన ఎదురువచ్చి పొదువుకొని బండి దించినప్పటి ఆనందాన్ని నేనెన్నటికీ మరచిపోలేను. నా చేతిలోని పండ్ల బుట్ట అందుకొని, త్వరగా లోపలికి వెళ్లి, నా సంగతులన్నీ శ్రీవారికి నివేదించి నన్ను దర్శనానికి వెంటపెట్టుకుని వెళ్లారు.

లావుగాక, సన్నమూ గాక, పొట్టీ కాక, మరీ పొడుగూ కాక, నిమ్మపండు ఛాయతో అరుణోదయ కాంతులు విరజిమ్ముతున్న శ్రీవారిని చూడగానే నా ఒళ్లు పులకరించింది. రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ జాబునర్పించుకొన్నాను. చదివి, నవ్వి "స్నానం చేసి, విశ్రాంతి తీసుకో" అన్నారు.

నాకు శ్రీవారి దర్శనం చేయించిన ఆ స్వాముల వారు నన్ను

స్వజనంగా (అయినవాణ్ణిగా) ఆనాడే కాక ఆయన జీవించి వున్నంత దాకా ప్రేమతో చూశారు. వారి పేరు సచ్చిదానందేంద్ర సరస్వతీ స్వామి్గ. అప్పటికి కొన్నేళ్లకు ముందు వారు బందరులో సన్యసించారు[32]. బ్రహ్మణ్యులు జంధ్యాల గౌరీనాథ శాస్త్రి ్రగారు వారికి ఉద్యోగం నుంచి పెన్షన్ ఇప్పించి, వారికి ఆశ్రయమిప్పించారట! ఆ కారణం చేత వారికి కృష్ణా మండలం వారంటే ఆదరం ఎక్కువ. వారి జన్మదేశం కాంచీ మండలం. తెలుగు బ్రాహ్మణులు. సన్యాసానంతరం వారు మహనీయులని ప్రసిద్ధి గాంచిన స్వాముల వార్లను కొందరిని దర్శించి విసుగు చెంది, శాంతి లేక తిరుగాడుతూ శ్రీవారి మహనీయతను విని వారి దగ్గర చేరి జీవితాంతమూ అక్కడే ఉండి పోయారట! శ్రీ కృష్ణుడి వెంట సాత్యకి వలె వారు శ్రీవారిని అనుసరిస్తూ అక్కడే వున్నారు.

నేను అప్పటికి తొట్టె స్నానం మీద అంత శ్రద్ధ పెట్టకపోయినా కారంలేని తిరగబోత లేని కూరలతోనే భుజిస్తూ వుంటిని. శ్రీవారితో నా స్థితిని విన్నవించాను. “ఇక నీ ఆరోగ్య రక్షణ భారం నేను వహిస్తున్నాను. భయపడక నలుగురితో పాటూ మామూలుగా భోజనం చేయవచ్చును. అందువల్ల నీకు ఎట్టి చెరుపూ కలగదు” అన్నారు వారు. ఆవాలు తెట్టె తేలుతున్న చారుతో, నూనె తిరుగపోత కూరలతో నేను ఆ రోజు భోజనం చేశాను. అంతకుముందు అలాంటి భోజనం చేస్తే కడుపులో మంటలు చెలరేగేవి. నిద్ర పట్టేది కాదు. అశాంతి అధికమయ్యేది. స్వాముల వారు నన్ను కంటికి రెప్పవలె కాచుకొని వుండి నా అనారోగ్యాది విషయాలను అడుగుతూ వుండిరి. అన్నీ చెప్పాను. మరునాటి రాత్రి వరకే నేనక్కడ వుండడానికి వీలవుతుందన్న సంగతి కూడా చెప్పాను.

**ఉపదేశం[33] :**

ఆనాటి సాయంకాలమే - యోగంలో మీడియముగా చేరిన తేదీ 22-06-1916 - మీడియం సంఖ్య 330 - ఆరు గంటలయేసరికి నాకు శ్రీవారి శిష్యతానుగ్రహం లభించింది. శిష్యతానుగ్రహం పొందడానికి సమకూర్చుకోవలసిన వాటినన్నింటిని స్వాముల వారి సహాయంతో సమకూర్చుకోగలిగాను. ఉపదేశ విధానాన్ని అంతా స్వాముల వారు విశదీకరించారు. శ్రీవారికి సాష్టాంగంగా నమస్కరించి నా వేడికోలుని విన్నవించుకొన్నాను. ఉపదేశం చేశారు. వెంటనే "నీవు హాలులోకి వెళ్లి ప్రేతాసనంలో[34] పడుకొని, నమస్కరించి, ఉపదిష్టాన్ని[35] (ఉపదేశించిన మంత్రాన్ని) ఒక్కమారే నోటితో అనుకొని, కళ్లు మూసుకొనే, శరీరం లోపల ఏదో జరుగుతుంది గనుక, ఏం జరుగుతోందో గుర్తిస్తూ వుండు. మనస్సు వెలుపలికెక్కడికైనా వెళితే వెళ్లనీ. నీవుగా దాన్ని అరికట్టే ప్రయత్నం చేయకు. అదే తిరిగి వస్తుంది. నువ్వు మాత్రం ఏమి జరుగుతుందో సాక్షి మాత్రుడివై వుండి గమనిస్తూ వుండాలనుకో. అంతే నువ్వు చేయాల్సింది. కొన్ని నిమిషాల దాకా కళ్లు తెరిచే యత్నం చెయ్యకు. ఒకవేళ నీవు యత్నించినా కళ్లు తెరవడానికి వీలు పడదు. మళ్లీ వాటంతటవే మూసుకుపోతాయి. శరీరంలో జరగవలసినదంతా జరిగాక కళ్లు తెరిపిడి పడతాయి. ఆ తరువాత కళ్లు మూసుకుని పడుకోవడం కష్టమనిపిస్తుంది. అంతదాకా కళ్లు తెరవడానికీ, లేవడానికీ కూడా కష్టమనిపిస్తుంది" అని స్వాముల వారు దగ్గరుండి తెలియజెప్పారు. ఆ ప్రకారమే ఉపదిష్టాన్ని (బీజాక్షరం)[36] ఒక్కమారే ఉచ్చరించి, కళ్లు మూసుకుని పడుకున్నాను ధ్యానంలో.

---

౧. సచ్చిదానంద సరస్వతీ స్వామి - మరిన్ని వివరములు సేకరింపవలెను.

౨. జంధ్యాల గౌరీనాథశాస్త్రి గారు (1862-?) వివరములు సేకరింపవలెను.

# 24. అనుభూతి

వెంటనే నాలో ఏదో గొప్ప ప్రజ్ఞ (శక్తి) ప్రవేశించి వూగించి వేస్తున్నట్లుగా అనిపించింది. ఉత్సాహంతో వినోదిస్తూ దానినే పరిశీలించసాగాను. 'ప్రజ్ఞ' అనో, 'శక్తి' అనో ఇంకేమనో నిర్దేశించి చెప్పదగినట్టి అపూర్వానుభూతి ఏదో నాలో ప్రవేశించి విజృంభించడం మొదలైంది. అది ఎక్కడ ఆరంభించిందో, ఏమి జరుపుతున్నదో అని తెలుసుకొనే వెతుకులాట ప్రారంభమయింది. అది శరీర చర్మంలోతట్టు దాకా వ్యాపిస్తున్నట్టు తెలుస్తున్నది కానీ మొదట అది ఎక్కడ ఆరంభమయిందో గుర్తు పట్టడానికి వీలు కానట్టుగా వుండింది. శరీరంలో ఏదో గొప్ప కొత్త ఇంజెన్ పనిచేస్తున్నట్టుగా అనుభూతి కలిగింది. నా మనస్సు ఆనందోత్సాహాలతో పొంగిపోసాగింది.

కొంతసేపటికి ఎడం చేయి నా వశం తప్పి నా సమ్మతి లేకుండానే పైకి లేస్తూ వుండడం, కుడి చెయ్యి కదులుతూ బాహుమూలంలో (భుజసంధి – చంక – లోతట్టున) చాలా బాధ కలగడం తెలియవచ్చింది. అంతకంతకు కుడి బాహుమూలపు బాధ అధికమవుతూ వచ్చింది. కాస్త సంకట పడ్డాను. అప్పటికి ఇంచుమించుగా పదిహేను నిమిషాలు దాటి వుంటాయి. స్వాముల వారు నన్ను 'సంకట పడుతున్నావు ఎందుకు?' అని ప్రశ్నించారు. కళ్లు తెరవడానికి వీలుపడక మూసుకొని వుండే బాహుమూలంలో చాలా బాధగా వున్న సంగతి చెప్పాను. మరికొన్ని నిమిషాలకు కళ్లు తెరిపిడి పడ్డాయి. శరీరంలోని సంచలనం తగ్గింది. తర్వాత మళ్లీ నమస్కారం చేసుకుని లేవవలసిందిగా పక్కనే వున్న స్వాముల వారు చెప్పారు. లేచాను. నా చేతికి (డిస్లొకేషను) బండి నుండి పడ్డప్పుడు బాహుమూలంలోని ఎముకల

గూడు స్థానం తప్పి బాధ పెట్టిన విషయం వివరించాను.

అప్పుడు వారు ఆ బాహుస్థితిని సరైన స్థానంలో చేర్చి చక్క చేసేందుకు జరిగే ప్రయత్నమే అది అనీ, నా బాహుమూలానికి గనుక అలాంటి అసౌకర్యం లేకపోతే కుడిచేయి కూడా ఎడంచేతితో పాటు లేచి నమస్కారం చేసే వీలుపడేదనీ, ధ్యానమంతా ముగిశాక వాటంతటవే రెండు చేతులూ లేచి నమస్కారముద్ర రావడం ఈ యోగ విధానంలోని అపూర్వానుభూతి అనీ, అట్లా చేతులు కూడుట యోగశక్తి చేకూడుటకు ఒక సంకేతమనీ వారు చెప్పారు. జరిగిన విషయమంతా శ్రీ గురుదేవులకు నివేదించమన్నారు. నేను శ్రీవారి సన్నిధిని చేరి జరిగినదంతా తెలుపుకున్నాను. వారు మోమున చిరునవ్వు వెలారుస్తూ "ఇక తృప్తితో వుండు" అని ఆదేశించారు. అట్లా ధ్యానం జరిగిన తర్వాత ఒక గంటసేపటికల్లా నా దక్షిణ హస్తమూలం (కుడి భుజం సంధి దగ్గర) చాలా వాచి బాధ కలిగించింది. టక్కు టక్కుమంటూన్న చప్పుడు వినవస్తూ, రెక్క గూడులో ఏదో కదలిక కనిపించింది. వాపు, బాధ ఎంత ఎక్కువగా వున్నా నాకది ఆహ్లాదంగానే అనిపిస్తూ వుండినది. మూడు నాలుగేళ్ల నుండీ ఆ చేతితో సరిగా పనులు చేసుకోలేక బాధపడుతుంటిని కదా! ఆ రోజు చేతి యెముకను క్లోరోఫారమిచ్చి సరిదిద్దిన డాక్టరు తర్వాత కొన్నాళ్ల దాకా నా చేతిని మెలిపెట్టి, నలిపి, చెరిపి ధనాశతో నన్ను చాలా పీడించెను కనుక నా రెక్కగూడు చక్కబడకే వుండెను. ఆ జబ్బ గూటి కండరాలు గజిబిజి అయిపోయినవి. అవి అన్నీ ఇప్పుడు చక్కబడుతున్నవి కాబోలు నన్న సంతోషం నాకు ఆ చావు బాధను తట్టుకొనేట్లు చేసింది. నా చేతి వాపును చూసి అక్కడి వారు "అదియేదో రెక్టిఫికేషన్ జరుగుతున్నది. భయపడకు"

అని తోడు పలికారు. ఎన్నేళ్ల నుంచో నిద్ర లేక కొట్టుకాడుతున్న వాడను నేనా రాత్రి కొంత హాయిగా నిద్రపోయాను.

మరునాడు ఉదయాన్నే లేచి కాలకృత్యాలు తీర్చుకుని యోగానుభూతికి సిద్ధంగా ఉన్నాను. ముందురోజు సాయంకాలం ఆ వూళ్లోని యోగసాధకులు చాలా మంది వచ్చి వుండిరి. వాళ్లందరూ ఆ ఉదయాన కూడా సమావేశమైనారు. పూర్వదినము సాయంకాలం జరిగినట్లే నాకు ఆనాటి ఉదయం కూడా జరిగింది. అప్పుడు అక్కడున్నవారిలో రాధాకృష్ణ పిళ్లై[2] అనీ, మహదేవ అయ్యరు[3] అనీ ఇద్దరు ముఖ్య శిష్యులున్నారు. వారు నా విషయాన్ని శ్రీవారికి విన్నవించారు. అప్పుడు నా విషయమై టెస్టు[3] తీయవలసిందిగా శ్రీవారు వారికి ఆజ్ఞాపించారు.

ఆ విచిత్ర విషయమేమిటో ఆనాడే నేను మొట్టమొదటిసారిగా తెలుసుకున్నాను. నన్ను వారు దగ్గర కూర్చోమన్నారు. రాధాకృష్ణ పిళ్లై గారు గురుదేవులకు నమస్కరించి కళ్లు మూసుకుని, ఒక నిమిషమయిన తర్వాత ఇంగ్లీషులో ఏదో గ్రంథాన్ని పఠిస్తున్నట్లుగానే చెబుతూ వచ్చారు. మహాదేవ అయ్యరు గారు దానినంతా వేగంగా రాస్తూ వచ్చారు. ఇద్దరూ ఎఫ్.ఏ (ఆరోజుల్లో అది ప్రీ యూనివర్సిటీ చదువు) చదివినవారు, ప్రజ్ఞా నైపుణ్యాలు గలవారు. పిళ్ల గారు ఎంత వడిగా చెప్పారో అంత వడిగానూ అయ్యరు గారూ వ్రాశారు. ఉదయం సరిగా 9–17 నిమిషాల సమయానికి ఆ కార్యం ఆరంభమయింది. పిళ్లై గారు కళ్లు మూసుకున్నప్పుడు వారి ఆంతర దృష్టికి కనపడినవి, ఆంతర శ్రుతికి వినపడినవీ వారు చెప్పసాగారు. అప్పుడు నా శరీరాంతర్భాగాన గల స్వాస్థ్యమూ, అస్వాస్థ్యమూ, నా మనోభావాలూ, నా అనారోగ్య కారణాలు, వాటి నివారణోపాయాలూ,

అప్పటి వరకూ జరిగిన పూర్వ జన్మలూ, మొదలైనవి అందులో వున్నవి. అదంతా రాసి ముగించిన తర్వాత శ్రీవారి చెంతకు వెళ్లి దాన్ని వినిపించారు. వారి సమ్మతి మీద ఆ విషయాన్ని రికార్డు చేసి వుంచారు. ఆ కాలంలో యోగాభ్యాసానికి వచ్చి శిష్యతను పొందగోరిన వారికందరికీ అలాంటి టెస్టు[3] చేయడం జరుగుతూ వుండేది. నన్ను గూర్చిన రికార్డు కాపీని కోరాను. శ్రీవారి సమ్మతితో దాని కాపీ నాకిచ్చారు. అది నా దగ్గర వున్నది[4].

---

౧. సి. రాధాకృష్ణ పిళ్లై.

౨. మహదేవ అయ్యర్ – వీరిరువురు మాస్టర్ సీవీవీ గారి ముఖ్య శిష్యులు. వారికి మాస్టర్ యోగమార్గమున సైట్ అనబడే దివ్యదర్శన శక్తులుండేవి.

3. టెస్టు – మాస్టర్ యోగమార్గమున టెస్టు అనునది ఆధునిక శాస్త్ర యుగమున స్కానింగ్ / స్క్రీనింగ్ ల వంటిది. ధ్యానమగ్న స్థితిలో వారికి శరీరాంతర్భాగములోని చైతన్య ప్రసారము గోచరించెడిది.

౪. శ్రీ శాస్త్రిగారి ఇనిసియేషను కార్డు, వారి టెస్టు రిపోర్టు ప్రజ్ఞాప్రభాకర రచనా కాలము వరకూ శాస్త్రి గారి వద్దనే భద్రముగా ఉండెను. భారత స్వాతంత్ర్య దినోత్సవము నాడు స్వతంత్ర పతాకమును తిరుపతిలో ఇంటి మేడ మీద ఎగురవేసినప్పుడు గురుదేవులు ఆ రెండింటినీ యోగమిత్రులకు చూపించారు. ఆ తరువాత అవి రెండూ ఏమైనవో ఆచూకీ తెలియలేదు. చివరకు శాస్త్రిగారి టెస్టు రిపోర్టు మాత్రము విజయవాడలోని డా॥ గూడూరు నమశ్శివాయ గారి ద్వారా టైప్డు కాపీ లభించగా దానిని డా॥ పోచిరాజు శేషగిరిరావు గారు 'ప్రభాకర వరివస్య' లో ప్రకటించారు. వారి ఇనీసియేషన్ కార్డు మాత్రము నాటికీ నేటికీ లభించలేదు. మా అమ్మగారు మహాలక్ష్మి గారి కార్డుగా గుర్తింపబడినది మాత్రము మా రికార్డులలో భద్రముగా ఉన్నది. దాని స్వరూపమును మణి మంజరి సంచికలోనూ మా ప్రజ్ఞాప్రభాకరము 1986 ఎడిషనులోనూ ప్రకటించాము. ఇందులోనూ ముద్రిస్తున్నాము.

# 25. దివ్యబోధ

ఆ రోజు రాత్రే మెయిలులో నేను తిరిగి మద్రాసు వచ్చేయవలసి వుంది. కాబట్టి నా విషయాన్ని గురించి శ్రీవారితో సంభాషించడానికి అవకాశం కోరాను. నా అభ్యర్థనాన్ని మహదేవయ్య గారు శ్రీవారికి నివేదించారు. భోజనానంతరం సంభాషించడానికి శ్రీవారు అనుమతించారు. అప్పుడు వారు యోగ విషయాలు గురించి వారి అర్ధాంగి ద్వారా యేవేవో అపూర్వాంశాలను సేకరిస్తూ వుండిరి. భోజనం అయిన తర్వాత నేను వారి చెంతకు వెళ్లి సాష్టాంగ నమస్కారం చేసి ఇట్లా విన్నవించుకున్నాను – "మూడేళ్ల నుంచీ యమ బాధ పడుతున్నాను. నిద్ర లేదు, శాంతి లేదు, ఆకలి, జీర్ణశక్తి సరిగా లేవు. ఇక్కడికి వచ్చే విషయం తలపున తాకీ తాకంగానే నాకు తెలియకుండానే ఆనాటి రాత్రి నేను సరిగా భోజనం చేయగలిగాను. మీ యోగ మహాత్మ్యం శ్రీ నరసింహంగారి ద్వారా వినంగానే నాలో ఏదో దివ్య సౌఖ్య సౌధంలోనికి దారి ఏర్పడుతున్నట్లుగా అయింది. ప్రశాంతంగా రాగలిగాను. రైలులో కొంత నిద్ర పట్టింది. ఇక్కడికి వచ్చిన తర్వాత కడచిన రాత్రి సుఖంగా నిద్రించగలిగాను. నూనె తిరుగబోత, ఆవాలు, సాంబారు, రసము, పల్చని మజ్జిగ ఇవి యింతకు ముందు నాకు కడుపులో మంటలు రేపేవి. ఇప్పుడు అవి వికటించలేదు. మీరు నిర్భయంగా అందరితోనూ భుజించమన్నారు. అట్లాగే చేశాను. పూర్వం తీవ్రమైన మందులు పుచ్చుకున్నాను. అది మొదలుగా కడుపు ఉడికి పోతున్నట్లుగా వుండేది. ఇవాళ అట్లా లేదు. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్'ౢ అని 'బతికి వుంటే బలుసాకు ఏరుకుని తినవచ్చు' అని వుంది గనుక నేను మీ సేవకుడనుగా మీ దగ్గరే వుండాలని కోరుకుంటు న్నాను. ఇక్కడే నాకవసరమైన జీవిక ఏదైనా సమకూర్చుకొంటాను. అనుగ్రహించండి" అని వేడుకొన్నాను.

వారు "నీకిప్పుడు జీతమెంత?" అని అడిగారు. "ఏభై రూపాయలు" అన్నాను. "దీనితో నువ్వు నీ కుటుంబాన్ని పోషించుకోవచ్చును. ఉన్న జీవికను మానుకుని ఇక్కడ వుండడమెందుకు? బండి నడుస్తుండగానే రిపేరు సాగవలెను. బండి వూడదీసి చేస్తే బండి వాని జీవిక చెడదూ! అట్టిది నా యోగమార్గం. సాగుతున్న ప్రవృత్తికి భంగం వాటిల్లకూడదు. ఇది నివృత్తి మార్గం కాదు. రాజయోగ మార్గం. గార్హస్థ్యం వుండాలి. సన్న్యాసి కారాదు. సౌఖ్యం వుండాలి. ఆహారాదులు సరిగా ససిగా తీసుకొంటూ వుండాలి.

ఇందుకు నీవు నీ ఉద్యోగంలోనే వుండడం అవసరం. నీ ఉద్యోగం నీ జీవికకే కాక లోకానికి కూడా ఉపకారకం. ఆరోగ్యవంతుడవై నీవు నీ ఉద్యోగంలోనే వుంటూ తిన్నగా పనులు చేసుకో. నీవు ఇక్కడ వుండి పోవాలనుకోవడం నా సన్నిధి లాభాన్ని కోరే కదా! నేను సదా నీలో వుంటాను. నీకు కావలసిన సహాయం నీలోంచి జరుపుతూనే వుంటాను. ఇక్కడ ఏ విధంగా నీ శరీరంలో సంస్కారం జరగడం గుర్తించావో అదేవిధంగా నువ్వెక్కడున్నా అనుభూతిని పొందగలవు. ఉదయం జరిపిన యోగ సాధనం శరీరంలో సాయంకాలం దాకా పనిచేస్తూనే వుంటుంది. ఎప్పుడెప్పుడు ఎంతెంత జరగాలో అంతంతా జరుగును" నీలో వుండి సంస్కారం జరిపేది ప్రజ్ఞతో కూడుకొన్న చైతన్యమే కానీ అది జడశక్తి కాదు. అది ఎలక్ట్రిసిటీ లాగా పనిచేసేది కాదు. ఎలక్ట్రిసిటీ హద్దుదాటి అక్రమంగా ఉపయోగిస్తే కీడు తేగలదు. నీలో ఇప్పుడు ప్రవేశించిన ప్రజ్ఞ నీవు అధికంగా ఉపయోగించు కోవాలని కోరుకొన్నా అది అట్లా పనిచెయ్యదు. ఎంత అవసరమో అంతే చేస్తుంది. కావాలనుకొన్నా నీవు ఆవశ్యకత కన్నా ఎక్కువగా కళ్లు మూసుకుని వుండలేవు. లోపల ఆవశ్యకమైన పని జరుగుతుండగా కళ్లు తెరవనూ లేవు. ఏదైనా ఆకస్మికంగా వేరే పని పడడమో, ఎవరో మధ్యలో పలకరించడమో జరిగినా అప్పుడు ధ్యానానికి అడ్డమైందే అని జంకనక్కర

లేదు. "ఇట్లా తొందర కలిగింది. దాన్ని చేయ వలసి వచ్చింది" అని ప్రార్థనా పూర్వకంగా అంతరాత్మకు విన్నవించుకుని ఆ పనేదో ముగించుకోవచ్చును. అది ముగిసిన తర్వాత జరుగవలసిన యోగసాధన జరుగగలదు. ప్రయాణంలో, రైలులో, బండిలో, నడకలో, ఇంకా ఏవైనా వ్యవహారాలలో వుండవలసి వచ్చినప్పుడు, సరైన వేళ తప్పకుండా ఒక క్షణకాలం మనస్సున తలిస్తే చాలును. కార్యాంతరాలు తీరి విశ్రాంతి కలిగినప్పుడు జరగవలసిన యోగసాధనమంతా జరగగలదు.

వివేకాన్నీ, సత్యాన్నీ, ధర్మాన్నీ, గుర్తించుకొంటూ, అంతరాత్మ నారాధిస్తూ, లోలోపలికి చొచ్చుకొని పోతున్న కొద్దీ నీకు వలసిన ఉద్బోధములు లభిస్తాయి. అలాంటి ఉద్బోధాలను నీవు నీలో ఎక్కడ నుంచి ఎట్లా అందుకొంటున్నావో క్రమక్రమంగా నువ్వే తెలుసుకోగలవు. ముందుగా నీ దృష్టి ఆరోగ్య లాభం మీద ఉంది. ఆరోగ్యం లేకుండా నువ్వు ఏమీ పొందలేవు. కాబట్టి ముందు నీకు ఆరోగ్యమే. ఆ తర్వాతనే యోగ సాధన ఫలాన్ని నీవు పొందగలవు. గాఢంగా నమ్మితే నీకు యోగఫలం వస్తుందని నేను అనడం లేదు. నీకు ఆ విశ్వాసాన్ని కలిగించవలసిన వాడను కూడా నేనే. నీవు మాత్రం పరమార్థ కుతూహలివిగా వుంటే చాలును. యోగసాధనం ఉత్తకడుపుతో వుండి చేయకూడదు. ఏదైనా ఆహారం తీసుకొనే చెయ్యాలి. మదరాసులో ఈ యోగ మార్గాన నడుస్తున్న మిత్రులు చాలామందే ఉన్నారు. తరచుగా వారిని వెళ్లి కలుసుకుంటూ వుండు. వీలు కలిగినప్పుడు ఇక్కడికి వస్తూ వుండు. ముఖ్యంగా డిసెంబరు చివరివారంలోనూ, మే నెల తుది వారంలోనూ ఇక్కడ యోగ గోష్ఠులు జరుగుతాయి. అప్పుడు తప్పకుండా వస్తూ వుండు." అన్నారు.[38]

నా కన్నుల వెంట ధారలుగా నీరు కారినవి. ఈ శ్లోకాన్ని రచించాను.

"దుర్వ్యాధిఖిన్నే శరణం ప్రపన్నే
మయి ప్రసాదా దయి మాస్మభైషీః
త్రాతా హమస్మీతి దదా వభీతిం
యస్తం గురుం మస్తకతో నమామి."[2]

ఇట్టి సంభాషణ జరుగుతూ ఐదారు నిమిషాలు గడిచాయి.

ఆ రోజుల్లో వారు ముఖ్యమైన తత్త్వార్థాలను, సహస్రారము, పిట్యూటరీ,[3] అక్కడి దివ్య శక్తులు, వాటి ప్రసారమూ, మొదలయిన వాటిని గురించి శిష్యులకు బోధిస్తూ దివ్యదృష్టితో వాటిని ముఖ్య శిష్యులు పరికించి చూడగలిగేటట్లు అనుగ్రహిస్తూ, ఇంకా వాటిలోని విషయ విశేషాలను మాతృశ్రీ (మదర్ గారి)[4] ద్వారా తాము అపూర్వంగా సేకరిస్తూ వుండేవారు. కాబట్టి అప్పుడు నాకంతకంటే అధికంగా, ప్రత్యేకంగా, వారితో సంభాషించడానికి అనువు (వీలు) పడలేదు.

---

౧. "ఏదైనా మంచిపని చేయాలంటే ఉండవలసినది మొదటగా ఈ శరీరమనే ధర్మసాధనమే" – ఈ సూక్తిని కాళిదాసు కుమార సంభవం 5-33 లో గుర్తింపబడినది.

౨. శ్లోకానువాదము :
వ్యాధిని బడి ఖిన్నుడనై
వేదనతో శరణువేడ "వెఱవకుమోయీ
బాధలు తీ"ర్తని దయతో
బోధించిన గురుని భక్తి పూజించునతిన్.

3. మాస్టర్ సీవీవీ వారి నూతన యోగ మార్గమున మంత్రములన్నియూ ఆంగ్లభాషలో కలవు. శరీర శాస్త్రమునకు సంబంధించిన ఇట్టి పారిభాషిక పదములును కలవు. వైద్య పరిభాషలోని యీ పిట్యూటరీ గ్రంథి మానవ మస్తిష్కములో శనగ గింజంత పరిమాణంలో ఉంటుంది.

౪. మాతృశ్రీ వెంకమ్మ గారిని "ది మదర్" అని పిలుతురు. వారు మాస్టర్ సీవీవీ వారి ధర్మపత్ని. యోగసాధనలో మాస్టర్ గారితో సంపూర్ణముగా సహకరించి ట్రాన్సులో అనేక సందేశముల నందించిన దొడ్డ యిల్లాలు.

# 26. చేకూడుట

మరలా సంధ్యా సమయంలో అక్కడి శిష్యులు చాలామంది యోగ గోష్ఠికి వచ్చి చేరుకున్నారు. భగవద్ఘట్టమనే పేరున్న కావేరీ ఘట్టంలోనే శ్రీవారి సన్నివేశ స్థలానికి ఎదురుగా వున్న యోగశాలలో అందరూ సమావేశమై యోగసాధన చేయడం జరుగుతున్నది. బాగా వాచి వున్న నా చెయ్యి ఆనాటి సంజ ప్రార్థనలో ఎంతో చక్కబడింది. వాపు, తీపు తగ్గినవి. నాలో లోలోపల ఎక్కడో చిరువెల్గు గోచరిస్తున్నట్టూ, నేను దానిని చేరబోతున్నట్టూ, స్వప్నప్రాయంగా లీలగా కొంత గోచరింపసాగింది. శరీరంలో బ్యేటరీ పెట్టి నరాలన్నిటినీ వూగించి వేసినట్టుగా గొప్ప వూపు కలిగింది. చేతులు వాటంతటవే లేచి నమస్కార ముద్ర వచ్చింది. కాని కుడిచేతి బాధ ఇంకా వుంది. టక్కు టక్కుమని జబ్బ యెముక అదరడం తెలుస్తూ వున్నది.

శరీరంలో ఇంత తీవ్ర సంచలనం కలగడమేమిటి? ఇది ఎక్కడ నుంచి ఆరంభమై జరుగుతోంది? ఇంతదాకా ఎన్ని శ్లోకాలో, ఎన్ని మంత్రాలో, ఎన్ని ధ్యానములో, ఎన్ని క్షేత్రములో, ఎన్ని దేవతా దర్శనాలో, ఎందరెందరి ఆశ్రయాలో జరిపాను గానీ యిలాంటి విశేషం ఎక్కడగానీ, యెప్పుడు గానీ గుర్తించలేదే! ఒక్కసారి ప్రార్థన చేసినంత మాత్రం చేతనే ఇంత జరగడమేమిటి? ఉందో లేదో అన్నట్టుగా వున్న పరతత్వం అస్తి (ఉంది) అన్నంత స్పష్టంగా అనుభవానికి వస్తున్నట్లున్నదే! దీని లోతు ఏదో తెలుసుకోవాలి కదా! దారి దొరికింది కదా! నా ప్రార్థనను నాలో ఎవరో వింటున్నట్టూ – సమాధానం చెబుతున్నట్టూ, అనుగ్రహిస్తున్నట్టూ తెలుస్తున్నదే! ఎంత వింత! నా జబ్బు నాకు చాలా ఉపకారమే చేసిందా

యేమి? ఇక నా జబ్బు కుదిరినట్టే తోస్తున్నదే! ఏమి ఆనందము! ఏమీ లేకపోతే నా చెయ్యి ఇట్లా వాచడమేమిటి? నా వశం తప్పి రెండు చేతులూ వాటంతటవే లేచి నమస్కార ముద్ర రావడమేమిటి? చేకూడుట ఏమి? అసలు "చేకూడుట" అన్న పదాన్ని కల్పించినవారెవరు? ఈ రెండు చేతులూ లేచి కలిసి నమస్కరించడాన్ని సూచించేదిగా ఏర్పడిందా యేమి యీ చేకూడు, కైకూడు అనే పదకల్పనం? నేను ఆరోగ్యవంతుణ్ణైతే మా వాళ్లెంత సంతోషిస్తారు! మా వారినందరినీ ఈ యోగంలో చేర్చగల్గుదునా యేమి? ఇలాంటి భావాలు నాధ్యాన సమయంలో మెరుపులు మెరిసినట్లయి విజృంభించాయి. ఆ నాటి నా స్థితి నాకొక కొత్త జన్మ కలిగినట్టుగా ఉండినది. ధ్యానం ముగియగానే నా ఉత్సాహాన్ని అక్కడి మిత్రులందరికీ తెలియజేశాను. అక్కడ సమావేశమైన వారూ తమ తమ అనుభూతి విశేషాలు కొన్నింటిని పంచుకున్నారు.

# 27. శ్రీ మాస్టరు గారు

అప్పుడు శ్రీవారి జీవిత చరిత్రము తెలుసుకోగోరి అక్కడి వారినడిగాను. పూర్వమెప్పుడో శ్రీకృష్ణదేవరాయల పాలన కాలంలో కాబోలు తెలుగుదేశం నుంచి తంజావూరు రాజ్య సంరక్షణకై వెళ్ళిన వారిలో వీరి పూర్వులు ముఖ్యులనీ, కుంభకోణంలోనే భగవద్ఘట్టం దగ్గర చాలా యిళ్లు వీరి పూర్వులవే అనీ, వీరి పూర్వులొకరు కావేరీ తీరాన
కుంభకోణంలోనే భక్తిపుర్ి (భాగవతపురం) అనే అగ్రహారం 39
నెలకొల్పారనీ, వీరు బాల్యంలో చాలా ఐశ్వర్యవంతులనీ, ఇప్పటికీ చాలినంత సంపత్తి గలవారే అనీ, ఇంటి పేరు కంచుపాటి వారనీ, శ్రీ వేంకాస్వామి గారని శ్రీవారి నామధేయమనీ తెలుసుకొన్నాను. అప్పుడు వారికి సంస్కృతం వచ్చునా అని అడిగాను. సాంఖ్యయోగ వేదాంతాది శాస్త్రాలు సంస్కృత భాషలోనే కలవు. కాబట్టి ఆ భాష రాకుండా ఆయా శాస్త్ర విషయాలు తెలియవుగదా అన్న భావంతోనే నేనట్లా అడిగాను. వారికి సంస్కృతము రాదనీ చిన్ననాడే ఆయా శాస్త్రాంశాలన్నిటినీ ఆంగ్ల భాషలో చదివి వాటిల్లోని సారార్థమంతా గ్రహించారనీ, సంప్రదాయ బద్ధంగా శాస్త్రాలు చదివిన వారికంటే ఎన్నో అపూర్వార్థాలు వారెరుగుదురనీ, అతిలోకానుభూతులెన్నో అనుభవించినవారనీ, శాస్త్ర పండితుల తోడి వారినిగా వీరిని అనుకోకూడదనీ, క్రమంగా అన్ని విషయాలూ నీకే బోధపడగలవనీ అక్కడివారు చెప్పారు.

ఇంగ్లీషు భాషలో ఉపదేశార్థాలుండడమేమిటి? పవిత్రమైన సంస్కృతమున్నది కదా. అది రాక యిట్లా చేస్తున్నారా? శ్రీవారు మహనీయులని చూస్తుంటేనే తెలిసిపోతున్నది. నిజమే కానీ, వీరికి

మీసాలున్నవేమిటి? ప్రాచీన మహనీయుల సంప్రదాయానికిది విరుద్ధం కాదా? అని నాలోనే ఏవేవో కొంతసేపు చీకాకులు కూడా కలిగాయి. కొంతసేపటికి వాటికన్నింటికీ సమాధానాలు తోచినవి. తర్వాత కొన్నాళ్లకు విచారించి తెలుసుకోగా ఆ సమాధానాలన్నింటినీ శ్రీవారే పలుమార్లు చెప్పుతుండినట్లు తెలియ వచ్చింది.

'యస్యనాస్తి స్వయంప్రజ్ఞా శాస్త్రం తస్యకరోతి కిమ్?
లోచనాభ్యాం విహీనస్య దర్పణః కింకరిష్యతి?'.[40]

అన్నట్టుగా స్వయంప్రజ్ఞ కలవారే శాస్త్ర నిర్మాతలు – అలాంటి వారికి ప్రాచీన శాస్త్రాది పఠనం తమ ప్రజ్ఞకు గల అపూర్వతను గుర్తించడానికి ఉపయోగపడుతుంది గానీ ప్రజ్ఞోద్బోధమన్నది స్వయంగా సమకూడ వలసిందే. ప్రాచీన శాస్త్రాలు దాన్ని పుట్టించలేవు[41].

"శాస్త్రాణాం విషయ స్తావ ద్యావ న్మంద రసాజనాః
ప్రవృత్తే రస శాస్త్రే తు న చ శాస్త్రం న చ క్రమః"[42]

"తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః
నానుధ్యాయా ద్బహూన్ ఛబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్"[43]

"విహాయ శాస్త్రజాలాని య త్సత్యం త దుపాస్యతామ్"

ఇలాంటి సూక్తులు స్ఫురణకు వచ్చి భాషలో ఏముంది! విషయం కదా ప్రధానమైనది! ఏ భాష అయితే నేమి? అందులోనూ జాతి, మతం, దేశం, భాష అనే పరిచ్ఛేదాలు లేకుండా సర్వసమానంగా సాగవలసిన యిటువంటి మహత్తరమైన యోగ పద్ధతికి – నేడు ప్రపంచ వ్యాప్తంగా

వున్న ఆంగ్ల భాషే సరిపడినదేమో! కాక, సంస్కృత భాష కటువంటి పూజ్యత మన మహర్షులు తమ ఉద్బోధములన్నింటిని ఆ భాషలో వెలయించడం చేతనూ, మన ప్రాచీన శాస్త్రాలన్నీ ఆ భాషలోనే వుండడం చేతనూ, ఏర్పడిందే కదా! ఉపనిషత్తులూ, వేదాలు అన్నీ ఆ భాషలో వుండడం వల్లనే దానికా ఘనత వచ్చింది. అట్టి వాటిని ఇప్పుడూ వెలయించగల వారుంటే వారు వాటిని ఏ భాషలో వ్రాస్తారో ఆ భాషకే అలాంటి పూజ్యత తప్పకుండా కలుగుతుంది. ఇప్పుడు ఆంగ్ల భాషకూ అలాంటి యోగ్యత కలదని అంగీకరించక తప్పదు. నేడు ఎందరో మహనీయులు ఆ భాషలో అనేక అపూర్వ శాస్త్రార్థాలను వెలయిస్తున్నారు. వీటిని పరిగణనలోకి తీసుకోకుండా తోసి పుచ్చడం సాధ్యం కాదు. కనుక శ్రీవారి యోగోపదేశం, భాషామాధ్యం ఆంగ్లంలో వుండడంలో లోటేమీ లేదు.

ఇంకా వారి ఆకృతి మహనీయతకు మీసాలుండడం, మొగాన బొట్టు లేకపోవడంలాంటివి కొరతను కల్పించలేవు. శైవ వైష్ణవాది మత భేదాల్ని పాటించేవారు కారు కాబట్టి వారు మొగమున తన్మత చిహ్నాలను ధరింపకుండా వుండి వుండ వచ్చును. వారు నెలకొల్పినది మహారాజయోగం కాబట్టి దీనికి బోడితల, కాషాయ వస్త్రాలు మొదలైనవి వుండనక్కరలేదు. మీసాలుండడం లేకపోవడం వల్ల వచ్చే ఎక్కువ తక్కువలేమీ వుండవు. ఈ సమాధానాలు తోచి నా మనసులోని మకిలను తొలగించినవి.

కొంతకాలమయిన తర్వాత మళ్లీ నేను కుంభకోణం వెళ్లినపుడు శ్రీవారే నేను అడుగకుండానే ఈ విషయాన్ని గురించి ఇట్లా అన్నారు. “నాకు శిష్యులుగా వుండేవారెవరూ లోకానికి విడ్డూరంగా తోచే వేషభాషలతో

వుండడం మంచిది కాదు. నలుగురితో పాటుగానే వుండాలి. ఈ యోగంలో ఎవడు గానీ ప్రత్యేకంగా కడతేరలేడు. తాను, తన చుట్టూ వున్నవారూ, తన ఆప్తులూ, అనే క్రమంలో ప్రేమ వ్యాపకమయ్యే తీరుననుసరించి తానూ, తన చుట్టుపట్టుల వున్నవారూ, తన ఆప్తులూ, అనే క్రమంగా లోకాన్నంతటినీ ప్రేమించి, లోకాన్నంతటినీ కడతేర్చేవాడుగా కావాలి. తన ప్రేమ సర్వలోక వ్యాపకం కానంత వరకూ ఎవ్వడు గానీ కడతేరలేడు. అఖండమూ, సర్వ వ్యాపకమూ అయిన తత్వాన్ని పొందడానికి తానూ అఖండుడూ సర్వ వ్యాపకుడూ కాక తప్పదు. దేశ, కుల, మత, జాతి వగైరా పరిచ్ఛేదాలతో (వేరు భావనలతో) వేరుపడిపోయి సర్వ ప్రజతో సామరస్యాన్ని కుదుర్చు కోలేనివాడు సంసార బంధంలో కొట్టుకాడ వలసిన వాడే అవుతాడు. బహిర్ముఖంగా సాగుతున్న బహుత్వాన్ని సాగనిస్తూనే అంతర్ముఖంగా తిరిగి అందులో ఏకత్వాన్ని గుర్తించి వర్తించడమే ఈ యోగ సాధనకు ఒక ఫలితము. మన పరిపూర్ణత భవిష్యత్తులో వున్నది కాని అది యింకా భూతము కాలేదు. కనుక భూతమనే పీఠిక మీద నెలకొని భవిష్యత్తులోనే మనమా పరమార్థాన్ని అనుభవించవలసి వున్నది”.

శ్రీవారి దివ్య ప్రజ్ఞలలో ఇది ఒక్కటి! ఏమిటంటే ఎవరైనా లోలోపల ఏదైనా సందేహమో, వ్యాకులపాటో కలిగి సన్నిధికి చేర వస్తే శ్రీవారిని తాము అడుగకుండానే, తమనూ శ్రీవారు పలకరించకుండానే దానికి సమాధానం తమ యాదృచ్ఛిక సంభాషణ సందర్భంలోనే వెల్లడిస్తూ వుండేవారు. లేదా ఎవరైనా ప్రశ్నకు సమాధానాన్ని అడిగి తెలుసు కోవాలనుకొని వారి సన్నిధికి వచ్చేంతలోనే శ్రీవారు చెప్పనవసరం లేకుండానే అడిగే వారికి ఆ సమాధానాలు వ్యక్తంగానో స్ఫురణ రూపాననో వచ్చేసేవి.

ఒక చిన్న దృష్టాంతం – ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంటులో ఉద్యోగిగా వున్న ఒక శిష్యుణ్ణి ఎక్కువ జీతంతో ఉద్యోగమిస్తాము స్వీకరిస్తావా అని పై అధికారులు అడిగారు. ఆ రోజు సాయంకాలం టపాలోనే దానికి బదులు రాసి పంపాలి. ఈ విషయాన్ని అడిగి తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో మదరాసు నుంచి ఉదయం వచ్చి శ్రీవారికి అతను వివరించెను. 'సరే టపా వేళలోగా యోచించి చెపుతాలే' అన్నారు. సాయంకాలం టపావేళ దాటిపోవచ్చింది. శ్రీవారు అతనికింకా ఏ బదులూ చెప్పలేదు.

అతని ఆలోచనలు తీవ్రస్థాయినందుకొన్నవి. అనుకూలంగానూ, ప్రతికూలంగానూ యుక్తులూ, ప్రతియుక్తులూ గుప్పు గుప్పుమని పైకుబికినవి. త్రాసున తూచగా 'వెళ్లవద్దు' అన్న పక్షానికే బరువు ఎక్కువైనట్టు తోచింది. వెంటనే ఆ మాటే సమాధానంగా జాబు వ్రాసెను. "మరి శ్రీవారు బదులు ఏమీ చెప్పలేదు కదా! ఇక ఆలస్యం చేయకూడదు, కనుక దీనినే పోస్టు చేస్తాను" అనుకొని యోగశాల నుంచి బయటికి వచ్చెను.

శ్రీవారు తమ యింటి వాకిలి దగ్గరే ఉన్నారు. రమ్మని కనుసైగ చేశారు. చేరుకోగా "చేతిలో ఏమిటది?" అన్నారు. అతడు 'బదులు రాశాను. అనుకూల పక్షాన్ని ఆలోచించి తర్కించుకోగా ప్రతికూల పక్షమే ప్రబలంగా తోచింది. తామేమి సెలవిస్తే అదే చేస్తాను. టపా వేళ దాటుతోంది. కనుక నాకు తోచిన మాటే రాశాను. ఇందుకు భిన్నంగా మీరు సెలవిస్తే అలాగే చేస్తాను.' అన్నాడతను. 'ఈ జాబే పోస్టు చేసిరా' అన్నారు శ్రీవారు. అతడు అలాగే చేసెను. ఆ తరువాత ఇంకో సందర్భంలో శ్రీవారిట్లా చెప్పారు – 'మీకేమైనా సందేహాలు తోస్తే, తోచినవాటి బదుళ్లు ఆలోచించకుండా వాటిని అట్లాగే జాబు రాయడమో నన్ను అడగడమో చేయవద్దు. మీకు చేతనైనంత

వరకూ దాని సమాధానం మీరే ఆలోచించి తెలుసుకునే ప్రయత్నం చేయండి. ఎంతకూ సమాధానం దొరకని వాటినే నన్నడగండి. న్యాయమైన, ఒప్పిదమైన ప్రశ్న ఎవరికైనా తోస్తే ఆ ప్రశ్నలోని ఘనతను బట్టి దానికి తగినంత పాటి యత్నం చేస్తే సరైన సమాధానమే దొరుకుతుంది. ఆ యత్నం బహిర్ముఖంగా ప్రాచీన గ్రంథాల వల్లనో, విజ్ఞులైన తమ ఆప్తుల వల్లనో తెలుసుకోదగిందిగా వుంటుంది. అదే అంతర్ముఖమైతే ఉద్బోధ రూపంగా ఉంటుంది. ఈ యోగం అలాంటి ఆత్మోద్బోధలను కలిగించడానికే అని తెలుసుకోండి.

బహిర్ముఖంగా సమాధానం తెలుసుకోగోరితే 'అనంత శాస్త్రం బహువేదితవ్యం',[44] ఆయా శాస్త్రాలూ తత్తత్కర్తలూ పలు భిన్న దృక్పథాలు గలవారు. అందులో ఎవరిది గ్రాహ్యమో (గ్రహించదగినదో) తేల్చవలసింది తిరిగీ ఆత్మోద్బోధమే. ఘట్టకుటీ ప్రభాత న్యాయం[45] చొప్పున అందరూ ఎట్లాగైనా ఆత్మోద్బోధలను అనుసరించి నడచుకోవలసినవారే కాక తప్పదు. బహిర్ముఖంగా లభించే విజ్ఞానాన్ని తోడు చేసుకుని ఆత్మోద్బోధము లందుకోగలిగితే పరమార్థాన్ని తేలికగా అందుకొనే వీలు కలుగుతుంది.

ఆనాటి సాయంకాలానికి నా చేతి వాపు చాలా తగ్గింది. యోగ సాధన తర్వాత రామ జపము వలె కొంతసేపు తదేక ధ్యానం చేయడం మొదలు పెట్టాను. ఒళ్ళంతా మంటలెత్తినట్టయింది. అది శ్రీవారితో చెప్పాను. నియతమైన వేళల్లో తప్ప ఎప్పుడు పడితే అపుడు ఈ అనుష్ఠానం చేయకూడదనీ, ఆవశ్యకత కలిగితే అలాంటి సమయాల్లో ఒక క్షణం స్మరిస్తే చాలు అందుకు తగిన సౌకర్యం కలుగుతుందనీ తదేక పారాయణ చేయడానికి పరతత్వం ఏమీ చెవిటిది కాదనీ, నోటి మాట చెవి విన్నట్లే మీ

అభ్యర్థనలన్నిటినీ అది వినగలదనీ, ఒకసారి ప్రార్థించగానే సర్వసిద్ధంగా వుండి అనుగ్రహిస్తుండగా, అది చూస్తూ కూడా మళ్ళీ మళ్ళీ అడగడం దేనికి? అన్నారు. టెలిఫోనులో ఒకసారి పిలవగా అవతలివారు సిద్ధంగా వుండి బదులు పలుకుతుండగా దానిని వినకుండా ఊరక పిలుపులే పిలిచేవారి తీరు వంటిదే అవుతుంది మాటి మాటికీ నామజపం జరిపేవారి స్థితి కూడా అన్నారు. ఈ ఉపదేశంలోని పరమార్థమేమిటో వందలూ వేలూ సార్లు నాకూ, నా మిత్రులకూ కూడా అనుభవానికి వచ్చింది.

1925 వ సం॥ ప్రాంతాల్లో ఒక మిత్రుడు శ్రీవారి స్మరణం రామ నామ జపం వలె జరపడం చేశాడు. కొన్నాళ్లకు శరీరమంతా అగ్నిజ్వాలగా అయింది. నిద్రలో నరాలు బిగించినట్లయి క్రమంగా నిద్ర పట్టకుండా పోయింది. బంధువులు అనేక వైద్యాలు చేయించారు. చివరికి వారు అతని చేత యోగాన్నే మాన్పించారు. ఏమీ లాభం లేకపోయింది. జరిపిన తప్పిదానికి పశ్చాత్తాపం చెంది క్షమింప ప్రార్థించి సక్రమంగా నడుచుకోవడం మొదలు పెట్టిన తర్వాత అతని ఆరోగ్యం చక్కబడింది. ఆ మిత్రుడు నేడూ (1949) క్షేమంగా యోగసాధనము చేసుకొంటూ వున్నాడు. అనధికారంగా, అక్రమంగా సాధనములు సాగించిన వారెందరో పశ్చాత్తాపపడి బాగుపడవలసిన వారైనారు.

---

౧. కుంభకోణం సమీపమున కావేరీ తీరమున ప్రాచీనమైన ఈ భక్తిపురి అగ్రహారము కలదు.

౨. సొంత జ్ఞానము, బుద్ధి లేని వానికి శాస్త్రము ఉండియు ప్రయోజనమేమి? అర్థము తెలియదని భావము. కళ్లు లేని వానికి అద్దమున్నా ప్రయోజనము లేదు కదా!

3. శాస్త్రాలలోని సారం తెలుసుకోవాలంటే అధ్యయనం చేసినవారి బుద్ధి బలాన్ని బట్టి బుర్రకు ఎంత ఎక్కాలో అంతే యెక్కుతుంది కాని అంతకు మించి బోధకు రాదు.

౪. ఇది బృహదారణ్యకోపనిషత్తులోనిది. ఆధ్యాత్మిక జిజ్ఞాస కలవారు ఆత్మచింతన పథంలోనే జ్ఞానాన్ని పెంచుకోవాలి. వట్టిమాటలతో పని లేదు, కంఠశోష తప్పించి.

౫. పరిమిత జ్ఞానంతో భాసిల్లే గ్రంథ విజ్ఞానాన్ని కాక సత్యమేదో తెలుసుకొంటూ దాన్ని ఆరాధించి అనుసరించాలి. పనికిమాలిన విషయాలను పాదధూళిలాగా బయటనే విసర్జించాలి.

౬. ఇదే విషయం సుభాషిత రత్న భాండాగారంలోనూ ఉంది.

"అనంత శాస్త్రం బహువేదితవ్యం
అల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః
యత్సారభూతం తదుపాసితవ్యం
హంసో యథాక్షీరమివాంబు మధ్యాత్ ॥

(శాస్త్రాలు లెక్కలేనన్ని. తెలుసుకోవలసింది చాలా ఉన్నది. కాలము తక్కువ. ఆటంకాలు అధికం. కనుక సారాంశాన్ని గ్రహించాలి. హంస ఎట్లా నీటిని విడిచి పాలను మాత్రమే స్వీకరిస్తుందో అట్లా!)

# 28. నవ జీవనము

ఆ రోజు రాత్రి శ్రీవారి ఆజ్ఞ చొప్పున మదరాసుకి హాయిగానే బయలుదేరితిని. కుంభకోణం నుంచి మాయవరం దాకా రైల్లో వచ్చితిని. చాలా మంది అక్కడ దిగారు. నేనూ ఆ స్టేషనులో దిగి, అక్కడ చాలాసేపు రైలు ఆగుతుంది గనక, కొంతసేపు ఇటు అటూ పచార్లు చేశాను. రైలెక్కాను. అది బయలుదేరింది. నేను తలుపు దగ్గరే నిలబడ్డాను. నన్ను ఎవరో బయటికి పడదోస్తున్నట్టయింది. మళ్ళీ ముందటి వలె శరీరంలో కంపము, నిరుత్సాహము తోచింది. ఉన్నట్టుండి రైలు పెట్టె తలుపు దగ్గర వున్న నాకు హరిద్వారము గుర్తుకు వచ్చింది. పాడు ఆలోచన – కిందికి దూకనా అనీ అనిపించింది. అల్లంతలో నన్నెవరో వెనక్కి నెట్టుతున్నట్టయింది. ఇదంతా నాలో సాగే మంచి చెడుగుల మధ్య జరిగే ఘర్షణగా తోచింది. పూర్వం కంటే ఇప్పుడు నాలో గొప్ప జ్వాల ఏదో వెలుగుతున్నట్లయింది. అదే పూర్వం ఎక్కడో మిణుకు మిణుకుమంటు చిన్న వెలుగుగా ఉండేది. నేనిలాంటి సంకల్ప వికల్పాలలో ఇటూ అటూ ఊగుతుండగా లోపల కూర్చున్న సహృదయుడొకడు భగవంతుని వలె తన పక్కన చోటు చూపిస్తూ “అయ్యా! తలుపు తెరిచి ఉంది. కింద పడగలరు. ఇటువచ్చి కూచోండి” అన్నాడు. వెంటనే వెళ్ళి ఆ చోట కూర్చున్నాను. ఆయన లేచి నాకు చోటిచ్చాడు. “నేను రాబోయే స్టేషనులో దిగుతాను కాబట్టి కూర్చోను. మీరు సుఖంగా కూర్చోండి” అని నన్ను కూర్చోబెట్టి తానే తలుపు వేసి ఆ తలుపు దగ్గరే నిలబడ్డాడు. ఆ క్షణంలో నన్ను అట్లా రక్షించినవారు గురుదేవులే అనీ, వారి ప్రజ్ఞాంశమే నాలో పని చేస్తూ ఉన్నదని కాలక్రమాన స్పష్టంగా గుర్తిస్తూ వచ్చాను.

మదరాసు చేరేదాకా నేనున్న చోటు నుంచి కదలకుండా రైలు కంటే ముందు ముందుకి దూకుతున్న ఆలోచనల వేగంతో నిద్ర మెలకువలతో, కొంత శాంతితో, కొంత అశాంతితో మద్రాసు చేరుకున్నాను. వెంటనే మిత్రుల్ని కలుసుకొని జరిగిన సందర్భాలన్నీ తెలిపాను. అవి వేసవి సెలవులు కావడం చేత మా బావ, తోబుట్టువు మా గ్రామానికి వెళ్లారు. మళ్ళీ జనార్దనుని హోటలులో భోజనం చేస్తూ ఆఫీసుకి వెళ్లి పని చేయడం మొదలుపెట్టాను. ఆఫీసులో అందరూ నా ఆరోగ్యం గురించి యెరిగిన మిత్రులే కాబట్టి నాకు ఎక్కువ తొందర కలిగించలేదు. అప్పటిదాకా నా అనారోగ్యం గురించి చీకాకు పడుతూ ఇంక నేను ఎక్కువ కాలం జీవించబోననుకొంటున్న మిత్రుడొకడు, నా ఆఫీసు సహోద్యోగి హఠాత్తుగా కలరా సోకి చనిపోయి నాకు చాలా చింత కలిగించాడు. సాయంకాలం అయిదు గంటల దాకా పనిచేసి అలసి పోయి యింటికి వచ్చి సాయంకాల ప్రార్థనతో బడలిక తొలగించుకొని తిరిగి ఉత్సాహినై రాత్రి గడిపి, ఉదయం ప్రార్థనతో మరింత తేరుకొని ఆఫీసుకి వెడుతూ రోజు రోజుకీ క్రమక్రమంగా ఆరోగ్యాభివృద్ధి పొందుతూ వచ్చాను. ప్రతి దినమూ నరసింహం గారింటికి వెళ్లి వారితో కలిసి ప్రార్థన చేసుకొనేవాడిని.

ఆ నాళ్లలో మద్రాసులో శేషయ్యంగారనే తంజావూరు వాస్తవ్యుడైన ఒక వైష్ణవుని దగ్గిర ధ్రువనాడి అనే సంస్కృత గ్రంథం ఉండేది. అందులో నుంచి అనేకుల జాతకాలను అతడు చదువుతూ ఉండేవాడు. ఆ ఆచార్యుడు మొదట్లో అనారోగ్యంతో బాధపడుతూ వుండి శ్రీవారి శిష్యుడై కుంభకోణంలోనే వుంటూ మంచి ఆరోగ్యస్థితిని పొందెనట. ఆ కారణం చేత ఆయనా మా గోష్ఠిలోని వాడయ్యెను. ఆయన శ్రీవారి జాతకాన్ని మా గోష్ఠిలోనివారైన యితరుల జాతకాలను చదువుతుండేవాడు. కొంత ఆ

వింతలను గమనిస్తూ మేమూ ఆశ్చర్యపడేవాళ్లము.

అలా పదిరోజులు గడిచి నేను కొంత తేరుకోగా నన్ను కృష్ణా జిల్లాలో గ్రంథ సేకరణకై వెళ్ళవలసిందిగా మా పై అధికారి శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు[2] నా మీది అనురాగంతోనే ఆజ్ఞ యిచ్చారు. వెంటనే నేనూ శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారూ[3] ఇద్దరం ఆ పని మీద వెళ్ళాము. కృష్ణ కాలువల కొత్త నీటి స్నానపానాలు మాకిద్దరికీ సరిపడలేదు. బందరు నుంచి రోడ్డు సైడు కెనాల్ నీటిలో పడవ మీద చల్లపల్లి వచ్చి చేరాము. కవి గారికి వేయించిన జీడిపప్పు అంటే చాలా ప్రీతి. బందరులో అది మంచిది దొరుకుతుందనీ ఎక్కువగా వెంట కొని తెచ్చుకొన్నారు. పడవలో కబుర్లు చెప్పుకుంటూ ఆ జీడిపప్పు తిన్నాము. నేను మితంగా, వారు అధికంగా. ఆ రాత్రి కవి గారికి వాంతులు, విరేచనాలు, జ్వరము. కలరా అనుకొన్నాము. సత్రంలో బస. ఆ రాత్రి ఆ సత్రంలో మా బంధువులొకరు మాకు సర్వోపచారాలు చేశారు. ఉదయం బజారులో టర్పంటైను, బ్రాంది, మొదలైన ఔషధ ద్రవాలు కొనడానికి పోగా వర్తకులెవ్వరూ ఇవ్వలేదు. రామకృష్ణ కవిగారు ఎం.ఏ. మద్రాసు నుంచి గ్రంథార్జన కోసం రాజాగారిని దర్శించడం కోసం రావడం వారితో నేనూ ఉండడం తెలియవచ్చింది.

ఆ వూరికి వచ్చే పెద్ద మనుషులకు, ఉద్యోగులకు అవసరమైన పదార్థాలన్నీ రాజా గారే ఇవ్వాలి గాని వర్తకులు ఇవ్వకూడదన్న కట్టడి ఉండేది. కవిగారేమో 'కాళ్ళీడ్చుకుపోతున్నవి. ప్రాణం నిలిచేట్లు లేదు. కలరా కాబోలును. బ్రాందీ కావలెను. కాళ్ళకు టర్పంటైను రాయాలి' అంటారు. అవేవీ దొరకలేదు. రాజాగారిని దర్శించడం మధ్యాహ్నానికి గానీ వీలుపడలేదు. రాజాగారు భోజనానంతరం నిద్ర లేచిన తరువాత నేను పంపిన వార్త వారికి చేరింది. అవసరమైన వాటిని వారు పంపించారు. అప్పటికే కవిగారు మా బంధువులు చేసిన సేవతో తేరుకున్నారు. మందుల

అవసరమే లేకపోయింది. ఈ వార్త ఆరుమైళ్ళ దూరంలో వున్న మా గ్రామానికి తెలియరాగా, మా తండ్రిగారు పంపిన బండి మీద మా పినతండ్రిగారు వచ్చి నన్ను పిలుచుకు వెళ్లారు.

చల్లపల్లిలో ఉండగానే కవిగారి సేవలో వుండడం చేతను, వారితో నేనూ జీడిపప్పు తిని నీరు తాగడం వల్లనూ నాకూ తల తిరగడం, వాంతులు, జ్వరము ఆరంభమైనవి. ఇంటికి చేరేసరికి నాకు 100 డిగ్రీల జ్వరముంది. నేను మందు తీసుకోనంటున్నాను. కుంభకోణానికి టెలిగ్రాం ఇవ్వండని కోరాను. వెంటనే మా వాళ్లు ఆ పని చేశారు. కాని అది వారికి చేరడానికి రాత్రే అవుతుందో మర్నాడే అవుతుందో, జ్వరం తీవ్రంగా ఉంది కాబట్టి మందు పడాల్సిందే అని చాటున మా తల్లిదండ్రులు, అన్నగారు, చర్చించుకొంటున్నారు. అది విని నేను వారిని పిలిచి అడిగాను. 'మందు తీసుకోవలసిందే' అన్నారు వారు. అంగీకరించాను. సాయంకాలం ఆరు గంటల వేళకు మందిచ్చారు. అప్పుడే ఆకాశం నుంచి దభేలున కింద పడుతున్నట్టయింది. ఒళ్ళంతా చెమటలు కారిపోతున్నాయి. పది నిమిషాల్లో జ్వరం దిగిపోయింది. 'మందిచ్చాము. వెంటనే తగ్గిపోయింది' అనుకొన్నారు మావాళ్లు. 'ఇచ్చిన టెలిగ్రాం శ్రీవారికి చేరింది. ట్రీట్మెంటు జరగడంతో ఠక్కున జ్వరం తగ్గిపోయింది' అని నేననుకొన్నాను తృప్తితో. మర్నాడు తేటగానే ఉన్నాను. మందు తీసుకొంటున్నాను. మూడవ రోజున మళ్లీ జ్వరం వచ్చింది. ఆ రోజు కుంభకోణం నుంచి జాబు వచ్చింది. 'జ్వరం తగ్గి ఉంటుంది. మందు కూడా పుచ్చుకోవచ్చును' అని. మందు పుచ్చుకోవడానికి ధైర్యం వచ్చింది. తీసుకొంటూనే ఉన్నాను. సెలవు లేదు. శ్రీరామకృష్ణ కవిగారికి జ్వరం వస్తూ వుండడంతో సెలవు పెట్టి మద్రాసు వెళ్లారు.

నేను అంతకు పూర్వమే చాలాకాలం సెలవులో వుండి డ్యూటీలో

చేరగానే మళ్లీ సెలవు అడగవలసి రావడం బాధాకరంగా తోచి ఏమి చేయడానికీ పాలుపోక చిక్కుపడుతున్నాను. ఇంటి దగ్గర కూచోడం ఇష్టంగా లేదు. జ్వరం వస్తూనే వుండడం చేత మాటి మాటికీ ఊళ్లప్రయాణాలూ చేయలేకపోతున్నాను. ఇలాంటి ఇబ్బందుల్లో వుండగా వచ్చిన వారం రోజుల్లోనే ఆఫీసు వారి నుండి టెలిగ్రాం వచ్చింది. "తక్షణం నువ్వు బయలుదేరి తంజావూరు లైబ్రరీ పరిశీలనార్థం వెళ్లి అక్కడే పని చేయవలసినది" అని! అలిగి తంతే పోయి పరుపు మీద పడ్డట్టు, రొట్టె విరిగి నేతిలో పడ్డట్టు అయి నాకు పరమోత్సాహాన్ని కలిగించింది ఆ వార్త.

వెంటనే బయలుదేరి మద్రాసు వచ్చి ఆఫీసుకి వెళ్లి లైబ్రేరియన్‌తో మాట్లాడి మదరాసులో ఆగకుండా సరాసరి కుంభకోణానికే వెళ్లిపోయాను. కుంభకోణంలో శ్రీవారిని దర్శించి నా కథ అంతా చెప్పుకొన్నాను. శ్రీవారు నన్ను ప్రతివారమూ సెలవు దినాన తంజావూరు నుంచి కుంభకోణం వస్తూ వుండమన్నారు. ఆ కాలంలో రైలు చార్జీ అర్థరూపాయిలోపు వుండేది. అలాగే వెళుతూ వుండేవాడిని. తంజావూరులో నాకు త్యాగరాజయ్యరుతో మైత్రి ఏర్పడెను. ఆయన శ్రీవారి శిష్యుడు. ఇద్దరమూ కలిసి ప్రార్థనము చేసుకొంటూ వుండేవాళ్లము. అప్పటికి మా తోబుట్టువు మదరాసులో వుంది. మా తమ్ముడు చిరంజీవి చంద్రశేఖరమ్మ అక్కడ హైస్కూలులో చదువుతూ వుండెను. వానికక్కడ టైఫాయిడ్ జ్వరము వచ్చింది. శ్రీవారికి జాబు రాశాను. మద్రాసులో శ్రీవారి శిష్యుడుగా వున్న మా స్నేహితునికి, వారు జాబు రాశారు ట్రీట్ చేయమని. అతను రోజూ వచ్చి ట్రీట్ చేస్తూ, యీ జ్వరం తగ్గిన తర్వాత యీ కుర్రవానికి శ్రీవారి శిష్యతానుగ్రహం లభింపచేయుమనీ, దాని మూలంగా అతను కొరతలన్నీ తీరి పూర్ణారోగ్యం పొందగలడనీ తన దివ్యదృష్టికి గోచరించిన విషయం చెప్పెను. నెలా

పదిరోజులు జ్వరం వానిని పీడించి వదిలెను. జ్వరం తగ్గి ఆరోగ్యవంతుడైన తర్వాత మా తమ్ముడు వదిన గారిని తోడ్కొని కుంభకోణం వచ్చెను. వానినీ శ్రీవారి శిష్యుని గావించాను.

చల్లపల్లిలో ఆరంభించిన చలిజ్వరం నాకు అడపా దడపా వస్తూనే వుండేది. శరీరం చాలా చిక్కిపోతూ వచ్చింది. నేను కుంభకోణం వెళ్లగానే తీవ్రజ్వరం వచ్చేది. మజ్జిగ అన్నమే తినగలిగేవాడిని. రాత్రి ఒకటి రెండు గంటల వేళ తీవ్రంగా ఆకలి అయ్యేది. అప్పుడు ముందుగానే నా కోసం జాగ్రత్తపడి సచ్చిదానంద స్వాముల వారు ఊరుగాయ, మజ్జిగ అన్నము విడిగా పెట్టి దాచి వుంచేవారు. ఆకలయినప్పుడు వారిని లేపి అది తిని ఇన్ని నీళ్లు తాగి నిద్రపోయేవాడిని. ఉదయం జ్వరంతోనే తంజావూరు వచ్చేవాడిని. వచ్చిన కాసేపటికే జ్వరం తగ్గిపోయేది. వారం రోజులు నెమ్మదిగా ఆఫీసు పని చూసుకోగలిగేవాడిని. నాతో రామకృష్ణ కవిగారు వగైరాలుండేవారు. వారు మదరాసు వెళ్లినప్పుడు శ్రీ కుప్పుస్వామి శాస్త్రి గారితో నేనేదో కుంభకోణం వెళ్లి యోగ సాధన చేస్తున్నాననీ అక్కడికి వెళ్లగానే జ్వరం వచ్చేదనీ, జ్వరంతోనే ప్రతివారం వెళ్లివస్తూ వుండేవాడిననీ చెప్పారు. వారికి నా మీద కోపం కలిగేది.

1916 క్రిస్మస్ సెలవలు వచ్చినయి. నేనా సెలవు రోజుల్లో కుంభకోణంలోనే శ్రీవారి సన్నిధిలోనే వుండిపోయాను. 30 దాకా నాకు జ్వరమే. 31వ తేదీ నాకు విరేచనములు ఎడతెగకుండా వచ్చి నలభై, యాభై సార్లు అయ్యాయి. సగ్గుబియ్యపు జావ మిత్రులు మహదేవయ్య గారు తెచ్చి యిచ్చారు. తాగాను గానీ ఒంట్లో శక్తి లేదు. ఆ రోజు ఉదయమే నేను బయలుదేరి తీరాలి. శ్రీవారికి ఈ విషయం తెలిసింది. రామచంద్రయ్యరు గార్కు అనే ముఖ్య శిష్యుని పిలిచి ప్రభాకరునికి విగర్ సప్లై కావడానికి ట్రీట్ చేయుమని ఆదేశించారు. ఆయన నీరసంగా

పడుకొన్న నా దగ్గరకు వచ్చి ట్రీట్ చేశారు. అయిదు నిమిషాలలో పండుకొన్న నేను లేచి కూర్చున్నాను. కూర్చున్న నేను లేచి, లేచిన చోటనే ఇటూ అటూ తిరిగి, తిరిగిన నేను పరుగెత్తగలిగి ఉత్సాహశక్తి పుంజుకున్నాను. కొంత పర్వాతోనే వెళ్లి శ్రీవారి పాదాలపై వ్రాలేను. రైలు వేళవుతున్నది కాబట్టి వెంటనే స్టేషనుకి వెళ్లమన్నారు – "ఇంక నుంచీ అనారోగ్యం ఉండదు. వారం వారం రానక్కరలేదు. రెండు రోజులు సెలవు కలిసి వచ్చినప్పుడు వస్తే చాలు. పగలు హాయిగా భోజనం చెయ్యి. ఉదయం, మధ్యాహ్నం లఘువుగా (తేలికపాటి) ఆహారం తీసుకో. జీర్ణశక్తి సరిగా ఉంటుంది. లివరు సరిపడింది. రాత్రి పూట మజ్జిగ కాక పాలు పోసుకొని తిను" అన్నారు. తంజావూరికి వచ్చేశాను.

అప్పటి నుంచీ ఇక జ్వరం రాలేదు. జీర్ణశక్తి చక్కబడింది. ఆకలి బాగా తెలిసేది. దినదిన క్రమాభివృద్ధిగా ఆరోగ్యం చక్కబడ్డది. అప్పటి నుంచీ నాకు అనారోగ్య వ్యథ తీరిపోయి వింత వింత అనుభూతులు కలుగుతూ వచ్చాయి. ఒక రోజు ఉదయం రొట్టె పాలు (కాఫీ అలవాటు ముప్ఫైయైదేళ్ల తర్వాతనే) తీసుకొని ఉదయం చేసుకొనే ప్రార్థన చేసుకొని ఆఫీస్‌కి వెళ్లాను. (ఆ రోజుల్లో తంజావూరు లైబ్రరీ పని వేళలు ఉదయం 8 గంటల నుండీ సాయంకాలం 5 గంటల దాక) అప్పుడు ప్రాతః కాలంలోనే కొన్ని నియమిత సమయాలలో సాయంకాలము దాకా అభ్యాసములుండేవి.

పదిగంటల వేళ అభ్యాసము జరుపుకొని టేబిల్ దగ్గర గ్రంథ పరిశీలనం జరుపుతుండగా మూలాధారము నుండి బలంగా పిచికారితో చిమ్మినట్టు ప్రజ్ఞాబలధారలు రేగనారంభించినవి. ఉత్సాహం, ఆనందం పొంగి పొర్లి శరీరమంతా వ్యాపింపసాగినవి. ఆ ధారలు తలలోకి పోయినవి.

అప్పటి నా ఆహ్లాదం చెప్పతరము కానిది. లోపల చిచ్చుబుడ్డి వెలిగించి దానిపై పలుచని కుండ మూసినట్టు తల ఊగిసలాడసాగింది. లోపల ఏవేవో మెరుగు రేఖలు తిరగసాగినై. అప్పుడు పనికట్టిపెట్టి వినోదిస్తూ కూచున్నాను. పది నిమిషాల సేపు అలాటి స్థితి ఉండెను. అప్పటి నా స్థితి, మహానంద తాండవమాడుతున్నట్లే అయింది. నెమ్మదిగా ఆ స్థితి అదుపులోకి వచ్చింది. నా ఒడలంతా ఆనందమయమయింది. కొద్ది రోజులలోనే ఆ లైబ్రరీ పనిని వడివడిగా ముగించేశాను.

---

౧. శ్రీ శేషయ్యంగార్ - వివరాలు సేకరించవలెను.

౨. శ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారు సంస్కృతం ప్రొఫెసరూ, GOML క్యూరేటరూను. వీరి పేరున ఈనాడు మదరాసులో ఒక పెద్ద గ్రంథాలయము మరియు పరిశోధనాలయము ఉన్నవి.

౩. కృష్ణాజిల్లాలోని ప్రాచీన గ్రంథాల సేకరణార్థం వీరిరువురినీ మదరాసు ప్రభుత్వం నియమించినది.

౪. అన్నగారు శ్రీ వేంకట శివశాస్త్రి గారు. అవనిగడ్డలో పోస్టుమాస్టరు ఉద్యోగం చేశారు. గట్టి పండితులు.

౫. తంజావూరులోని త్యాగరాజయ్యరు గారిని గూర్చి వివరాలు సేకరించాలి.

౬. కాజ శారదాంబ గారు శ్రీ శాస్త్రిగారి తోబుట్టువు.

౭. శ్రీ శాస్త్రిగారి వివాహానంతరము మదరాసులో కాపురము పెట్టినపుడు తమ్ములిద్దరూ (డా॥ వేటూరి చంద్రశేఖరశాస్త్రిగారు, డా॥ వేటూరి శంకరశాస్త్రిగారు) అన్నగారితోనే ఉండి చదువుకొనిరి.

౮. విగర్ సప్లై ట్రీట్మెంటు అద్భుతంగా పనిచేసిన రీతిని శ్రీ శాస్త్రిగారు వర్ణించినట్లే జరిగింది. ఆ తరువాత వారికెప్పుడూ అట్టి శారీరక రుగ్మత కలుగలేదు.

# 29. ఇల్లాలి యినిసియేషన్

మదరాసు ప్రయాణము. నేను యింటి సామాన్ల నన్నింటిని రైలులో మదరాసు పంపి కుటుంబంతో తంజావూరు నుంచి కుంభకోణం చేరుకొని నా ఆరోగ్యాది విషయాలను మాస్టరుగారికి నివేదించుకొన్నాను.

ఆ నాటి సాయంకాలపు యోగాభ్యాసం ముగిసిన తర్వాత మాస్టరు గారు నన్ను దగ్గరకు పిలిచి, "నువ్వు యీ రాత్రి నేను ఎప్పుడూ ఉండే యోగాలయపు గదిలో, నేను పడుకొనే బల్ల మీద నీ భార్యతో శయనించు. నేను ఇప్పుడు ఇంట్లోనే పడుకొంటున్నాను అన్నారు. నేను గడగడలాడి సిగ్గుతో అంగీకార సూచకంగా తలవంచుకొన్నాను. కాని, తరువాత నాకు చాలా భయం వేసింది. అది గురువులు శయనించే గది. అందులోను అది వారు విశ్రాంతి తీసుకునే బల్ల. అక్కడ నేను పడుకోవడమా! అందునా ఇల్లాలితో కూడుకొనా? అని వణికిపోయాను. ఈ ఆజ్ఞ నాలోనే ఉండిపోయింది. వారితోనే భోజనాలయినాయి. వారి యింటిలోని ఆడువారు అందరూ పడుకొనే చోటనే నా భార్యా శయనించింది. నేను, మరికొందరు మిత్రులతో కలిసి, వీధి అరుగుమీదనే పడుకొన్నాను. ఆ రాత్రి అంతా మాస్టరుగారిచ్చిన ఆజ్ఞను గూర్చిన ఆలోచనలే. ఉదయం తెలతెల్ల వారుతుండగా తలుపులు తెరవగానే లోపలికి వెళ్లాను.

గురువుగారు (మాస్టరుగారు) విశాలమైన మండువాలో పైన చంద్ర నక్షత్రాదులూ, నీలాకాశము గోచరిస్తుండగా, చల్లని గాలి వీస్తుండగా, ఒక గోల్డ్ మెడల్ మడత మంచం్గ మీద పల్చని పడక మీద పడుకొని వున్నారు. పడక మీదనూ, కింద, చల్లిన మల్లెపూవులున్నాయి. ఒక పట్టు తలగడ. తెల్లని పల్చని పట్టు వస్త్రము కప్పుకొని ఉన్నారు. మంచానికి దోమతెర కప్పి ఉంది. అదను కోసం ప్రతీక్షిస్తూ (వేచిచూస్తూ) వుండి గురువుగారు కళ్లు తెరిచి లేవబోతుండగానే నేను చేరువకు వెళ్లి వారి

పాదాలను తాకి నమస్కరించాను. "రాత్రి ఎక్కడ పడుకొన్నావు" అని అడిగారు. ఇంటిలోని ఆడువారితో ఆమెయు, వాకిట అరుగు మీద నేనూ పడుకొన్న విషయం చెప్పాను. చప్పరించి 'నా మాట పాటించక పోతివి గదా!' అన్నారు గురువుగారు. సిగ్గుతో తలవంచుకొన్నాను. "సరే! కానీలే ఏమి విశేషము?" అన్నారు.

"మీ దివ్యానుగ్రహం చేత నేను ఆరోగ్యవంతుడనయ్యాను. నాకు యీ యోగమార్గంలో ధన్యత చేకూరుతుంది. నాకు శరీరాన్నిచ్చిన మా తల్లిదండ్రులు వృద్ధులు. ఎప్పుడు ఏమి జరుగుతుందో! వారికి కూడా మీ శిష్యతను అనుగ్రహించ వేడుకొంటున్నాను. వారు ఇక్కడికి రాలేని స్థితి' అన్నాను.

'వారి వయస్సెంత?' అడిగారు గురువుగారు.

'మా తండ్రిగారికి డెబ్బై దాటింది' అన్నాను.

'అంత పెద్దవయసులో ఉన్నవారిని గురించి చింతిస్తున్నావే, చిరకాలం నీతో జీవితం గడపవలసిన నీ భార్యను గురించి అడగవెందుకు?' అన్నారు.

'పిన్న వయసులో వున్న ఆ ఉవిద నాతో ఎప్పుడు పడితే అప్పుడు మీ దర్శనానికి రాగలదు కనుక ఎప్పుడైనా మీ శిష్యత్వానికి అర్హురాలు కాగలదు. చాలా వృద్ధులై ఉన్నారనీ, ఎప్పుడేమవుతుందో అనీ, వారు ఈ శరీరంతోనే మీ శిష్యత పొందాలనీ నా ఆశ' అన్నాను.

"సరే కాని, ఇవాళ ఎనిమిది గంటలకు నీ భార్యకి ఇనిసియేషన్ జరుగుతుంది. అందుకు అవసరమైన సన్నాహం చూడు. అందుకు నీవేమీ ప్రత్యేకంగా వస్తువులు తీసుకురానవసరం లేదు. రాధాకృష్ణునితోనూ, మహాదేవయ్యర్‌తోనూ చెప్పి ఫారము వగైరాలు ఫిలప్పు చేయించు చాలు" అని మంచం దిగి లోనికి వెళ్లారు.

నేను అడిగిన దానిని అనుగ్రహించినట్లుగా బదులియ్యక, అడగవలసిందే అయినా అప్పుడు నేనడగని దానిని అనుగ్రహించడం జరిగింది కదా అని వింత చెందుతూ బయటికి వచ్చి కాలకృత్యాలు తీర్చుకొన్నాను. అంతలోనే యోగశాలకు వచ్చి చేరుకొన్న మిత్రులిద్దరికీ గురువు గారి ఆజ్ఞను తెల్పాను. వారు నవ్వుతూ ఆ సందేశాన్ని స్వీకరించారు. ఎనిమిది గంటలకల్లా అన్ని యేర్పాట్లూ సిద్ధమైనవి. ఆనాడు మాస్టరు గారి ఇంట్లో వారి మేనత్తగారు్ు, వృద్ధురాలు చాలా జబ్బు పడిరి. వారి ఆరోగ్యం విషయమై గురువుగారు తీవ్ర ప్రజ్ఞలో ఉండినారు. ఎనిమిది గంటలకు ఇనిసియేషను జరిగినది.

మాతృశ్రీ (అమ్మగారు) యోగసాధనకు కూర్చోబోయే ముందు ఇడ్లీలు, కాఫీ ఆహారం తీసుకోడానికి తెచ్చి దగ్గర ఉంచారు. అది తెలియక ఆ ఉవిద ఆహారం తీసుకోకుండానే యోగాభ్యాస విధానాన్ని ఆరంభించింది. అయిదు నిమిషాలలో శరీరమంతా కొయ్యబారి కదలడానికీ మెదలడానికీ వీలు కాక బిగుసుకొని పోయింది. దగ్గరకు వచ్చి చూసిన సచ్చిదానంద స్వాముల వారు ఆ స్థితిని చూసి పిలిచారు. ఆమె కళ్లు తెరపిన పడలేదు. వారు మాతృశ్రీ గారిని పిలుచుకు వచ్చారు. గమనించగా ఆహారపదార్థాలు ఉంచినవి ఉంచినట్లే ఉండిపోయినవని, వెంటనే లేపి, ఒడలు పిసికి, మామూలు స్థితికి తెచ్చి, మూడు నాలుగు ఇడ్డెనలు, చెంబెడు మంచి నీళ్లు, కాఫీ ఆహారం తీసుకొన్న తర్వాత శక్తి రాగా మరలా యోగ సాధన కొనసాగెను. పావు గంట సేపు ప్రబలంగా సాధన జరిగింది. ఆ నాడు సాధన అంత తీవ్రముగా ఉండటానికి కారణము గురువు గారి ఆనాటి ప్రజ్ఞా తీవ్రతయే అని అక్కడి మిత్రులు తెలిపారు. ఆనాడు దంపతులము మేము మహోత్సాహంతో గడిపాము.

ఆ సాయంకాలమే నేను బయలుదేరి మదరాసు వెళ్ళాలి. నా కోర్కె

తీరలేదని చింత. వెళ్లబోయే ముందు మళ్ళీ గురువు గారిని దర్శించి నా కోరికను – తల్లిదండ్రులను గురించి విన్నవించుకొన్నాను. గురువు గారు నా అజ్ఞానానికి నవ్వి ఇలా పలికారు.

"ఇక వారి శరీరాలను చిరకాలము రక్షించడానికి వీలు పడదు. అయినా నువ్వు వెంటాడుతున్నావు కాబట్టి చెబుతున్నాను. నువ్వు యోగసిద్ధుడవైతే – 'దశ పూర్వేషాం దశా పరేషామ్' – మీ వంశ్యులకు నీ యోగవాసనలంటి వారు కడతేరగలరు. పది సంవత్సరాలు విడువకుండా నా ఆదేశం చొప్పున యోగాభ్యాసం సాగించు. అన్ని కోర్కెలనూ నీకు నువ్వే నెరవేర్చుకోగలుగుతావు. ఇప్పటికి మీ తలిదండ్రులు అక్కడే ఉండి నేను ఉపదేశించిన విధానాన్ని ఆచరింతురు గాక!" అంటూ ఆ విధానాన్ని చెప్పారు. నేనెంతో ఉప్పొంగి పోయాను.

కాని ఆ రోజు తెల్లవారుజామున వారిని దర్శించినపుడు మాట్లాడిన తీరునకు, నేనొకటి అడిగితే దానికి బదుల్ని అనుగ్రహింపక జరిపిన సందర్భానికీ, మధ్యాహ్నం తిరిగీ వెంటాడి మూర్ఖతతో ప్రశ్నించగా చూసిన చూపుకి, చెప్పిన బదులుకి సమన్వయాన్ని గుర్తింపగల యోగ్యత నాకు మరి పదేళ్లకు[46] గానీ కలుగలేదు. పదమూడేళ్ల తర్వాత అద్భుతంగా ఆ రహస్యాలన్నీ అనుభూతి పూర్వకంగా గోచరించినవి. అది సందర్భం వచ్చినపుడు వివరిస్తాను.

కుంభకోణం నుంచే మా తల్లిదండ్రులకు మాస్టరు గారి ఆదేశాన్ని తెల్పుతూ లేఖ రాశాను. గురువుగారి సన్నిధిలో మా దంపతులకు ఎలాటి అనుభూతులు కలిగాయో సుదూర దేశంలో ఉన్న మా తల్లిదండ్రులకూ అలాంటి అనుభూతులే కలిగినవి. తరువాత వారు మదరాసుకి నాకా విషయలన్నీ తెలియజేశారు. ఆనాటి రాత్రే మెయిలులో మేము దంపతులము మదరాసు చేరుకొన్నాము.

౧. గోల్డ్‌మెడల్ కేంప్ ఫర్నిచర్ మాన్యుఫేక్చరింగ్ కంపెనీ (U.S.) వారు తయారు చేసిన మడత మంచము. నేటికీ నాటి ప్రసిద్ధి కొరవడలేదు. ముఖ పుస్తకములో నేటికీ నాటి ప్రశస్తిని కనవచ్చును.

శ్రీ శాస్త్రిగారు వర్ణించిన యీ ఘట్టము నాటి సన్నివేశాన్ని కళ్లకు కట్టుతున్నది. దీని ఆధారంగానే శ్రీ ప్రభాకర మిత్రమండలి, కుంభకోణం మాస్టర్ గారి భవనంలో దీనికి ప్రతిరూపము నిర్మితమైనది.

౨. అమ్మగారు మహాలక్ష్మి గారి ఇనిసియేషను మాస్టర్ గారి అనుగ్రహంతో ఏప్రెల్ 16వ తేదీ, 1917లో జరిగినది. మీడియము సంఖ్య 516.

౩. శ్రీ రాధాకృష్ణన్, మహదేవయ్యరు అనువారు మాస్టర్ గారి ముఖ్య శిష్యులు.

౪. మాస్టరు గారి మేనత్త గారి పేరు –

వివరములు సేకరించవలెను.

౫,౬. ఈ విషయము తమ మూడవ కుమారుడైన డా॥ వేటూరి ఆనందమూర్తి జన్మకు సంబంధించినది. తమ యింటి జాతకాల పుస్తకంలో శ్రీ శాస్త్రిగారు స్వదస్తూరీలో జాతక చక్రము వేసి కొన్ని వాక్యములు రాశారు.

ఆనందమూర్తి పేరు ముందు 'తాతపాదులు' అని పేర్కొన్నారు.







This photo was taken by Sri Chouhan Singh, Internationally noted photographer of the Challapalli Estate in 1931. The six months old child's Photo is of Veturi Ananda Murthy christened as 'తాతపాదులు' by Gurudev V.P.S.

# 30. నాడీ గ్రంథములు

తంజావూరులో పరిశీలించిన గ్రంథాల విషయమై మదరాసులో మేము మరికొంత పని చేయవలసిన కారణంగా మరి మూడు నాలుగు నెలలు ఉండాల్సి వచ్చింది. ఆరోజుల్లో మదరాసు గవర్నరుగా పెంట్లండ్ దొరగారుండేవారు. ఆయన్ని ఎవరో ఇంగ్లండువారో, జర్మనీవారో ప్రేరేపించారట. "తంజావూరు లైబ్రరీని మాకు కొనిపెట్టవలసినది" అని! అందుకోసం ఆ లైబ్రరీ విలువ కట్టడానికి అక్కడి గ్రంథాలు పరిశీలనం చేయవలసి వచ్చింది. ఆ పని మీద మమ్మల్ని తంజావూరికి పంపించారు.

ఈ రహస్యం పైకి పొక్కింది. ప్రజలు గందరగోళం చేశారు. గవర్నరు గారు తమ తంత్రాన్ని కట్టిపెట్టవలసి వచ్చింది. ఒక విధంగా మేము అక్కడికి వెళ్లి పడిన శ్రమ కూడా వృథా అయింది. కాని అప్పుడు మేము రాసిన విమర్శలు కొన్ని ఆ తర్వాత తంజావూరు కేటలాగులు తయారుచేసి ప్రకటించినవారు ఉపయోగించుకొన్నారు. మేము అప్పుడు అక్కడి గ్రంథాల విలువ కట్టడానికే కావలసిన అంశాల్ని ప్రధానంగా సమకూర్చాముగానీ, గ్రంథాంశాలను విశ్లేషించి వివరించడానికి కాదు. కాబట్టి మా లిస్టులలో ఆయా విషయాలన్నిటినీ సమగ్రంగా సేకరించలేదు గానీ పుస్తకాల నన్నింటినీ సరిగ్గా గుర్తించాము. వివరాలిచ్చాము. గవర్నరు గారు తలపెట్టిన పని వ్యర్థమైపోయిన తర్వాత మేము తయారు చేసిన లిస్టులన్నిటినీ తంజావూరు లైబ్రరీ వారికే ఇచ్చేశాము. అప్పుడు వాటిని లెక్కకట్టే పనిలో నేను మద్రాసులో ఉండి ఆరోగ్య విషయంలోనూ, గ్రంథ పరిశీలన విషయంలోనూ, యోగసాధన విషయంలోనూ చాలా అభ్యుదయం చెందాను. ప్రతి నిత్యమూ నేను మిత్రులతో కలిసి యోగాభ్యాసం చేస్తూ ఉండినాను.

ఆ నాళ్లలో ధ్రువనాడీ గ్రంథ పరిశోధన అధికంగా జరిగింది. అందులో శ్రీవారి జాతకం పరిశీలించాము. ఇంకా చాలామంది మిత్రుల జాతకాలనూ పరిశీలించాము. ఆ ఉత్సాహంలో నేను నా జాతకాన్నీ పరిశీలింప జేసుకొన్నాను. ఈ ధ్రువ నాడి సత్యాచార్యప్రణీతమని అందులో ఉంది. ఆ సత్యాచార్యుడు పంచ 'సిద్ధాంతికం' మొదలైన గ్రంథాలు రాసిన వాడనీ, క్రీ॥శ॥ 4వ శతాబ్ధి వాడనీ ప్రసిద్ధి కెక్కినవాడు. ఆతడే ఈ నాడీ గ్రంథకర్త అని ఉంది కానీ భాషా శైలీ లక్షణాలను బట్టి పరిశీలిస్తే అది సత్యమనిపించదు.

ఈ నాడీ గ్రంథాలు[47] సంస్కృతంలోనూ ద్రావిడ భాషల్లోనూ అరవ (తమిళ) దేశంలోనే ఎక్కువగా ఉన్నాయి. ఆంధ్రదేశంలో కూడా ఆంధ్రభాషలో వేములవాడ భీమన రాసినట్లుగా ఒక నాడీ గ్రంథం ఉంది. కాని అది సీసమాలికగా[48] వేములవాడ భీమకవి రచన అని నమ్మరానిదిగానే ఉన్నది. ఆ గ్రంథాన్ని ప్రాచ్యలిఖిత పుస్తకశాలకై నేనే సేకరించాను. అది ప్రస్తుత కాలానికి ఉపయోగపడేదిగా లేదు. ఇక సంస్కృత ద్రవిడ గ్రంథాలలో ధ్రువనాడి అనీ, సత్యసంహిత అనీ, శుక్ర నాడీ అనీ, చంద్ర కళానాడీ అనీ గల నాలుగు గ్రంథాలను నేనెరుగుదును. ్ర అవి ఎవరో ప్రాచీన మహర్షులు, అలాటి వారు రచించినవిగా ఉన్నవి. ధ్రువనాడీ, సత్యసంహిత అనే గ్రంథాలు సత్యాచార్య రచనలని ఉండడాన్ని బట్టి, నేనేమనుకొన్నానంటే వెనకటి ఆ సత్యాచార్య అంశతో ఇటీవల జన్మించిన వారెవరో అప్పటి స్మృతి కలిగి వాటిని రాసి ఉంటారని!

ఇక్కడ చెప్పవలసిన విషయం చాలా వుంది. ఈతడు శివాంశతో జన్మించాడనీ (అప్పయ దీక్షితులవంటివారు), ఈతడు గుడి గంట అంశగా జన్మించాడనీ (వేదాంత దేశికులు) అనుకునే విధంగా ఎందరెందరో ప్రాచీన మహనీయులను గురించి ప్రామాణికులైనవారే నిర్ణయించి చెప్పడం

జరిగింది. అలాగే ఆయా దేవతల అంశావతారాలుగా వారిని గుర్తించడం తగును. ఆయా మహనీయులు లోకంలో ఏవేవో అపూర్వాలూ అద్భుతాలూ సాధించడం కోసమని అవతరిస్తూ ఉండడం కలదు. ఆయా దేశకాలాల్లో కలిగిన అప్పటి అసౌకర్యాలను బట్టి ఆయా కార్యాలను వారు అప్పటప్పటి అవతారాలలోనే నెరవేర్చుకొనే వీలు కలిగి ఉండకపోవచ్చును. వారి సంకల్పాలు శుద్ధములైనవి కనుక వారు తలపెట్టిన ఆయా కార్యాలను మరికొన్ని జన్మలనెత్తి నిర్వహించవలసినవారై ఉంటారు. శంకరుడు, జినుడు, బుద్ధుడు మొదలైనవారు తలపెట్టిన కార్యాలూ అలాగే ఒక జన్మము నందే నెరవేరినవి కాకపోయినవి.

ఎంతో ప్రాచీనులై జ్యోతిషంలో అద్భుత గ్రంథాలు రాసిన సత్యాచార్యులు మొదలైన వారు కూడా మళ్లీ మళ్లీ జన్మిస్తూ లోకవృత్తాన్ని కొన్ని కొన్ని షష్టు (అరవై సంవత్సరాల కాల పరిధి) లకు లోబడి రచిస్తూ వచ్చి ఉంటారనీ నా నమ్మకము. అలా వచ్చిన తర్వాతి తర్వాతి జన్మముల వారి గ్రంథాలకే నాడీ గ్రంథములు అని పేరు. అవి కొన్ని కొన్ని షష్టుల (షష్టి అంటే అరవై యేళ్ల కాల పరిమితి) కే రచింపబడి ఉంటాయనీ నేను నమ్ముతున్నాను. వారూ ఆయా జన్మల్లో తమ జ్యోతిష ప్రజ్ఞా పాటవాన్ని ప్రదర్శించడమే లక్ష్యంగా కలవారు కావడం చేత భాషా పాండిత్యాలను పట్టించుకొన్నవారు కాదు. వారి గ్రంథాలలోని భాష కూడా అంత ప్రౌఢంగానూ (గొప్పగా), నిర్దుష్టంగానూ (లోపం లేకుండా) ఉండదు. అయినాగానీ కొన్ని కొన్ని చోట్ల కొందరి గ్రంథ భాగాలు ప్రౌఢంగానూ ఉండక పోలేదు. రుచీ, అర్థ విశేషాలూ గల జాతక భాగాలను చెప్పేటప్పుడు శ్లేష మొదలైన అలంకారాలతో ఎంతో రసవంతంగా చెప్పిన గ్రంథభాగాలూ ఉన్నవి. అందులోని శబ్దజాలం కొంత కొంత యీనాడు పుట్టిందిగానే ఉన్నా మనుష్యులను గురించీ వారి నడవడికను గురించీ, పేర్లను గురించీ

కూడా అందులో ఉంటుంది. ఈ రోజుల్లోనే కొత్తగా వచ్చిన, వినిపిస్తున్న రేడియో, రేడియం, ఎక్సురే, కాస్మిక్ రే ఆటంబాంబు వంటి వాటిని గురించి కూడా అందులో ఉంటాయి.

ఆయా గ్రంథాలను రాసిన వారి కాలానికి ఆయా విషయాలు జరుగబోయే తర్వాతి కాలానికి చెందినవే అయినప్పటికీ ఆ గ్రంథాలలో ఆయా భాగాలను చదివి వెల్లడించేంతవరకూ జరిగింది గతకాలానికి చెందినదిగానూ, ఆ తరువాతిది అనంతర కాలంలో జరిగేదిగానూ ఉంటూ ఉంటుంది. ఆయా గ్రంథాలను చదివే నాటి దాకా ఆ విషయాలు జాతకునకు చక్కగా సరిపడునట్టుగానూ, తు.చ. తప్పకుండా జరిగినవి గానూ ఉండడం చేత, దానిని బట్టి, తర్వాతి గ్రంథ భాగాన్ని జాతకుడు నమ్మి తీసుకొంటాడు. కానీ తరువాత తరువాత అది తప్పిపోతుండడమూ మొదలవుతుంది. క్రమంగా అన్ని విషయాలూ విస్పష్టంగా తప్పిపోతూనే ఉంటాయి. ధ్రువ నాడిలో అట్లా జాతకం తప్పిపోవడం గుర్తించి అడిగితే అప్పటికి సరిపోయిన విధంగా ఇంకో తాటియాకు దొరుకుతుంది. అది ఇదివరకు చదివిన ఆకులో కన్న కూడా కొంత హెచ్చుభాగం సరిపోయినట్లుగా ఉంటుంది. కొన్నాళ్లకు అదీ తప్పిపోతూ ఉంటుంది. ఈ విధంగా ఆ నాడీ, దానిని చదివే వాడూ, జాతకుడు ఉన్నంత దాకా చదువుతూ గడుపుతూ జాతకాన్ని సరిదిద్దుకొంటూనే ఉండవచ్చు. కానీ, రేపు ఇలా జరుగబోతున్నది అని నిశ్చయంగా చెప్పే ఏ నాడీ గ్రంథాన్ని నేనెరుగను. అంతే కాదు అందుకు భిన్నంగానూ జరగటం నేనెరుగుదును. అన్నింటినీ పరిశీలించి చూస్తే, ఒక్కొక్కప్పుడు ఆ గ్రంథం ఆయా వేళల కనుకూలంగా నిర్మితమవుతూ ఉంటుందేమో అనిపిస్తుంది. ధ్రువనాడిలో జాతకము తప్పిపోయినప్పుడు కొత్త జాతకం దొరుకుతుండడం కూడా ఇట్టిదే. దీనిని బట్టి ఆ నాడీ గ్రంథాన్ని ఉపయోగించే గ్రంథస్వామి దానిని సృష్టిస్తున్నాడనే

వారు కొందరుంటారు. నాడీ తప్పిపోయినప్పుడల్లా ఆ నాడీని చదివే గ్రంథస్వామిని దొంగ అనీ, తప్పుడు సృష్టి చేస్తున్నాడనీ నిందిస్తూ ఉంటారు. దానిని చదివి పెట్టినందుకు గ్రంథస్వామి కొంత పైకం పుచ్చుకొంటాడు కాబట్టి ఒక్కొక్కప్పుడిలాంటి నిందలకు అతడు పాల్పడవలసి వస్తూ వుంటుంది. అంతేగానీ ఆ గ్రంథస్వామి అలాటి కొత్త సృష్టిని చేయగలిగినవాడు కాడని నేను స్పష్టంగా ఎరుగుదును. అతని దృష్టికి ఆ అక్షరములు అట్లా కానవచ్చినవి గానీ, ఆతని తలపునకు అట్లుగా శ్లోక పరంపర తోచెనని కానీ పేర్కొనుట తగును.

ధ్రువనాడీ స్వామియైన శేషాచార్యుల విషయంలో ఇది సరియైనదే. ఆ రోజుల్లో మాలాంటివారం చాలా మంది జాతకాలు రాయించు కొన్నాము. ఆశ్చర్యం పొందుతూ మిత్రులకు చాలామందికి జాతకాలు రాయించాము. అవి రాసేటప్పుడు విడవకుండా మేము దగ్గరే ఉన్నాము. ఇంతెందుకు? మా గురుదేవుల జాతకాన్ని నాడీలో చదివేటప్పుడు, రాయించేటప్పుడు నేను సన్నిధిలోనే ఉన్నాను. మరికొందరు మిత్రులు కూడా మా వెంట ఉన్నారు. ఆ గ్రంథం గల శేషాచార్యులూ మాస్టర్ గారి యెడ అపారమైన భక్తిగల శిష్యుడు. మాస్టరు గారి జాతకం అంతవరకూ అక్షరాక్షరమూ సత్యంగానే ఉండినది.

అందులో నాకు విడ్డూరంగా తోచిన కొన్ని విషయాలున్నవి.

"బ్రహ్మస్వరూపో$_{49}$ భగవాన్ దర్శనంచ క్వచిత్ క్వచిత్
అదర్శనం క్వచిచ్చేతి తతశ్చంచల బుద్ధిమాన్$_{3}$"

అంటూ తమ నలభైయ్యవ యేటి వృత్తాంతం అభివర్ణితమై ఉంది. అది చదివేటప్పుడు నేను దగ్గరే ఉన్నాను. ప్రతి మాటా ప్రామాణికంగా ఉందో లేదో అని మాస్టర్ గారు పరీక్షిస్తూనే ఉన్నారు. ఈ శ్లోకం చదువుతున్నప్పుడు కొంచెం సేపు ఆగి ఆలోచించి,

"ఆం. సరిగానే రాశాడు. తరువాత చదవండి" అన్నారు.

అప్పుడు ఆ శ్లోకానికి అర్థమేమిటో బ్రహ్మదర్శనం కలగడమంటే యెట్టిదో, అప్పుడేమి జరిగిందో వివరించి తెలుపండని కోరుదామనుకొని యెంత ప్రయత్నించినా నాలుక చివరిదాకా ప్రశ్న సాగుతుందే కానీ నాలుక దాటి బయటికి రాలేదు. అడుగుదామనుకొని యెంత తంటాలు పడినా ప్రశ్నించలేకపోయాను. "జీర్ణమంగే సుభాషితమ్"[50] అన్నట్లుగా ప్రశ్నార్థం నాలోనే నిలిచిపోయింది కానీ పయికి రానే లేదు. నేను ఈ యోగమార్గంలో చేరిన పదేళ్లకు అంటే 1926 వ సంవత్సరంలో ఒక అద్భుతానందమయ విషయం జరిగింది. దాని నెరుగుదునంతే కానీ 1936 దాకా అంటే మరి పదేళ్లకు[51] గానీ దాని వివరణమంతా తెలియరాకపోయింది. అదేమిటో ఆయా సందర్భాలు వచ్చినపుడు వివరిస్తాను.

ఈ నాడీ గ్రంథాలు ఆయా జాతకుల హృదయాలలో దాగివుండిన రహస్యార్థాలను గూడా కొన్ని కొన్ని పట్టులలో వివరించడం జరిగేది. అవి నాడీ రచయితకు జాతకునికి మాత్రమే తెలియదగినవిగా ఉండి గ్రంథాన్ని చదివి చెప్పే నాడీ స్వామికి గూడా తెలియనివిగా ఉంటాయి. ధ్రువనాడిలో నుండి ఇలాంటి వాటిని కొన్ని ఉదహరిస్తాను.

"జలగండ మవాప్నోతి మృత ప్రాయోప జీవనః" అని నా జాతకములో ఉంది. నేను మరచిపోయినాను గానీ అది జరిగిన విషయమే. మా దొడ్డిలో పిల్లలం కొందరం ఆడుకొంటున్నాము. నూతిలో వెదురు గడలు దింపి వాటిని పైకి లాగడం ఆట. నేను వేసిన గడ నీటి అడుగున బురదలోకి చొచ్చుకు పోయింది. దాని పై యంచు ఒర మీద నుంచి నా కందడం లేదు. అందుకోవడానికి నూతిలోకి తలను వంచి అందుకొనే యత్నం చేస్తున్నాను. ప్రక్క పిల్లవాడు నా ముడ్డిని పైకెత్తాడు. నేను నూతిలో పడిపోయాను. పిల్లలందరూ పటాపంచలై పారిపోయారు. మా నాన్నగారు

ఊళ్లో లేరు. మా అమ్మగారు ఇంట్లో ఏదో పని చేసుకొంటున్నారు. నూతిలో ఏదో దభీలని పడిన చప్పుడాలకించి మా పక్కింటి యాతడు వచ్చి చూసేసరికి పిల్లలు పారిపోతున్నారు. ఒకణ్ణి పట్టుకొని ఏమైందిరా అని అడిగితే నేను నూతిలో పడ్డ విషయం చెప్పాడు. అతడు పరుగెత్తుకు వచ్చి చూచేసరికే నేనొక మునకవేసి తేలి ఊగిసలాడుతున్న గడను పట్టుకొని ఇంకో మునకవేయకుండా తేలుతూ ఉన్నాను. అతడు ఒరలమీదుగా దిగి వచ్చి నన్ను పట్టుకొని బయటికి లాగి మా అమ్మగారికి అప్పజెప్పాడు. ఈ విషయమే ఆ నాడీలో ఉంది.

అలాగే నా పందొమ్మిదో యేట్ట అవనిగడ్డ దగ్గర బండి యేటిలోకి దిగుతుండగా బోల్తా కొట్టి చచ్చి బ్రతికాను. "వాహనాత్పతనంచైవ తన్మూలాచ్చమహద్విపత్" (బండి నుండి పడడం వలన వచ్చే ఆపద) అని అందులో ఉంది. ఇలాంటివి ప్రతి జాతకంలోనూ వింత వింతలుగా ఉండడం నేనెరుగుదును.

నేనెరిగిన మరో గొప్ప వింత. మదరాసులో ఒక గొప్ప యింటి పిల్లవాడికేదో కడుపులో తీవ్రమైన అనారోగ్యం. అది కుదర్చడానికి సాధ్యమయేది కాదు. బ్రతికితే ఒకవేళ శస్త్ర చికిత్సతోనే బ్రతకవచ్చునని ఆశ! ఆ కుర్రవాడు జీవిస్తాడో లేదో పరిశీలించుకోవాలని తలచి ధ్రువనాడీకారునికి ఎక్కువ సొమ్మిచ్చి, యింటికి రప్పించి, గ్రంథాన్ని అక్కడ ఉంచి చదివించుకొంటున్నారు. ఆ కుర్రవాని జాతకము సరిగానే అందులో ఉంది. అతని ఆరోగ్యపు వివరాలన్నీ కూడా సరిపోలుతూనే ఉన్నవి. ఆ జాతకపు ఆకు చివరి భాగం చదువుతూ ఉండినారు. అంతలో ఆపరేషన్ చేయడానికి డాక్టర్ రంగాచార్యులు గార్కు వచ్చారు. ఆ సమయానికి సరిగ్గా "శస్త్ర వైద్యేన జీవత్కి" అని నాడిలో వచ్చింది. ఇంక ఆ తర్వాతి ఆకును చదువవలసి ఉంది. డాక్టరు గారు రావడంతో నాడీని చదవడం ఆపేశారు.

అందరికీ అప్పటికి శస్త్ర వైద్యం చేత అతను జీవిస్తాడు అనే అర్థమే స్ఫురించింది. డాక్టరు శస్త్ర చికిత్సకు సిద్ధపడుతున్నారు. నాడీగ్రంథాన్ని చదువుతున్న పట్టును గుర్తించి కట్టిపెట్టి గృహస్వామి యినపపెట్టెలో తాళం వేసి తాళం చెవిని నాడీకారునికిచ్చారు. మరునాడు వచ్చి తరువాతి భాగాన్ని చదవడానికి ఏర్పాటు జరిగింది. తొందరగా నాడీకారుడైన శేషాచార్యుడు ఇంటికి వెళ్ళెను. జరిగినదంతా మాతోనూ చెప్పాడు. మేమూ ఆ కుర్రవాడు జీవిస్తాడనే అనుకొన్నాము.

ఆ మరునాడు శేషాచార్యుడు ఉదయాన్నే వాళ్ల యింటికి వెళ్లాడు. ఆపరేషను జరుగుతున్నప్పుడే ఆ పిల్లవాడు చనిపోయాడని తెలియవచ్చింది. అక్కడి పండితులు నివ్వెరపోతూ ఉండిరి. ఈతడిని నాడీ గ్రంథాన్ని తెరవ మన్నారు. తెరచి చూడగ ఆ జాతకంలోని చివరి శ్లోకమదే. తర్వాతి ఆకులో వేరొకరి జాతకం ఆరంభమై వుంది. తీరా చూస్తే శస్త్ర వైద్యే = శస్త్ర వైద్యము జరిగే కాలంలోనే, నజీవతి = చనిపోతాడు అని అర్థం కావడం. ఆ కారణం చేతనే ఆ జాతకం పై భాగం అందులో లేకపోవడం తెలియవచ్చింది. అందరూ దైవ వంచనకు దుఃఖించారు. ఇలాంటివి ధ్రువనాడీ చమత్కారాలు ఎన్నో నాకు తెలిసినవి వున్నవి.

అందులో సి.వి.వి. యోగమార్గానికి చేరినవారి జాతకాలు పదుల కొలదిగా చదివించినవి నాకు తెలుసు. ఆ చదవడం కూడా నా సమక్షంలోనే జరిగాయి. మాస్టర్ గారి జాతకంలో గల విషయాలే అనేకుల జాతకాలలోనూ ఉన్నవి. మాస్టరు గారి జాతకమూ వారి శిష్యుల జాతకాలూ, ఇతరులవీ కొన్నాళ్లయిన తర్వాత తప్పిపోవడమూ, తిరిగీ పరిశీలించి చూడగా సరియైనవి దొరకడమూ కూడా నేనెరిగినవే. మాస్టరుగారుండగానే ఆ నాడీ గ్రంథాన్ని శ్రీ వేపా రామేశం గారి దగ్గర కొన్ని వందల రూపాయలకు తాకట్టు పెట్టడం, వారు దానికి ఇండెక్సు రాయించడమూ కూడా జరిగింది.

ఆ నాళ్లల్లో కొత్తగా జాతకాలు చదవడమూ జరగలేదు. ఇంకా ఆతడా నాడీ గ్రంథాన్ని చదువుతుండిన నాళ్లలో వెల్లడైన జాతకాలనేకం ఈ ఇండెక్సు చేసిన గ్రంథంలో కానరాలేదు. వాటిని అతడు దాచే ఉంచుకొన్నాడో, చదివే నాళ్లల్లోనే కల్పించి చదివేవాడో అని కొంతమంది అనుకొనేవారు. కాని అతడు అలా కొత్తగా కల్పించి చదవడమో, దాచి ఉంచుకోవడమో చేయలేనివాడనే నా నిశ్చితాభిప్రాయం.

## భుజండ నాడి

మాస్టరుగారుండగానే, ధ్రువనాడి చదివే రోజుల్లోనే ఈ నాడీ గ్రంథం బయటపడింది. ఈ నాడీ గ్రంథం గల వ్యక్తి కుంభకోణ వాస్తవ్యుడే. పట్టు నూలి వృత్తి కుటుంబ వృత్తిగా గలవాడు. తగినంత డబ్బు తీసుకొని మాస్టరు గారి జాతకం చదవడం ఆరంభించాడు. అది చదివే దాకా అతనికి ఆ గ్రంథాన్ని చదివే విధానం కూడా బోధపడేది కాదట! మాస్టరు గారి జాతకాన్ని చదివే యత్నంలోనే ఆతనికా ప్రజ్ఞ యేర్పడిందట! ఆ జాతకం చదవడం వల్ల ఆతనికి మాస్టరు గారి యెడ భక్తి ప్రపత్తులూ కలిగినవి. మాస్టరు గారి శిష్యుడైనాడు. రోజూ మాస్టరు గారి జాతకంతో పాటు ఇతరుల జాతకాలూ చదువుతూ వచ్చిన ఆదాయంతో జీవితాన్ని గడుపుకొనే వసతి యేర్పడింది. ప్రధానంగా మాస్టరుగారి జాతకమూ, వారి కుటుంబం వారి జాతకాలూ, శిష్యులవీ, ఇతరులవీ చదవడంతో అతనికి తీరిక లేనంత పని ఉండేది.

ఇంక కొన్నాళ్లకు మాస్టరు గారు శరీరాన్ని విడువనుండగా అతణ్ణి ఇలా ప్రశ్నించారు. “ఉన్నది ఉన్నట్లుగా చదవడం, రాయడం చేస్తున్నావా? లేక కల్పన సాగిస్తున్నావా?” అని. ఆ రోజే అతనొక కల్పన చేశాడట! మాస్టరు గారి ముఖ్య శిష్యులలో “అంబష్టుడు” ఒకడు ఉండేవాడు అనడానికి “అమ్మట నొరువన్” అని నాడీలో ఉండగా, ఆ రోజు కాపీ రాస్తున్న

గోపీనాథరావు అనే వ్యక్తి, నాడీకారుడికి తగినవాడే, మాస్టరుగారి శిష్యుడొకడు పలుకుతోడు కాగా "పండిత నౌరువన్" అని మార్చి రాశాడట! దక్షిణ దేశంలో 'అంబష్టు' ని 'పండితుడు' అనడం పరిపాటే! మాస్టరు గారి ప్రశ్నకు – అది తలపునకు వచ్చి – గడగడలాడుతూ మాస్టరు గారితో తన తప్పిదాన్ని నివేదించుకున్నాడు. ఇకనెప్పుడూ ఇలాంటి మార్పులు చేయవద్దు అని మాస్టరు గారు శాసించారు. ఆఖరుకి శిష్యగోష్ఠిలో ఆ విషయాన్ని ప్రస్తావిస్తూ అంతకు ముందు రాసిన జాతక భాగాలలో ఇంకెన్ని కల్పనలు చేశాడో పరిశీలించాలనే కారణంగా పూర్వం ఎవరెవరు ఏ ఏ జాతకాల కాపీలు రాశారో వారినందరినీ మూలప్రతితో (Original = మాతృక) సరిచూడడం కోసమని తమ తమ కాపీలతో సహా సమావేశపరిచారు. ఎవరెవరి ప్రతుల్లో యెన్నెన్ని కల్పనలు చేరినాయో తెలియదు కాబట్టి అందరూ తమ నిర్దుష్టతను నిరూపించుకోవడానికి సిద్ధపడి వచ్చారు. మాస్టరు గారు నాడీకారుని మూలప్రతినీ, రాయించుకొన్నవారి జాతకాల కాపీలనూ స్వాధీన పరచుకొని వాటిని కట్టకట్టి అటక మీద పెట్టించి, ఇంక మీద నాడీ చదువవద్దు అని కట్టడి చేశారు. "నాడీ ప్రతి వ్రాయసగాడే ఏమైనా మార్పు చేసి ఉండవచ్చును. మాతృకను రాసినవాడే యేమైనా తప్పు రాసి ఉండ వచ్చును. అసలు గ్రంథకారుడే కూడా తప్పిదపు రచనా చేసి వుండవచ్చు. దానికి ప్రామాణ్యాన్ని కల్పించుకొని మీరు చదువకూడదు. నా దగ్గరికి వచ్చి మీరు శిష్యులైనది నాడి మూలాన కాదు. ఈ నాడిని మీరు చూసింది కూడా నా శిష్యులైన తర్వాతనే. ఏ కారణం చేత మీరు నా శిష్యులైనారో ఆ కారణం చేతనే నన్నుసరించి నడచుకోవలెను. నా మాటలు స్వతః ప్రమాణములు గాని పరతః ప్రమాణములు కావు. (నా మాటే మీకు పరమ ప్రమాణం కావలెను కానీ అందుకు మరో ప్రమాణం అవసరం లేదు). నా

కార్యాన్ని నాడీననుసరించి నమ్మడమన్నది తగదు" అన్నారు.

అప్పుడు అక్కడున్న శిష్యులు కొందరు "మీ ఆదేశాలందులో వ్యక్తములవుతున్నాయి గనుకనే నాడీని నమ్ముతున్నాము. అందుకది విరుద్ధంగా ఉన్నదనుకొంటే ఎప్పుడో దాన్ని విడిచేసేవాళ్ళం" అన్నారు.

"సరే! సనసన్నగా నన్ను అనువర్తిస్తున్నట్లుంటూనే యీ నాడీ కాలాంతరంలో అజ్ఞానం చేత తప్పులు చెప్పడం సాగించవచ్చును. అంతదాకా ప్రామాణ్యముంచిన గ్రంథం మీద అప్పుడు అప్రామాణ్యాన్ని కల్పించడం మీకు ఉచితముగా తోచకపోవచ్చును. నా యోగ మార్గాన్ని పరిపూర్ణంగా గుర్తించడం ఎవ్వరికీ సాధ్యం కాదు. అది నాకు గూడా అప్పటికప్పటికే తెలియదగినదిగా ఉంటుంది. శాఖోపశాఖలుగా విస్తరించే మఱ్ఱిచెట్టుకి ఎన్నాళ్లకు, ఏ దిక్కున, ఏ శాఖ వెలయగలదో తెలియనట్లే, లోకతంత్రంలోనూ, మరీ – యీ యోగతంత్రంలోనూ వికాసముంటుంది. మానవుడు ఈశ్వరత్వానికి దగ్గరవుతున్న కొద్దీ అట్టి జ్ఞానం కూడా విశదమవుతుంది. వృక్షశాస్త్రంలో కొన్ని వృక్షాలు ఇన్నాళ్ళకిన్ని ఆకులనో శాఖలనో వెలయింపగలవనీ యీ యీ సమయాల్లో పుష్పించగలవనీ, ఫలింపగలవనీ, ఇన్ని పుష్పములనీ, యిన్ని ఫలములనీ కూడా గుర్తించడం జరుగుతూ ఉన్నది. మానవ ప్రజ్ఞ పెరగగా పెరగగా, ఈశ్వరునకు చేరువు కానుగానూ సర్వప్రాణి సృష్టి రహస్యములనూ మానవుడు గుర్తింపగల్గ వచ్చును. మానవత పెరగ్గా పెరగ్గా మానవ హృదయంలోనే ప్రజ్ఞ, ఉద్బోధము పెరుగుతాయి. ఇప్పుడు అభివృద్ధి చెందుతున్న శాస్త్రాలన్నీ అట్టివే.

మానవ హృదయం నిర్దుష్టం కానంత వరకూ, మానవవాక్కు సుపవిత్రం కానంత వరకూ, మానవ కార్యాలు నిర్మలాలు కానంత వరకూ

సృష్టి రహస్యం మానవత గుర్తున కందబోదు. ప్రయత్నాలు సాగుతున్నవి. ఈ నాడీ గ్రంథాల పుట్టుకా అట్టి ప్రయత్నాలలోని భాగాలే.

"విహాయ శాస్త్ర జాలాని యత్సత్యం తదుపాస్యతామ్
వేద శాస్త్ర పురాణాని పదపాంసుమివ త్యజేత్ ॥ 52

"శాస్త్ర ప్రమాణం కన్న సత్య ప్రమాణమే మిన్న" అని సంగ్రహార్థం.

అని చెప్పినవారు ఇలాంటి భావము గలవారే. మీరీ నాడీగ్రంథాలను వెంటాడడం సాగిస్తే మీలోని ప్రజ్ఞోద్బోధాలు కుంటుపడతాయి. ప్రజ్ఞోద్బోధాలనే వెంటాడుతూ బాహ్యశాస్త్రాది సాధనాలను విడనాడాలి. అలా చేస్తే చివరకు ఆత్మానుభూతిలో నెలకొనడం అవుతుంది. మీరు చూడవలసినది యీ తాటాకుల నాడీ కాదు. శరీరంలో చైతన్యంతో ఆడుతున్న నాడిని. ఈ తాటాకుల నింక కట్టిపెట్టి, ఇందులో చూపుతున్న శ్రద్ధను యోగసాధన మీద పెట్టండి" అన్నారు.

ఇది జరిగిన కొన్నాళ్లకు ముఖ్య శిష్యులొకరు "నాడిలో ఏమి విశేషములున్నవో చదివి చూడాలని చాలా మంది ఉత్సాహపడుతున్నారు కనుక నాడీని చదవడానికి అనుగ్రహించండి" అని వేడుకోగా మాస్టరుగారు ఇలా బదులు చెప్పారట "ఆ నాడీ కొన్ని ముఖ్య విషయాలను వెల్లడించగలదు. అది చదవడానికి సమయమున్నది. అప్పుడు చదువుదురు గాని" అని! అంతకు పూర్వమే మాస్టరు గారి జాతకం కొంత భాగం చదవడమయింది. ఇతరుల జాతకాలలోనూ కొన్ని భాగాలను చదవడమయింది. ఆ రోజుల్లో నేనూ నా జాతకపు పీఠికా భాగాన్ని చదివించుకొన్నాను. ధ్రువనాడిని, భుజండ నాడి అవతరణికా భాగాన్నీ, విజయ నగరపు పక్షి శాస్త్ర శ్లోకాలను, 53 మాస్టరుగారిని గురించి నేను రాసి ఉంచుకొన్న పద్యాలను రాసి పెట్టుకున్న నా వ్రాత ప్రతిని, ఇటాలియన్ నోటుబుక్కును, ఎవరో

అపహరించారు. అది నా దగ్గిర ఇప్పుడు లేదు. ఉండి వుంటే అందులోని శ్లోకాలనూ, అరవ పద్యాలనూ, తెలుగు పద్యాలనూ చాలా వింత విషయాలు గలవాటిని ఇక్కడ ఉదహరించియుండే వాడను.

సీవీవీ కరుణా కటాక్షములు రక్షించున్ సదా తన్మయం
బైవర్తిల్లెడు భక్తియున్న యెడ, నిత్యానంద మారోగ్యమా
హా వుట్టించెడు ప్రజ్ఞ యీ త్రయము లభ్యంబౌను తార్కాణనే
నే! వేయేటికి? మీరలిందరును దీనిం జక్క గుర్తింపరో !

**సం॥ వే. ప్రభాకరశాస్త్రి**

---

౧. లార్డ్ పెంట్లాండ్ అలనాటి మదరాసు ప్రెసిడెన్సీ గవర్నరు.
౨. ఈ నాడీ గ్రంథాలను గురించి శ్రీ శాస్త్రిగారితో పాటు మరో మాస్టర్ యోగా మీడియము శ్రీ వావిలికొలను వేంకటరమణారావు గారు చాలా వ్యాసములు వ్రాసిరి.
౩. బ్రహ్మస్వరూప దర్శనం ఒక్కొక్కసారి అయినట్టూ, కానట్టూ అయి మనస్సు స్థిరంగా ఉండదు. ఈ దశ మాస్టర్ గారి 40వ యేట జరుగగా అది నాడీ గ్రంథములో పేర్కొనబడడం వింత. వారు దానిని గుర్తించి ఆమోదించారు.
౪. 1926 నాటి ఈ అనుభూతిని వర్ణించిన శ్రీ శాస్త్రిగారి లేఖాంశము కలదు. 1936లో తమకు తెలియవచ్చిన విషయమేమో తెలియరాలేదు. అన్వేషించవలెను.
౫. జలగండమునకు గురియగును. అనే నిష జరిగినదే. అది నాడీ గ్రంథములో పేర్కొనబడుట వింత.
౬. బండిపాటు - పెద్ద విపత్తు - ఇదీ జరిగినదే, నాడీ గ్రంథంలో పేర్కొనబడింది.
౭. డా॥ రంగాచార్యులు గారు అలనాడు ప్రఖ్యాతి వహించిన సర్జను వివరాలు సేకరించవలెను.
౮. శస్త్ర వైద్యేన+జీవతి - శస్త్ర వైద్యంచేత + జీవించును.
శస్త్ర వైద్యే + నజీవతి - శస్త్ర వైద్యము వలన + జీవించదు.
అని! ఆపరేషనుకి పూర్వం ఆశ, తరువాత నిరాశ!

# టిప్పణి (FOOT NOTES)

1. పరంపరగా హిందువులు కాలాన్ని 60 సంవత్సరముల చక్రంగా నిర్ణయించారు. చక్రంలో 60 సంవత్సరముల పేర్లు "ప్రభవ" .... మొదలు "అక్షయ" వరకు ఉంటాయి. ప్రతి సంవత్సరమును 12 నెలలుగా "చైత్రం" నుండి "ఫాల్గుణము" వరకు, ప్రతి నెలా 2 పక్షాలు (పక్షం = 15 రోజులు) గా శుక్ల పక్షం (అమావాస్య నుండి పౌర్ణమి దాకా), కృష్ణ పక్షం (పౌర్ణమి నుండి అమావాస్య వరకు) ఇవి చంద్రుని సంచారమును అనుసరించి ఏర్పడ్డవి.

హిందువుల పంచాంగాన్ని అనుసరించి 27 నక్షత్రములు ఉన్నవి. చంద్రుడు ఒక నక్షత్రం నుండి వరుసగా ఇంకొక నక్షత్రానికి ప్రవేశిస్తాడు. అంటే అశ్వని నుంచి రేవతి వరకు. ఒక్కొక్క నక్షత్రానికి 4 పాదాలు ఉంటాయి.

ఘడియలు, విఘడియలు కాలానికి అంగాలు. ఒక ఘడియ సుమారు 24' కాలపరిమితి కలిగి ఉంటుంది. ఘడియకి 1/60 వ భాగము విఘడియ. కాల విభజన ఈ క్రింది విధముగా ఉన్నది.

| | | |
|---|---|---|
| 18 నిమిషాలు | = | 1 కాష్టము. |
| 30 కాష్టాలు | = | 1 కళ |
| 30 కళలు | = | 1 క్షణం |
| 11 క్షణాలు | = | 1 ముహూర్తము |
| 30 ముహూర్తాలు | = | 1 రాత్రి, 1 పగలు = 1 దినము |

**(పుట నెం. 9)**

2. వృత్తి రీత్యా బ్రాహ్మణులు రెండు శాఖలుగా ఉన్నారు. వారు వైదికులు, నియోగులు. వైదికులు : వీరు వైదిక మతపరమైన కార్యకలాపాలు, వేదాధ్యయనము చేయుదురు. నియోగులు : వీరు పరిపాలనా వ్యవస్థ, యంత్రాంగము చూసుకొనేవారు.

బ్రాహ్మణులు వారి నివాస ప్రాంతములను అనుసరించి వేంగినాడు, వెలనాడు, పాకనాడు, మొదలైన పేర్లతో వ్యవహరించిరి. 'నాడు' అనిన ప్రాంతము.

**(పుట నెం. 9)**

3. **అక్షరాభ్యాసము :** హైందవ సంప్రదాయాన్ని అనుసరించి “అక్షరాభ్యాసము” బాలలకు తమ 5వ ఏట జరిపిస్తారు. ఆ నాటి నుంచి వ్రాయడం, చదవడం నేర్పిస్తారు. “షోడశకర్మల”లో ఉపనయనానికి ముందు జరిపించే కార్యము.

**(పుట నెం. 11)**

4. **బ్రహ్మముహూర్తము :**

సూర్యోదయానికి పూర్వం ప్రత్యేకించి నాలుగు గంటల ప్రాంతంలో శుభప్రదమైన సమయము. ఈ ముహూర్తపు వ్యవధి 96 నిమిషాలు. సృష్టికర్తయైన బ్రహ్మకు సంబంధించినది. శారీరకంగానూ, మానసికంగాను సత్ఫలితాలను సాధించు సమయం. సంస్కృత మహాకవి కాళిదాసు ప్రకారం అజ మహారాజు బ్రహ్మ ముహూర్తమున జన్మించుట వలన గొప్పవాడైనాడని వ్రాసెను.

**(పుట నెం. 12)**

5. **ఉంఛవృత్తి :**

పూర్వకాలంలో అడవులలో ఋషులు (తాపసులు) ఆ రోజు తమ భోజనానికి కావలసిన ధాన్యం, తదితరములు పొలాలలో పడి ఉన్న ధాన్యపుగింజలు ఏరుకొని వచ్చి వండుకుని తినేవారు. మన దేశంలో ఆధ్యాత్మికతను పెంపొందించేందుకు జనులు ఇతోధికంగా సహాయ సహకారాలు అందిస్తూనే ఉన్నారు. ఈ కాలంలో కూడా ధర్మాత్ములు విరాళంగా ధన ధాన్యాదులు దానం చేస్తున్నారు.

**(పుట నెం. 12)**

6. **మాధ్యాహ్నికం :**

సంధ్యావందనం ప్రాతఃకాల, మధ్యాహ్న, సాయంత్ర సమయాలలో చేయు ప్రార్థన. దీనినే “త్రికాల సంధ్యా వందనం” అంటారు. ఉపనయనం అయిన తరువాత మానవ శరీరానికి ఈ భూమి మీద రక్షణ కల్పిస్తున్న సర్వేశ్వరునికి కృతజ్ఞత తెలుపుతూ చేయు ప్రార్థన.

**(పుట నెం. 12)**

7. శ్రీ శాస్త్రిగారు రెండు మూడు సందర్భాలలో కొన్నిటికి వివరణ రాబోవు భాగాలలో

వివరింతునని వ్రాసినారు. కానీ దురదృష్టవశాత్తూ రెండవ భాగము వెలువడలేదు. పూర్వాపరాలు తెలిసికోవాలనే చదువరుల కుతూహలాన్ని బట్టి శాస్త్రిగారి సాహిత్యము, ఇతర రచనలూ ఆధారంగా వారి అభిప్రాయాలకు అనుగుణంగా మేము వ్రాసినవే కాని ఆయన వ్రాసినవి కావు.

గ్రామంలో జరిగిన రెండు సంఘటనలు, జాతరలు, జంతు బలులతో సాగే పూజా విధానములు శాస్త్రిగారి స్వభావమునకు విరుద్ధములు. నాడీ గ్రంథ పఠనము, శాస్త్రి గారి అనుయాయుల యొక్క యోగానుభవముల మూలంగా ఆయనకి జీవుల పట్ల గల ప్రేమ, కరుణ తెలుస్తుంది. దీనిని బట్టి ఆయన 'బుద్ధుని అంశ'గా తెలియనైనది.

**(పుట నెం. 13)**

8. **సర్పయాగము :** ఈ వృత్తాంతము మహాభారతము లోనిది. జనమేజయుడు తన తండ్రి పరీక్షిత్తు మరణమునకు కారణభూతుడైన తక్షకునిపై ప్రతీకారము తీసికొనుటకు సర్పయాగము చేసెను. భూమిపైనున్న అన్ని సర్పములు, తక్షకుడు మినహా మంత్రమహిమ చేత హోమాగ్నిలో పడి చనిపోయెను.

**(పుట నెం. 16)**

9. **సంధి కాలము :** చీకట్లు తొలగి సూర్యోదయమయే వేళ, మధ్యాహ్నపు వేళ (12 గం॥లకు) మరియు సూర్యాస్తమయి, చీకట్లు క్రమ్ముకొనేవేళ ఈ మూడు సమయములు (త్రికాల సంధ్యలు) సంధికాలమందురు. (సంధ్యా సమయంలో ధ్యానం చేయడం వలన ఫలితం బాగా ఉంటుంది). సంధ్యా వందనంలో సంధ్యా దేవతకి ప్రార్థనలు జరుపుతారు.

**ఉపనయనము :** పిల్లవానికి వేదాధ్యయనానికి ముందు ఉపనయనము చేస్తారు. ఈ ప్రక్రియ రెండవ జన్మకి సమానం అని అంటారు.

**(పుట నెం. 23)**

10. ఈ సంఘటన శాస్త్రిగారి మానవత్వాన్ని చాటి చెపుతుంది. ఈ విషయాన్ని విపులంగా ఆకాశవాణిలో ఇచ్చిన "చిన్ననాటి జ్ఞాపకాలు" అనే ప్రసంగం ద్వారా

తెలిసికోవచ్చును. దీని అనువాదము మణిమంజరి (2-1-1982) లో ప్రచురింపబడినది. ఈ వ్యాసం శాస్త్రిగారి ఆత్మావలోకనం, ఆధ్యాత్మిక అభివృద్ధితో పాటు జన్మతః తనకున్న అద్భుత శక్తులను ఎట్లా తెలుసుకున్నారో తెలుపుచున్నది.

**(పుట నెం. 26)**

11. వేటూరి (1888-1950) అవ్వారి (1895-1935) మరియు పిసుపాటి (.......-1907) ఈ పండిత త్రయము శ్రీ అద్దేపల్లి సోమనాథ శాస్త్రి మరియు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి వద్ద విద్యాభ్యాసము చేసిరి.

**(పుట నెం. 33)**

12. "చాతుర్యము" అంటే ఇక్కడ ప్రపంచ జ్ఞానము. ఐదు మార్గాల ద్వారా ఇది పొందవచ్చును. అవి : దేశాటనము, పండిత సాంగత్యము, వేశ్యల సంపర్కము, రాజాస్థానములో ఉండుట, అనేక విషయాలను అధ్యయనము చేసి తెలిసికొని ఉండుట అని ఈ క్రింది శ్లోకము తెలుపుచున్నది.

దేశాటనమ్ పండిత మిత్రతాచ,
వారాంగనా రాజసభా ప్రవేశః,
అనేక శాస్త్రార్థ విలోకనంచ,
చాతుర్య మూలాని భవంతి పంచ ॥

**(పుట నెం. 34)**

13. **రావు బహద్దూర్ కందుకూరి వీరేశలింగం పంతులు (1848-1919)**

వీరు బహుముఖ ప్రజ్ఞాశాలి, (భాషాప్రవీణుడు, సమాజాభివృద్ధికి పాటుపడిన సంఘ సంస్కర్త, కవి, అనువాదకుడు, పాత్రికేయుడు, గ్రంథకర్త) దక్షిణ దేశంలో ఆధునిక యుగానికి నాంది పలికినవారు. ఆయన వెలువరించిన "కవుల చరిత్ర" తెలుగు రచయితల చరిత్రగా ప్రసిద్ధికి ఎక్కింది.

**(పుట నెం. 35)**

14. **దేశభక్త కొండా వేంకటప్పయ్య (1866-1948) :**

పండితుడు, నాటకకర్త, న్యాయవాది, కాంగ్రెస్ నాయకుడు, దేశాభిమాని,

గాంధీ గారి అనుయాయుడు, స్వతంత్రం కోసం భారత జాతీయ సమ్మేళనంలో పాల్గొన్న వ్యక్తి "ఆంధ్ర స్వాతంత్ర్యోద్యమ జనకుడు" అనే పేరు గడించినవాడు.

**(పుట నెం. 35)**

15. **శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు :**

ప్రముఖ న్యాయవాది, జ్ఞాని, ఆర్జించిన ధనాన్నంతా విద్య మరియు సాంస్కృతిక ప్రయోజనాలకై ఖర్చు చేశారు. గొప్ప నిస్వార్థ ధర్మకర్త "మన స్వాతంత్ర్యము" అనే విషయంతో పాటు న్యాయపరమైన అనేక విషయాల మీద రచనలు చేశారు.

**(పుట నెం. 35)**

16. **శ్రీ రెంటాల సుబ్బారావు :**

సాహిత్యాభిలాషి, వకీలు, ఆ రోజుల్లో మద్రాసులో ఒక పుర ప్రముఖుడు. ఈయన గురజాడ అప్పారావు గారి బంధువు. గురజాడ వారు కవి. ఆధునిక సాహిత్యంలో కొత్త పోకడలతో నాటకాలు, కవిత్వము రాసిన వారు. నేటికీ చదవదగు "కన్యాశుల్కం" కర్త.

శ్రీ రెంటాల సుబ్బారావు గారు సులభ మార్గంలో చదువుటకు షేక్స్పియర్ నాటకాలపై విమర్శలు రచించారు. సుబ్బారావు గారికి ఒక ఫోటోస్టూడియో, భారతీయ మసాల సామాన్లు, ఊరగాయలు ఎగుమతి వ్యాపారము ఉండేవి. సాహిత్యాభిలాషి. శ్రీ ప్రభాకరశాస్త్రి గారి పాండిత్యాన్ని మెచ్చి "చాటు పద్య మణిమంజరి" ని అచ్చువేయుటకు ప్రోత్సహించిరి. శాస్త్రిగారి పాండిత్యానికి మెచ్చి మహాభారత పుస్తకాల సంపుటాలను బహూకరించిరి.

**(పుట నెం. 35)**

17. **శ్రీ వేపా రామేశం (1876-1947) :**

ఉమ్మడి మద్రాసు హైకోర్టులో పేరెన్నిక గన్న న్యాయాధీశుడిగా పనిచేసారు. న్యాయాధిపతి వృత్తితో పాటు బహుముఖ ప్రజ్ఞాశాలి, మేధావి.

**(పుట నెం. 37)**

**18. వైద్యరత్న పండిత దివి. గోపాలాచార్యులు (1872-1920) :**

ప్రఖ్యాత ఆయుర్వేద వైద్యుడు. ఆధునిక కాలంలో ఆయుర్వేద వైద్య విద్య అభివృద్ధి కావడానికి ఈయన మూలకారకుడు. శ్రీ ప్రభాకరశాస్త్రి గారికి మంచి స్నేహితుడు.

**(పుట నెం. 37)**

**19. శ్రీ పురాణం నాగభూషణం :**

................

**(పుట నెం. 37)**

**20. శ్రీ పనప్పాకం అనంతాచార్లు గారు (1843-1909)**

Indian National Congress (భారత జాతీయ కాంగ్రెస్) ప్రముఖులలో పేరెన్నికగన్నవారు శ్రీ అనంతాచార్లు గారు. 1891వ సంవత్సరమున నాగపూర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలకు అధ్యక్షత వహించినవారు. న్యాయవాద వృత్తిని కొనసాగిస్తూనే లలిత కళలనూ, సాహిత్యాన్ని ప్రోత్సహించారు. వారి వారాంతపు సాహిత్య గోష్ఠులలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారిని "కవి చూడామణి" అనీ, శ్రీ మానవల్లి రామకృష్ణయ్య గారిని "కవి" అనీ గౌరవించినట్లు తెలుస్తున్నది. శ్రీ అనంతాచార్ల వారూ, వారి కుమారులు శ్రీ శ్రీనివాసాచార్లు కలిసి అనువదించిన షేక్స్పియర్ నాటకాలు "ఒథెల్లో", "హామ్‌లెట్"లలో శ్రీ శాస్త్రిగారి కొన్ని పద్యాల అనువాదాలను చేర్చిరి.

**(పుట నెం. 37)**

21. "హేలీస్ కామెట్"ను (హేలీస్ తోకచుక్క) ప్రభాకరులు గమనించినప్పటికీ దాని ప్రాముఖ్యము మాస్టరు గారి యోగం ఆరంభించిన (29.5.1910) కొన్ని సంవత్సరముల వరకు ఆయనకు అంతగా తెలియరాలేదు. జూన్ 1916లో శ్రీ శాస్త్రిగారు యోగంలో చేరిన తరువాత భవిష్యత్తులో సృష్టిక్రమంలో జరిగే మార్పులను సూచిస్తూ వచ్చిన సంకేతాలను అందుకుని అర్థం చేసుకున్నవారు కొద్దిమంది మాత్రమే. శాస్త్రిగారి "దివ్య దర్శనము"లో వ్రాసిన వాక్యములు

"చక్షుర్గోచరమైన ఈ జగతికిన్ జాటై..." చదివితే వివరములు తెలియగలవు.

**(పుట నెం. 39)**

22. **శ్రీ ఎమ్. రంగాచార్యులు :** శ్రీ రంగాచార్యులవారు పండితుడు. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో సంస్కృత భాషా ఆచార్యులుగా పనిచేసిరి. ఈయన (G.O.ML) (మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం) లైబ్రరీ (Curator) క్యూరేటరుగా ఉండిరి. ఆ సమయంలో పావులూరి మల్లన్న శ్రీ ప్రభాకర శాస్త్రిగారి అభిప్రాయాలను సమర్థించిన వ్యక్తి. 10-08-1914లో కృష్ణా పత్రికలో శ్రీ రంగాచార్యుల వారి గురించి కలంపేరుతో వచ్చిన వ్యాసమును రచనాశైలిని బట్టి శాస్త్రిగారి రచన అనే అనుకోవచ్చు.

**(పుట నెం. 57)**

23. **కొచ్చెర్ల శ్రీనివాసరావు :**

**(పుట నెం. 57)**

24. ఈ అంశాన్ని ప్రజ్ఞా ప్రభాకరం అనువాదకుడు జాగ్రత్తగా పరిశీలించి, పరిశోధించి నిర్ణయించినది. ఈ సమావేశము ఏప్రిల్ 21, శనివారము 1917న జరిగినట్లు నిర్ధారించబడినది. దీనిని విపులంగా 1981న ప్రచురించిన మణిమంజరి Vol-1 ఫిబ్రవరి సంచికలో "ఒక లేఖ - ఒక సమాధానము" న చూడవచ్చును.

**(పుట నెం. 59)**

25. **శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు M.A. (1866-1957) :**

పండితుడు, కవి, సంస్కృత అధ్యాపకుడు 1940 ప్రాంతాలలో శ్రీ ప్రభాకరశాస్త్రి గారితో తిరుపతిలో పనిచేశారు. 1916-1920 మధ్యలో మద్రాసు ప్రభుత్వం వీరిద్దరినీ పాత తాటాకు గ్రంథాలను సేకరించుటకు నియమించిరి. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు నన్నిచోడుని కుమార సంభవ కావ్యమునకు సంపాదకులు. పరిష్కర్త భరతుని నాట్య శాస్త్రమున ప్రాధికారికత గలవారు.

**(పుట నెం. 60)**

26. ఈ వృత్తాంతాన్ని గురించి శ్రీ శాస్త్రిగారు ఇందులో వివరించలేదు కానీ తన ప్రసంగాలలో, రచనల్లో ధ్వనింపచేశారు. ప్రజ్ఞా ప్రభాకరం అనువాదకుడు

23-10-1985 "ఆంధ్రప్రభ" వార పత్రికలో "కలౌ వేంకటనాయకః" అనే వ్యాసంలో పై విషయాలు ప్రకటించారు. పాఠకులు ఈ విషయముపై ఇంకను పరిశోధించిన తెలియగలవు. ప్రస్తుతానికి మాస్టరు సి.వి.వి. గారు తిరుమల గుడికి వెళ్ళినపుడు వారి ప్రతిరూపం విగ్రహంలో చూసి నమస్కరించకుండా ఉండిపోయారు. శ్రీ శాస్త్రిగారికి 1910వ సంవత్సరమున చీకటి తప్ప మరేమీ గర్భ గుడిలో గమనించలేదు. అప్పటికే "భృక్తరహిత తారక రాజయోగం" ఆరంభమైనది. 1930, 1949లోనూ శ్రీ శాస్త్రిగారికి ఆలయ విశేషాలు తెలియవచ్చినవి. కాని వాటి వివరాలవెట్టివో మనకు తెలియరాలేదు.

**(పుట నెం. 66)**

27. **శ్రీ సుసర్ల కుమారస్వామి :**

శ్రీ శాస్త్రిగారి చిన్ననాటి స్నేహితుడు. మానవతా హృదయంతో బాధితులను ఆదుకుని సహాయ సహకారాలు అందించినవాడు. కృష్ణానది వరద భీభత్స సమయంలో ఆయన చేసిన సహాయ సహకారాలను ప్రశంసిస్తూ కృష్ణా పత్రికలో శాస్త్రిగారొక వ్యాసం వ్రాసిరి.

**(పుట నెం. 70)**

28. మద్రాసు నగరం మీద 1914వ సంవత్సరం సెప్టెంబరు 23 మంగళవారం నాటి రాత్రి 9 గంటలకు "ఎమ్‌డెన్" నావ నుండి బాంబు ప్రేలుడు జరిగినట్లు సమాచార పత్రికల్లో వచ్చింది. ఇది 2వ ప్రపంచ యుద్ధ సందర్భంలో జర్మనీ నావ ఎమ్‌డెన్ నుంచి జరిగిన బాంబు ప్రయోగము.

**(పుట నెం. 82)**

29. ఈ పలుకులు భవభూతి "ఉత్తర రామచరిత్ర" మొదటి అంకంలోనివి. రాముడు సీతా వియోగము చేత దుఃఖితుడై తనను తాను నిందించుకొనెను. తానున్న ప్రపంచమే నిర్జీవమైన అడవిలాగా తోచింది. తన జీవితము రసవిహీనంగా జీవము లేని కట్టెగా అనిపించింది.

**(పుట నెం. 88)**

30. మాస్టరు సి.వి.వి. గారు తమ శిష్యులను ఒక్క గాయత్రీ మంత్రము తప్ప ఇతర బీజాక్షరాలు, మంత్రాలు, జపించవద్దని హెచ్చరించారు. గాయత్రీ మంత్రము 24 అక్షరములతో కూడినది. ఇది మూడు వేదాల సారము. (ఋగ్, యజుర్, సామ) ఈ మంత్రార్థము మనిషి ఆలోచనలను సరైన మార్గంలో నడిపించమని సూర్యుని ఆరాధించుట. ఈ మంత్రాన్ని శ్రీ శాస్త్రిగారు తెలుగులోనికి అనువాదము చేసి నిజ జీవితంలో ఆచరణలోకి తెచ్చారు. రోజుకి వెయ్యి సార్లు మంత్రమును కేవలము ఉచ్చరించుటే కాని శరీరముపై దాని ప్రభావము ఎట్లున్నదో ఎరుగక చేసిన జపము వ్యర్థమని తలచిరి.

**(పుట నెం. 90)**

31. మహా ప్రస్థానమును గురించి మహాభారతమున వ్రాయబడినది. ఇది దేహమును వీడి చివరగా చేయు ప్రయాణము. పాండవులు, ధర్మరాజు మొదలగు వారు చేసిన చివరి ప్రయాణమును మహాప్రస్థానిక పర్వంలో వ్రాయబడినది.

**(పుట నెం. 93)**

32. మానవ ఉనికిని నాలుగు భాగాలుగా (దశలుగా) విభజిస్తే అవి బ్రహ్మచర్యము (విద్యాభ్యాసము), గార్హస్థ్యము, వానప్రస్థము, చివరిగా సన్యాసము. సన్యాసాశ్రమము చివరి దశ.

**(పుట నెం. 99)**

33. ప్రభాకర శాస్త్రిగారు ఈ రోజు అంటే జూన్ 22 శుక్రవారం 1916 అని స్వదస్తూరితో వ్రాసినారు. అది జ్యేష్ట బహుళ అష్టమీ శుక్రవారం 1.27 ఉత్తరాభాద్ర నక్షత్రము. 10.24 ఆణిమాసం 10వ రోజు అగును. ఈ రోజు శాస్త్రిగారు యోగంలో ప్రవేశించిన రోజు.

**(పుట నెం. 100)**

34. **ప్రేతాసనం :** ఈ ఆసనం ఒక అచేతనంగా ఉన్న మృత దేహాన్ని పోలినదిగా ఉండును. కాళ్ళు, చేతులు చాచి వెల్లకిల్లా పడుకుని ఉండటం. ఈ ఆసనం శరీరానికి విశ్రాంతినిచ్చునది.

**(పుట నెం. 100)**

35. "ఉపదిష్టము" అనిన ఉపదేశింపబడినది అని అర్థము. మాస్టరు గారు "ఇనిసియేషన్" చేసిన వారికి సలహాలతో కూడిన గురూపదేశము చేసేవారు.

**(పుట నెం. 100)**

36. బీజాక్షరము శక్తిమంతమైన విత్తనములాంటిది. ఎట్లాగైతే విత్తనము అంకురించి జీవశక్తిగా మొక్కరూపంలో విస్తరించునో అట్లే కొన్ని బీజాక్షరాలు ఉచ్చరించినపుడు శక్తిమంతములైన ధ్వనులు వెలువడతాయి. అట్లే మాస్టర్ సి.వి.వి. నమస్కారము అనునవి శక్తిమంతములైన బీజాక్షరాలు. అవి ఉచ్చరించినపుడు ప్రారంభంలో శరీరములో ఆధ్యాత్మికంగా కొంత సంచలనం రేకెత్తుతుంది. కాలక్రమేణ ప్రాక్టీసుతో తెలిసికొనుటకు అవకాశం ఉంది. అవి గురూపదేశంతో ఉచ్చరించిన శరీరములో జరుగు మార్పులను గమనించవచ్చును.

**(పుట నెం. 100)**

37. **టెస్ట్ (Test) :** అన్నది ఒక ఆధ్యాత్మిక ప్రక్రియ. పరీక్ష చేయదలచిన వ్యక్తిలో (శిష్యుని) మాస్టరు గారి శక్తిని ప్రవేశపెట్టి తద్వారా అతని శారీరక స్వభావము, లక్షణములు, పూర్వజన్మ వృత్తాంతము మరియు ప్రస్తుత జీవితమును గూర్చి తెలిసికొనేవారు. ఇట్టి పరీక్ష మాస్టరు గారు ఆజ్ఞాపించిన వారికే కాని అందరికీ జరుగవు. ఇటువంటి "టెస్టు" ప్రభాకర శాస్త్రిగారితో పాటు ఆయన తమ్ముడు డా॥ చంద్రశేఖరశాస్త్రి గారికి కూడా మద్రాసులో శ్రీ సి.ఆర్. కృష్ణస్వామి అయ్యర్ గారి చేత చేయించిరి.

టెస్ట్ తీసుకున్న వ్యక్తికి టైఫాయిడ్ వచ్చినప్పుడు అతని శరీరంలో జరిగిన మార్పులను గుర్తించడం జరిగింది. ఇప్పటి ఆధునిక స్కానింగ్‌ను మించిన అత్యద్భుత రీతిలో శాస్త్రిగారి పరీక్ష చేయడం జరిగింది.

**(పుట నెం. 104)**

38. నా అనారోగ్య సమయంలో మాస్టరు గారి రక్షణ కోరినప్పుడు సాంత్వనపరుస్తూ "భయపడవద్దు, నీ రక్షణ బాధ్యత నాది" అని అభయహస్తమిచ్చిరి. వారికి నా నమస్కారములు.

**(పుట నెం. 107)**

39. అగ్రహారము విద్యాధికులైన బ్రాహ్మణులకు కల్పించిన నివాస స్థలము లేక ఒక గ్రామము. వారు ఎంచుకున్న బాటలో విద్యాభ్యాసము, విధి నిర్వహణలు కొనసాగించుటకు పన్నుల భారం లేకుండా, గ్రామ ఆదాయం వినియోగించు కొనుటకు ఏర్పరచిన నివాస ప్రదేశము.

**(పుట నెం. 111)**

40. అంధుడికి అద్దం, బుద్ధిహీనుడికి విజ్ఞాన శాస్త్ర ప్రయోజనం తెలియదు.

**(పుట నెం. 112)**

41. ఎవరికైతే అనంతమైన ఆధ్యాత్మిక జ్ఞానము పట్ల అభిరుచి ఉండదో వారికి శాస్త్రాలు కొంతవరకే తెలిసికొనుటకు తోడ్పడతాయి. ఇక ఎవరికి ఆధ్యాత్మిక జ్ఞానపిపాస కలదో అట్టివారికి శాస్త్రాలకు మించిన జ్ఞాన సంపాదన కలుగును.

**(పుట నెం. 112)**

42. ఈ వచనము "బృహదారణ్యక ఉపనిషత్" నుంచి గ్రహించబడినది.

ఒక వివేకవంతుడు తన అంతరాత్మననుసరించి ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పెంపొందించుకొనవలయును కాని కేవలము పుస్తక పఠనము వలన శరీరములోని అవయవాలు, వాక్పటిమ దెబ్బతింటాయే కాని ఆధ్యాత్మికంగా ఎదుగుదల సాధ్యపడదు.

**(పుట నెం. 112)**

43. సత్యాన్ని గౌరవించి, ఆరాధించి అనుసరించడమే జీవిత పరమార్థంగా పెట్టుకోవాలి గాని అల్పజ్ఞానంతో వ్రాసిన, చదివిన వాటిని పాదధూళిగా వదిలిపెట్టాలి.

**(పుట నెం. 112)**

44. ఈ శ్లోకం "సుభాషిత రత్న భాండాగారము నుండి గ్రహింపబడినది.

అనంత శాస్త్రం బహు వేదితవ్యం
అల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః
యత్సారభూతం తదుపాసితవ్యం
హంసో యథా క్షీరమివాంబు మధ్యాత్ ।

అనేక శాస్త్రాలలో తెలిసికొని నేర్చుకోదగినవి అనేకం. కాని సమయం విఘ్నాలతో కూడినది కనుక చదివిన వాటిలోని సారాంశమును గ్రహించి మిగిలిన వాటిని వదిలేయాలి. హంస పాలను గ్రహించి నీటిని వదిలినట్లుగా మంచిని తీసుకొని చెడుని వదిలిపెట్టాలి.

**(పుట నెం. 116)**

45. దీని వెనుక సంస్కృతములోని "న్యాయః" అనే (ఘట్టకుటీ ప్రభాతన్యాయః) కథ ఉంది. ఒక బండివాడు గ్రామములోనికి ప్రవేశించునపుడు కట్టవలసిన పన్ను కట్టకుండా తప్పించుకోవడానికి రాత్రంతా చుట్టూ తిరిగి శ్రమపడినా చివరికి పన్ను చెల్లించవలసి వచ్చెను. తాను పడిన శ్రమ అంతా వృధా అయింది.

**(పుట నెం. 116)**

46. ఈ పుస్తకంలో దీనిని గూర్చి వివరంగా లేనప్పటికీ ప్రభాకరశాస్త్రి గారి ఇతర రచనల్లోనూ, ప్రసంగాలలోనూ, వారి శిష్యుల ద్వారా డా॥ టి.యన్. రామచంద్రన్ లాంటి వారి ద్వారా సేకరించినవి ప్రచురింపబడినవి.

శ్రీ ప్రభాకరులు వయోవృద్ధులైన వారి తల్లిదండ్రులకు ఈ యోగంలో ప్రవేశము అనుమతించమని ... అడిగిరి. కానీ మాస్టరు గారు అంతకు ముందే భార్యకు ప్రవేశము ముఖ్యమని సూచించిరి. దీని అంతరార్థమేమిటో శాస్త్రిగారు తమ తండ్రిగారి మరణానంతరము 1927 ప్రాంతములో గ్రహించిరి. 1930వ సంవత్సరమున తండ్రిగారి పునర్జన్మ మూడవ కుమారుని రూపంలో జరిగింది. జాతకాల పుస్తకంలో "తాతపాదులు" అని వ్రాసి పేరు వ్రాయడం జరిగింది.

**(పుట నెం. 130)**

47. కొన్ని నాడీ గ్రంథాలు తాటి ఆకుల మీద, మరికొన్ని కాగితాలలో అనేకమంది జాతకాలు భద్రపరచి ఉన్నాయి. ఇప్పటికీ వాటి ప్రతులు అనేక గ్రంథాలయాలలో సంస్కృత, తమిళ, తెలుగు మరియు ఇతర భాషలలో లభ్యమవుతున్నాయి. నాడిని పరీక్షించి మనిషి యొక్క దేహస్థితిని తత్వాన్ని తెలుసుకోవచ్చును. అలాగే నాడీ గ్రంథాలలో జాతకుల గతాన్ని, గత జన్మల వివరాలను తెలుసుకోవచ్చును.

నాడీ గ్రంథాలను గూర్చి క్లుప్తంగా శాస్త్రిగారి వివరణలు చివరిభాగంలో చదవవచ్చును. చదువరులు మరిన్ని విషయాలను తెలుసుకోగోరిన పక్షంలో 1981, ఆగస్టులో ప్రచురించిన మణిమంజరి, సంపుటము-1, సంచిక-2, 1983 ఫిబ్రవరిలోని మణిమంజరి సంపుటము-3, సంచిక-1 (వాల్యూమ్) లో చూడవచ్చును.

**(పుట నెం. 133)**

48. "సీస" పద్యం తెలుగులో ఒక ఛందస్సు యొక్క పేరు. ఈ పద్యానికి 4 పెద్ద పంక్తులలో ఉన్నదానిని 8 పాదములుగా విభజించి దీనిని అనుసంథానించడానికి ఇంకా 4 పాదములతో (ఎత్తు గీతి) పద్యరచన కొనసాగుతుంది. ముందు చెప్పబడిన నాలుగు పెద్ద పాదములు కాక అధికసంఖ్యలో పాదాలను కూర్చినప్పుడు పెద్ద శృంఖలంగా పద్యరచన కొనసాగుతుంది. ఇట్టిదానిని "సీస మాలిక" అని అంటారు.

**(పుట నెం. 133)**

49. ఈ శ్లోక భాగము ధృవనాడి నుంచి గ్రహించబడినది. మాస్టరు గారి 40వ సంవత్సరమునకు సంబంధించినది. ఇందు "ఆయన స్వతః బ్రహ్మం, అప్పుడప్పుడు ఆత్మ దర్శనము చేసుకొనుచున్నవారు కనుక, చంచలమైన ఆలోచనతో తాము పొందిన ఒక ఆధ్యాత్మిక అనుభవాన్ని క్రింది నోట్‌లో మాస్టరు గారు వ్రాసినారని తోచును. 'K' యొక్క బరువు స్థిరత్వం కన్నా తక్కువగా ఉండటం మూలాన అది సరిగా పనిచేయలేక పోతోంది. దీనిని కేంద్రానికి రప్పించి సరిచేయుటకు 40 సంవత్సరములు పట్టినది". శ్రీ శాస్త్రిగారికిని తమ 40వ ఏట కల్గిన యిట్టి అనుభవమును 'దివ్యదర్శనము' అను తమ పద్య కావ్యంలో వెల్లడించినారు. "నలువది ఏండ్లు నిండె..."

**(పుట నెం. 136)**

50. 'బోద్ధారో మత్సరగ్రస్త' (నీతి. 2) అను పంక్తి భర్తృహరి నీతి శతకంలో నుండి తీసికొనబడినది. దీని అర్థం - బాగా చదువుకొన్నవారు ఈర్ష్యాళువులై ఉన్నారు. ప్రభువులు గర్వాంధులై ఉన్నారు. ఇతరులైన సామాన్యజనం అజ్ఞానంలో

ఉన్నారు. మరి ఈ సూక్తి ఎవరి కోసం? కొన్ని సందర్భాలలో పైన చెప్పిన సుభాషితము మనస్సులోనే ఉండిపోతోంది.

**(పుట నెం. 137)**

51. ప్రభాకరశాస్త్రి గారి ఆధ్యాత్మిక అనుభవాలను బట్టి "బ్రహ్మస్వరూప" మను అనుభవ విషయమును పది సంవత్సరముల అనంతరం (1926 మరియు 1936) కొన్ని ఉత్తరముల (అచ్చులోకి రానివి) ద్వారా తెలియపరచిరి. మార్చి 26, 1926వ సంవత్సరమున తన చిన్న తమ్ముడికి ఉత్తరముల ద్వారా తెలియపరచిరి. ఇదే అనుభవాన్ని శ్రీ పోతరాజు నరసింహం గారికి కూడా 25 రాత్రి 1.15 గం॥లకు తెలియబరచిరి.

ఈ అనుభవ సారాన్ని ఈ క్రింది పేరాలో వివరించిరి.

"ప్రార్థనలో "నా శరీరము బొంగరంలాగా తిరుగుతూ స్వప్నావస్థాకాని, నిద్రావస్థా కాని యట్టి స్థితిలో తెలుస్తూనే ఉన్నది. అట్లా కొంతసేపు అయిన తరువాత నా మోకాళ్ళ మీద కూర్చుని తలవంచి నమస్కారం చేశాను. ఆ సమయంలో పృష్ట భాగంలోని మూలాధార స్థానం నుంచి ఒక అలజడి, గుసగుసలు గుర్తించబడినవి. దానితో పాటు చక్కిలిగింతల అనుభూతితో ఒక పొడవైనదేదో లోపలి నుంచి పొడుచుకుని వెన్నెముక ద్వారా పైకి వెడుతున్నట్లు ఒక అనుభవం కలిగింది. ఆ సమయంలో కొంత నొప్పి అనిపించింది కాని అది ఏమిటో తెలియక భయం వేసింది. రెండు మూడు సార్లు కాంతివంతమైన వెలుగు కనిపించింది. నేను కనులు తెరిచి భయంతో కొంతసేపు ఉండిన తరువాత సర్దుకుంది. అప్పుడు సమయం 1.15 (అర్ధరాత్రి). ఈ అనుభవాన్ని శ్రీ పోతరాజు నరసింహం గారికి ఉత్తరం ద్వారా వెంటనే తెలియపరుస్తూ మరునాటి ఉదయాన్నే పోస్టు చేయడం జరిగింది.

28-3-1945 లో వ్రాసిన ఆత్మ ప్రబోధము వలన కలిగిన మరొక అనుభవాన్ని ఇచ్చుట క్రోడీకరిస్తున్నాము. ఇది 1926లో కలిగిన అనుభూతిని పోలి ఉన్నది. ఇది సంపుటము 12-1986 మణిమంజరిలో ప్రచురించబడినది. ఇది 1936లో జరిగిన అనుభవము అయి ఉండవచ్చును. అప్పటి అనుభవ సారం క్లుప్తంగా

ఇవ్వబడినది.

ఒక తీక్ష్ణమైన కాంతి వెన్నెముక పై నుంచి కుండలిని వరకు దిగి ఆవరించి ఉండుట సుమారు 15 నిముషములపైనే గమనించడమైనది. జాగ్రదవస్థలో స్వప్నంలాగా తెలియనైనది. ఈ కాంతి కుండలినిని ఛేదించి లోనికి ప్రవేశించినది. నీవు దీనిని గమనించలేదా? గమనించినా దానికి ప్రాముఖ్యమివ్వలేదు. మరొకసారి ప్రయత్నించుము. తనను తాను తెలిసికొనుటకు అవకాశము కలుగును.

ఈ అనుభవము 1936కి సంబంధించినదైనా లిఖిత పూర్వకంగా అది 1945 సం॥లోనే తెలియపరచబడినది. సర్వజిత్ నామ సంవత్సరములో 60 ఏండ్లు నిండిన సందర్భములో, తన ఆత్మకథను వ్రాయుటకు ప్రయత్నించినపుడు "ప్రజ్ఞా ప్రభాకరము"లో వ్రాయడమైనది.

**(పుట నెం. 137)**

52. వేదశాస్త్ర పురాణాదులలోని సత్యాన్ని గ్రహించి ఆచరించుచున్నప్పుడు ఆ గ్రంథాలతో పని అంతగా ఉండదు.

**(పుట నెం. 143)**

53. "శకునాలు" మంచి చెడులను గుర్తించుటకు ఒక సూచనగా వాడేవారు. పూర్వకాలంలో పక్షుల కదలికలు, వాటి ధ్వనుల మూలంగా శకునాలను భవిష్యత్తులో జరుగ గల సంఘటనలను సూచించేవారు. ఈ పుస్తకంలో ప్రస్తావించిన "పక్షి శాస్త్రము" విజయనగరము నందు కనుగొనబడినది.

**(పుట నెం. 143)**

---

పాదసూచికలున్న ఈ అంశాలు కొన్నిటి ఆకరాలను ఆచార్య శ్రీ పి. శ్రీరామచంద్రుడు మరియు శ్రీ డా॥ పి. శేషగిరిరావు గార్లు గుర్తించి అందించినవి. వారికి సదా కృతజ్ఞతలు.

## వేటూరి ప్రభాకరశాస్త్రి

ఈ పద్యములు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ద్వితీయ అన్నమాచార్యోత్సవ సందర్భమున శ్రీస్వామిని దర్శించినపుడు, వేసంగి సెలవులలో హిందూమతోపన్యాసము లొసంగుటకు వెళ్లి శ్రీస్వామివారిని దర్శించినపుడు రచించినవి.

1950 (ఏప్రిల్ – మే)

### తిరుపతికొండ

సీ॥ శృంగారరాయని చెలువు మీఱినకొండ
ఫణిరాజు పేరిటి పసిఁడికొండ
పుష్పజాతుల విష్ణుఁ బూజింపఁగలకొండ
కల్పవృక్షము లెల్లఁ గలుగుకొండ
చిలుకలు కోయిలల్ పలుకరించెడుకొండ
మృగరాజు కోటులు మెలఁగుకొండ
ఘోరదురిత మార్చు కోనేర్లుగలకొండ
తలఁచినమోక్షంబు గలుగుకొండ.

గీ॥ అమరవరులకు వైకుంఠ మైనకొండ
ఆళువార్లకుఁ బ్రత్యక్ష మయినకొండ
అరసి చూచిన బ్రహ్మాండ మైనకొండ
నేను పొడగంటి శ్రీవేంకటేశుకొండ.

### శ్రీవేంకటేశ్వరుఁడు

సీ॥ అఖిలవిశ్వమున కేకాధార మర్చావ
తారమ్ము తానౌట తథ్యమగును,
అఖిలమై యాదిమధ్యాంతముల్ లేఁగొన్న
నిత్యంబు తా నౌట సత్యమగును,
అఖిలపూర్ణము సచ్చిదానందమయము నా
రాయణార్థకము తా నగుట నిజము
అఖిలజీవుల కాయురారోగ్యభాగ్యప్రద
దాత తానౌట యథార్థ మగును.

గీ॥ అఖిల మయి పొల్చు తనకల్మి నరయ నఖిల;
మఖిలము ఖిలమ్మె తలకల్మి నరయకున్న
నెవ్వఁ డవ్వాఁడ వీవెరావే, భయార్తు
నాదుకోవె ! వేంకటనాథ ! వేడుకోవె !

సీ॥ నిట్టనిల్వులు లోయపట్టులు కడునొడు
దొడుకులు నగుమెట్టుత్రోవలందు
నడునడనడుఁకుచు వడఁకులు వాఱుచు
నెడనెడ నిట్టూర్పు లుడుపుకొనుచు
నేడుకొండలు నిన్నుఁ బాడుచుఁ గడచని
సోలుచుఁ జొక్కుచు నాలయంబు
చేరి యయ్యెడఁ గల్గుద్వారపాలకుల దం
దడి కోసరిల్లి లోఁగడకుఁ జొచ్చి

గీ॥ దివ్యభవదీయదృష్టి కందితిమి; కష్ట
పడక లభియింప దీశ్వరపద మటన్న
సూక్తి నిజమయ్యెనిన్ జూచి చొక్కినాఁడ
దక్కినాఁడ నీ, కిటుచూడు మ్రొక్కువాఁడ !

సీ॥ ఆకుఁజిల్కలు ఱెక్క లల్లార్చి యాడుచోఁ
బువ్వుల్ గుబాళించి నవ్వుచోట
పక్షులతో వృక్షపటలి వెల్విరియుచో
జంపతుల్ వాహ్యాళి సల్పుచోట
జలజల సెలయేళ్లు జాల్వారి దొరలుచో
నదులు సంద్రములతోఁ గదియుచోట,
ఏకాగ్రవృత్తి యోగీశ్వరుల్ వెలయుచో
నద్రిశృంగములు మిన్నందుచోట,

గీ॥ పుడమికి గుడారుగా మిన్ను పొలుచుచోట,
నాకసము భూమి యంటిసలాడుచోట
చొచ్చు లోలోని కెచ్చటొ చొక్కుఁ దక్కు
నామనసు నీకు వేంకటానందనాథ !

సీ॥ వెలసితి వేదుకొండలమీఁద నూరును
బల్లెయు దరిలేని పట్టునందు
నెలకొల్పితివి దివ్యనిలయంబు లచ్చోట
బహుభోగభాగ్యముల్ పరిఢవిల్ల
రప్పించుకొనుచుంటి వెప్పుడుఁ గోటానఁ
గోట్లభక్తులను నీకొండదరికి,
రక్షించుచుంటి సర్వప్రపంచము మ్రొక్కు
లిడువారి కాపదల్ తొడరకుండ

గీ॥ ననుదినము వేనవేలు ద్రవ్యంబు సేక
రించుచుంటివి వడ్డితోఁ బెంచి పెంచి
నీ మహత్త్వంబు దెలియనౌనేమి స్వామి?
బిడ్డలను గావ నీకెంత జడ్డు దేవ !

శా॥ ఏవేవో వెఱిమొఱ్ఱి చేయ్దములతో నీలోకతంత్రమ్ములన్
బ్రావీణ్యంబు గణింపఁజూచితిని వ్యర్థంబయ్యె; మేల్కొంటి, నో
దేవా! సర్వము నీయధీనమగు టర్థిన్ గంటి, వెన్నంటి నీ
త్రోవన్ ద్రొక్కితిఁ జిక్కులుక్కడఁగెఁ దోడ్తో వేంకటాధీశ్వరా!

సీ॥ నగ్నస్వరూపసౌందర్యదర్శనవేళ
భైరవమూర్తివైభవముగంటి
క్షీరపూర్ణఘటాభిషేకసంభ్రమవేళ
జినదేవమూర్తివిన్ననువు గంటి
కర్పూరకస్తూరికాలేపనాభిషే
కమువేళ నౌమాపతమును గంటి
హైమోత్తరీయ సమర్పణార్చణవేళ
పరశక్తిమూర్తి సుందరత గంటి

గీ॥ మంగ తాళి ధరించి సర్వాంగశోభ
వెలయువేళ నీవిష్ణుత్వ మెలమిఁ గంటి
సర్వదేవతాత్మకమయి జరగు నీదు
శుక్రవారాభిషేక ముత్సుకతఁ గంటి.

(శ్రీ వేంకటేశ్వర స్తుతిరత్నమాల నుండి గ్రహించబడిన శ్రీ శాస్త్రిగారి రచన)

వియోగం, ఇంటికే ప్రకమిటీ, పదవృత్తి, యజాని
పత్నికి ఏదార్శ గర్భంగను, Inner Experiences,
ట్రీట్‌మెంటు, ఆ రెండు పుట్టడం,
Treatment I    T. N. రామచంద్రన్. వారి సి
స్టరు. కుప్పుస్వామి శాస్త్రి గారు. ఆప్పారావు గారి
జీవనము. వారి యింటి ట్రీట్మెంటు విశేషాలు,
లలిత విశాఖా సాన్నిధ్యము, తగాయిదాలు.
వివాహం జరగడం, అంతకు పూర్వమే వీర
మణి, విశ్వనాథం, పంప యజ్ఞ రెడ్డి, రాధాకృష్ణ
య్యర్, సత్రి రా — కుప్పుస్వామి శాస్త్రిగారి ట్రీ
ట్మెంటు. P.P.S Sastri. తిరుపతి ప్రయాణం,
తిప్పేరుకలవడం, తిరుపతి రావడం.

[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible] —"

---

ఇది శ్రీ కొత్త వెంకటేశ్వరరావు గారి డైరీల నుండి సేకరించితిమి. దీనిని వారు భద్రపరచి మాకు అందించిరి. ఇందులోని దస్తూరి గురుదేవులు శ్రీ వి.పి.యస్. గారిదే.

Master C.V.V. Namaskaram

# The Yoga School Friendship Society

## KUMBAKONAM

Year - wise list of Mediums initiated by Master C.V.V.

**1910 (M. 14 F. 2)**

1. Master C.V.V.
2. S. Sundara Sarma
3. C. Vencamma
4. C.V. Venkatram
5. S. Rama Rao
6. C. V. Krishnamurthy
7. K. Ammani Ammal
8. R. Raja Rao
9. M. Srinivasa Rao
10. K. Ramchandra Iyer
11. V. Ramachandra Iyer
12. C. A. Sankara Sastri
13. M. Ramachandra Iyer
14. Padmanabaiyah
15. C. Kuppusamy Iyer
16. C. V. Sambasiva Iyer

**1911 (M. 14 F. 2)**

17. K. Vencamma
18. C. Seetharama Pillay
19. B. S. Krishnamurthy
20. S. P. Ramaiah
21. H. Ramamoorthy
22. T. S. Sundaresa Iyer
23. R. Vejendra Rao
24. S. Subramanyan
25. Rukmani Ammal
26. C. Radhakrishna Pillay
27. C. N. Narayana Rao
28. T. ramaiyah
29. V. Sundaresa Iyer
30. M. Sundaresa Sastriar
31. Dharma Dikshathar
32. N. K. Lekshmana Iyer

**1912 (M. 5)**

33. S. Ramasamy Iyengar
34. H. Rengaraja Rao
35. N. Krishna Rao
36. V. S. Krishna Iyengar
37. R. Srinivasagopalachariar

**1913 (M. 76 F. 1)**

38. C. R. Srinivasa Iyer
39. Y. Yegyanarayana Iyer
40. W. Srinivasavaradachariar
41. K.S. Gopala Iyengar
42. R. Sivarama Iyer
43. K. Krishna Rao
44. A. Ananthachariar
45. D. Venkatrama Iyer
46. S. Narayana Iyer
47. S. Krishna Sastry
48. P. S. Subramanya Iyer
49. T. N. Sambasiva Iyer
50. S. K. Sundaram Iyer
51. K. Seetharama Iyer
52. K. S. Krishnasamy Iyengar
53. N. Thiyagaraja Iyer
54. R. Gopalachariar
55. K. Vaidyanatha Iyer
56. T. Nagaraja Rao
57. K. Ramasamy Iyer
58. S. Rengasamy Iyer
59. R. Sethu Iyer
60. P.S. Jagadesa Iyer
61. R. Subramanya Iyer
62. S. Subramanya Iyer
63. N. Arumuga Mudaliar
64. V. S. Subramanya Iyer
65. R. Muthukrishna Iyer
66. C. S. Mahadeva Iyer
67. S. V. Ramasamy Iyengar
68. R. Kalasthi Iyer
69. Viswanatha Sastriar
70. O. V. Sabese Iyer
71. C. S. Srinivasa Iyer
72. C. S. Swamynatha Iyer
73. K. Narayanasamy Iyer
74. M. R. Ramasesha Iyer
75. S. Subramanya Iyer
76. K. S. Kothandarama Iyer
77. T. O. Subramanya Iyer
78. A. Srinivasachary
79. A. S. Subbaiah
80. M. K. Rengasamy Iyer
81. N. Dakshnamoorthy Iyer
82. T. V. Swamynatha Iyer
83. S. Srinivasa Iyengar
84. M. Subbarama Iyer
85. Sama Ramachandra Iyer
86. T. V. Subramanya Iyer
87. S. V. Rajagopala Iyengar
88. R. Aravamudha Iyengar
89. C. Subramanya Sastri
90. C. V. Krishnasamy Sastri
91. R. Radhakrishna Iyer (Swamigal)
92. S. Ekanadha Iyer
93. E. Ramachandra Rao
94. K. M. Thirumalai Thathachariyar
95. T. S. Rangasamy Iyengar
96. V. T. Srinivasa Iyengar
97. K. S. Rajagopala Iyer
98. K. S. Ramasamy Iyengar
99. K. Subramanya Iyer
100. Mrs. S. N. Gangammal
101. G. Alagiri Iyer

102. Y. K. Sesha Iyer
103. Ramasamy Iyengar
104. Pandit S. Srinivasa Iyengar
105. Sundara Yogiswarar
106. S. Markanda Iyer
107. S. Krishna Rao
108. N. Subramanya Iyer
109. C. R. Rangasamy Iyengar
110. M. Subramanya Sastri
111. S. Venkatramna Iyer
112. R. Thiyagaraja Iyer
113. Srinagar Ramasamy
114. N. Ramanatha Iyer

**1914 (M. 106 F. 9)**

115. K. Thiruvengadathaiyengar
116. V. Samy Iyengar
117. Mrs. K. S. K. Sellammal
118. V. Ragunatha Rao
119. T. Renga Iyengar
120. S. Sanjeevi Rao
121. R. Srinivasa Rao
122. C. R. Krishnasamy Iyer
123. P. Narasimham
124. T. K. Venkatramana Rao
125. Pandit T. S. Rengasamy Iyengar
126. C. S. Swamynatha Iyer
127. T. Muthukrishna Iyer
128. C. Kotiah Naidu
129. T. A. Ganapathi Subbiar
130. T. Ragava Iyengar
131. Chidambaram Pillai
132. V.Subramanya Iyer
133. K. Muthukrishna Iyer
134. A.Sambamurthy Sastri
135. T. Krishniah
136. M. Raja Iyer
137. Sivakamu Ammal
138. V. R. Arunachala Iyer
139. M. S. Seshagiri Rao
140. Mrs. S. E. Durgambal
141. Mangalathammal
142. M. C. Bagavan Singh
143. K. R. Krishnasamy Iyer
144. T. S. Ganapathy Iyer
145. M. Ramasamy Iyengar
146. V. Muthurangam Chetty
147. P. S. Natesa Iyer
148. K. Balamukuntha Iyer
149. T. A. Venkatramana Sastri
150. R. Gopala samy Iyer
151. O. V. Sama Rao
152. K. Ramanuja Iyengar
153. N. S. Seshu Iyer
154. P. S. Narayanasamy Iyengar
155. T. M. Lakshmana Mudaliar
156. C. S. Ponnusamy Mudaliar
157. S. Gopalakrishna Iyengar
158. P. Murugappa Chetty
159. A. K. Srinivasa Asari
160. T. S. Krishna Iyer
161. C. S. Sundararama Iyer
162. K. N. Narayanasami Iyer

163. S. V. Srinivasachariar
164. M. V. Seetharama Iyer
165. T. S. Sundara Iyer
166. T. G. Chengalvaraya Iyer
167. M. S. Sivagnanam Iyer
168. V. Rangasamy Iyer
169. U. K. Ramanuja Iyengar
170. L. V. Kalla Iyer
171. N. Pichu Iyer
172. V. N. Nataraja Iyer
173. C. S. Sivaramakrishna Iyer
174. T. N. Rangasamy Iyengar
175. C. S. Ramasamy Iyengar
176. D. Mahadeva Iyer
177. K. N. Agorasiva Sastri
178. C. S. Ramana Iyer
179. C. R. Kuppusamy Iyer
180. A. S. Venkat Rao
181. G. Subramanya Iyer
182. T. Krishna Iyer
183. K. Raghavachariar
184. V. Narayana Rao
185. S. Krishnasamy Iyengar
186. R. Madhava Rao
187. B. Srinivasachari
188. S. V. Srinivasaragava Iyengar
189. S. Srinivasa Iyer (Trichy)
190. R. Regnasamy Iyengar
191. M. Sambasiva Iyer
192. S. Vengusamy Iyer
193. S. Renganatha Iyengar
194. M. Varadachariar
195. K. Duraisamy Iyengar
196. P. Subramanya Iyer
197. P. Viswanatha Rao
198. R. Krishnamachariar
199. A. S. Krishnasamy Iyengar
200. S. Ramakrishna Iyer
201. K. Kumararamaiyah
202. S. Ganapathy Iyer
203. P. M. Sundaresa Iyer
204. K. Desikachariar
205. R. V. Narayanasamy Iyer
206. N. Vasudeva Iyer
207. N. K. Balhsambandha Udayar
208. S. Muthukrishna Naidu
209. K. N. Duraisamy Iyer
210. K. Narasimhachariar
211. K. Subbaraya Moopanar
212. Madhava Rao
213. R. Rajagopala Rao
214. Lakshmi Ammal
215. P. K. Subramanya Pillai
216. G. Gurusamy Iyer
217. Thailammal
218. Janaki Ammal
219. N. Varadachariar
220. V. Ganapathy Sastri
221. C. Subbarayalu Chetty
222. C. V. Venkatrama Iyer
223. T. K. Savithri Ammal
224. Kanakavalli Ammal
225. P. S. Sambasiva Iyer
226. T. S. Sambasiva Iyer
227. T. V. Renganatha Iyer
228. J. Sowdararaja Iyengar
(749) K. Bhimasena Rao

**1915 (M. 47 F. 15)**

229. V. Kandasamy Mudaliar
230. S. Iswara Iyer
231. Sri Kothandaramaswamy
232. Seethalekshmi
233. N. Venkatrama Iyer
234. Ponnammal
235. Rajammal
236. C. V. Seethamma
237. T. V. S. Saraswathi Ammal
238. A. Thyagaiah
239. S. Madhava Rao
240. S. Renganatha Rao
241. S. Sesha Bhattar
242. K. S. L. N. Deekshadar
243. V. Srinivasachariar
244. S. V. Vijayammal
245. T. S. Alamelu Ammal
246. T. T. Bhavanisamy Rao
247. R. Samachar
248. S. Rajagopalachari
249. M. Gopala Iyer
250. D. V. Ramasamy Iyer
251. S. Kothai Ammal
252. R. Padmanabhachar
253. A. R. Ramachandra Iyer
254. D. Ramasamy Iyer
255. P. Chinnasamy Chetty
256. K. Subramanya Iyer
257. R. Kuppusamy Iyer
258. T. K. V. Padmavati Ammal
259. D. R. Janaki Ammal
260. C. Narayanasamy Naidu
261. T. M. Subramanya Iyer
262. D. Sundaresa Iyer
263. S. Renganathachar
264. S. V. Janaki Ammal
265. T. M. L. Nagammal
266. S. Srinivasa Iyer
267. Nagammal
268. N. Parthasarathi Iyengar
269. S. Duraisamy Iyer
270. S. Rajappaier
271. N. Raghunatha Iyer
272. K. S. Mahadeva Sastri
273. K. S. Chakkarapani Iyengar
274. V. Devasikamani Pillai
275. Subbarama Iyer
276. Shanmuga Iyer
277. T. N. Subramanya Pillai
278. T. A. Kumarakrishna Iyer
279. V. R. Venkatramaier
280. C. S. Rengachariar
281. T. A. K. Savithri Ammal
282. S. Ganesa Iyer
283. Sampoornammal
284. P. Raju Mudaliar
285. S. Arumugam Pillai
286. S. Nataraja Iyer
287. S. Sundara Iyer
288. C. R. Krishnasamy Iyer
289. V. Ganapathi Iyer
290. S. R. Patel

**1916 (M. 90 F. 27)**

291. Meenammal
292. N. Ramamoorthy Iyer
293. T. S. Ganesa Iyer
294. T. S. Srinivasa Iyengar
295. V. Sesha Iyengar
296. S. Venugopal Udayar
297. P. R. Sreenivasa Rao
298. Seetapathi Iyer
299. W. Sundaramma
300. M. Vishwanathaiah
301. Neelambal
302. T. Gopalasamy Naidu
303. T. Sellammal
304. S. Narasimhulu Naidu
305. Markolundhu Ammal
306. K. Adimoolam Pillai
307. M. Vijayaraghavulu Naidu
308. S. Radhakrishna Iyer
309. Marikolundu Ammal
310. N. Seetharama Iyer
311. S. Sudarsanam Naidu
312. T. S. Raghavachary
313. V. S. Pranatharthihara Iyengar
314. K. Rengasamy Iyengar
315. M. Subbamma
316. Rukmani Ammal
317. M. A. Srirengachariar
318. P. A. Venkatrama Iyer
319. Kalyani Ammal
320. V. Govinda Padayachi
321. C. Parthasarathi Mudaliar
322. A. Kalyanasundaram Iyer
323. P. Padmanabha Rao
324. Rukmani Amma
325. C. Krishnarao Sahib
326. P. Lakshmana Rao
327. P. Hari Rao
328. Lakshmi Ammal
329. T. V. Ramasamy Iyengar
330. V. Prabhakara Sastri
331. R. Ambasankar Tawker
332. Saraswathi Bai
333. T. Srinivasachariar
334. E. Manikkam Pillai
335. T. V. Srinivasa Iyer
336. P. R. Ramachandra Iyer
337. N. Ramachandra Rao
338. S. Venkatramanaiah Pantulu
339. K. N. Seethammal
340. R. Gopala Iyer
341. S. Sesha Iyer
342. P. M. S. Rajalekshmi
343. S. Murgesa Mudaliar
344. Chinnammal
345. R. P. Renganayaki
346. A. Sundararaja Iyengar
347. R. Thiagaraja Pillai
348. Guruvamma
349. T. M. Ramasamy Iyer
350. T. S. Sankara Iyer
351. S. Seshachalam Naidu
352. S. Ramasamy Naidu
353. S. K. Venugopal Naidu
354. D. R. Balaji Rao

355. V. S. Rajagopalachariar
356. K. Subramanya Iyer
357. C. Umapathi Thambiran
358. P. Kesava Naidu
359. S. Ramji Singh
360. T. N. Radhakrishna Iyer
361. Renganayaki
362. S. Srinivasavarada Iyengar
363. C. Duraisamy Pillai
364. T. A. Sowndaraja Iyengar
365. R. Venkatrama Iyer
366. K. Krishnasamy Iyengar
367. V. S. Krishnier
368. C. Ramachandra Iyer
369. R. Srinivasa Iyer
370. S. Natesa Sastri
371. Kutti Ammal
372. E. Venkatrama Sarma
373. M. K. Rangasamy Iyengar
374. Krishna Paramahamsa
375. P. R. Subramanya Iyer
376. V. Srinivasaragava Iyengar
377. Komalam
378. T. S. Kuppusamy Iyer
379. A. Vetrivel Pillai
380. S. K. Lekshmi Ammal
381. P. Krishnamurthi Iyer
382. Rukmani Ammal
383. A. M. Ramasubbaiar
384. T. Gurusamy Pillai
385. Pappathi Ammal
386. S. Mythili
387. T. N. Sethurama Iyer
388. S. Venkatrama Iyer
389. V. Dodda Arasappa
390. Channamma
391. K. S. Sowndararaja Iyengar
392. T. S. Gopinatha Rao
393. S. Perumal Reddiar
394. P. Sobanachalapathi Sarma
395. S. Ramakrishna Sarma
396. Pangajavalli Ammal
397. Seethammal
398. M. V. Jagannatha Iyengar
399. P. Viswanatha Iyer
400. M. Venkatrama Iyer
401. C. V. Subramanya Iyer
402. S. N. Hombal
403. D. Krishna Rao
404. S. Narayanasamy Iyer
405. C. R. Subramanya Iyer
406. V. Chandrasekaram
407. A. Narasinga Rao

**1917 (M. 142 F. 37)**

408. S. Ramaiyah Sarma
409. R. Subramanya Rao
410. T. G. Mahalingam
411. T. A. Seshachariar
412. T. A. S. Mangammal
413. Rajammal
414. Abishekavalli Ammal
415. R. Rengasamy Iyengar

